ఉచితం

తళతళ మెరిసే స్టెయిన్‌లెస్
స్టీల్ గిన్నె

క్రొత్త

# పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం

రెండు టిన్నులు కొన్నప్పుడు

క్రొత్త ఫారెక్స్ అధిక రుచికరం
క్రొత్త ఫారెక్స్ అధిక సంపూర్ణం

ప్రేమతో మీరు పెట్టే ప్రతి చెంచాడు
మీ పాపాయి పెరుగుదలకు మంచిది.




ఈ కానుక ఎంపిక చేయబడిన పట్టణాలలో ప్రత్యేక కానుక టిన్నులపై సరుకు వున్నంత వరకు లభ్యం.

మంచి ఆరోగ్యానికి మూలస్థానం—గ్లాక్సో

CLARION/B/GX/5/173 TEL

# చతుర

సంపుటి : 8 ఏప్రిల్ 1985 సంచిక : 3

## ఈ నెల సమగ్ర నవల

"మీరు నన్ను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నారా?" సూటిగా అడిగాడతను.

"పెళ్లంటే మీ ఉద్దేశం?" అంది రవళి.

"అగ్నిసాక్షిగా గాని, దేవుని ఎదుటగాని మనసా, వాచా, కర్మణా కలిసి జీవిస్తామని ప్రమాణంచేసి తాళి కట్టడం" వివరించాడతను.

"అలా ప్రమాణం చేసి తాళి కట్టి కూడా విడిపోయినవాళ్లూ వున్నారు. కలిసి బతకనివాళ్లూ వున్నారు. నాకు తాళి ప్రధానం కాదు. మనసూ, మనిషీ నా సొంతం కావాలి. నాకు హక్కు అక్కర్లేదు. కోరుకున్న మనిషితో కలిసి జీవించే అవకాశం కావాలి" అంది రవళి.

దానికి అతని సమాధానం ఏమిటి?

యువతుల్లో అతి అరుదుగా కన్పించే భిన్న స్వభావంగల




జీవిత పయనం ఈ మనస్తత్వ కారణంగా ఎటువైపు సాగింది? ఆమె కోరుకున్న గమ్యాన్ని చేరుకోగలిందా?

## సి. యస్. రావు

కలం నుంచి ఓ రచయిత్రి జీవన మార్గపు ఒడిదుడుకులు నేపథ్యంగా సాగిన రచన 'రవళి' ఈ నెల చతుర సమగ్ర నవల!

—o—

ముఖచిత్రం : దేవదాస్ కుసుమ్




SUPER
RIN
STRIKES WHITER

**సూపర్ రిన్ తో తళతళలాడే తెలుపు**

మరే ఇతర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు.

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

# చతుర కథలు

## వాడే వీడు

ఎప్పటిలాగానే ఈరోజూ తాపీగా నిద్రలేచి, అద్దంలో ముఖం చూసుకున్నాను. క్రితం రాత్రి ఆలస్యంగా పడుకున్నానేమో, కళ్ళు కొద్దిగా మంటలుగా వున్నాయి. బాగా వేడి చేసినట్టుంది. ఈరోజు అదృష్టం ఎలావుందో...ప్చ్... ఖర్మ చాలక చిక్కితే, పోలీసులకి అప్పచెపితే ఫర్వాలేదు. కానీ ఈ రోజుల్లో అట్లాటిపని ఎవరూ చేయటంలా. పైపెచ్చు ...కీళ్ళు తొలిగేట్టు కొట్టటం, పెదవి చిట్లేట్లు గుద్దటం. తల్చుకుంటేనే జంకుగా వుంటుంది. కానీ తప్పదు. పుట్టినందుకు బతకాలి...బతకటానికి ఈఒక్క మార్గమే నాకు తెలిసిందల్లా.

యదార్థానికి ఇట్లాటి ఆలోచన్లు మాలాటి హీరోలకి రాకూడదు. మనస్సు జంకుపడితే, వేళ్ళు కొంకర్లు పోతాయి.

పార్కు ఆదివారంనాడు చాలా సందడిగా వుంటుంది. పిల్లల పోరుపడలేక, ప్రతి వారం సినిమా చూడలేక సంసారాలు సాయంత్రం అక్కడికిచేరుతూ ఉంటారు. నేను ఒక ఖాళీ బెంచి చూసుకొని తాపీగా కూర్చున్నాను. పిల్లలతో వచ్చే జంటలను చూడగానే ఐసుబండ్లవాళ్ళు గోలగా అరుస్తూ తిరుగుతున్నారు. డబ్బులున్న వాళ్ళు పిల్లలకి కొని పెడుతున్నారు. లేని వాళ్ళు పిల్లలని చివాట్లుపెట్టడం చేస్తున్నారు. ఎంత చూసినా బికారివాళ్ళే గాని పదిరూపాయలు జేబులో ఉన్న వాళ్ళు కనపడటంలేదు.

చీకటి పడుతోంది. చిన్న ఆశాకిరణం తళుక్కుమంది. అతనికి సుమారు ఇరవై



ఐదు సంవత్సరాలు ఉంటాయి. బొద్దుగా ఉన్నాడు. అందం సంగతి తరువాత ముందు జేబు బరువును అంచనావేయటం మొదలుపెట్టాను. నా అంచనా ప్రకారం 100రూపాయలకు తక్కువ ఉండని పర్సు నా ఎక్సరేకళ్ళకు లీలగా కనబడినట్లయింది.

లేచి ఒక్కమారు ఒళ్ళు విరుచుకున్నాను. వేళ్ళకు చురుకుతనం రావటానికి మెటికలు పటపటలాడించాను. నెమ్మదిగా అతని వైపు కదిలేను. పాపం అభాగ్యుడు. ఈరోజు పర్సు పోగొట్టుకోబోతున్నాడు. చూసీచూడనట్లు ఎదురుగాపోయి కాలుజారి పడుతున్నట్టు పడబోతూ అతనిని ఆసరాగా తీసుకుని నిలదొక్కుకున్నాను.

అంతే! నా పని అయిపోయింది.

"ఏయ్, మిస్టర్ ! పార్కులో జాగ్రత్తగా చూసినడవాలయ్యా! పిల్లలేంటిలే పెద్దలు కూడా అరటి పండ్లు తిని తొక్కలు ఎక్కడ పడితే అక్కడ పారవేస్తున్నారు. దెబ్బలేం తగలలేదు కదా?'' అని ఓదార్చాడతను.

''లేదుసార్. మీ ఆధారం లేకపోతే నా ముఖం చెక్కుకుపోయేదే ... చాలా థాంక్సండీ''

లోపల నవ్వుకుంటూ నేరుగా పార్కు బయటకువచ్చాను.అమ్మయ్య..అనుకొన్న పని ఐదునిమిషాలలో సాధించాను. సరే, దూరంగాఉన్న చెట్టుకిందకు చేరాను. క్రీనీడలో వారగా పర్సు తీసి చూశాను. ఆశ్చర్యం! నేను ఊహించిన లెక్క తప్పు. అందులోని ఏడు యాభైరూపాయల కాగితాలూ స్పర్శించి అనుకోని అనుభూతిని పొందాను. ఒక నోటు పైజేబులోవేసుకొని పర్సు పాంటుజేబులో దాచి తిన్నగా ఫర్లాంగు దూరంలో ఉన్న బారుకి దారితీసాను.



మూలగా ఉన్న టేబుల్ దగ్గిర కుర్చీలాక్కొని కాళ్ళు బారచాపి హాయిగా ఫీలయ్యాను.

''సర్'' బేరర్ నమ్రతగా,మృదువుగా పిలిచిన పిలుపుకు చిరునవ్వుతో బీరుకు ఆర్డరు ఇచ్చాను. ఐదారు రోజుల నుంచి శరీరంలో పేరుకున్న వేడి ఈ దెబ్బతో పూర్తిగా పోవాలి- ఆలోచిస్తూనే బీరును పూర్తిగా తాగాను.

''సర్! ఇంకొకటి ఇవ్వమంటారా?''

"యస్ ! చిల్లీ చికెన్‌తో పట్రా" అన్నాను.

ఒళ్ళు తిమ్మిరెక్కినట్లుంది. అప్పుడు చూశాను. ఎదురుగా నేవున్న టేబులువద్ద ఇంకో వ్యక్తి విస్కీ తీసుకుంటున్నాడు. నాకు మాత్రం విస్కీ, బ్రాందీ లంటే అంత ఇష్టంలేదు.మర్నాటికిమెడనొప్పులు, తలనొప్పి వస్తాయి. అందుకే సాధ్యమైనంత వరకు బీరుతోనే తృప్తిపడతాను.

''బేరర్! బిల్లు పట్రా'' అన్నాను కాసేపాగి. అయిదు నిమిషాల్లో బిల్లు పట్టుకొచ్చి నమ్రతగా చేతులు కట్టుకొని నిలబడ్డాడు. ముచ్చటవేసింది. నలభై ఐదురూపాయలు, పెద్ద బిల్లు ఏమీకాదు. సాధ్యమయినంత స్టయిల్‌గా 50 కాగితం తీసి ఇచ్చాను.

"మిగిలింది ఉంచేసుకో" అనగానే, సమస్కారంచేసి బేరర్ వెనక్కు తిరిగాడు.

"నా బిల్లుపట్రా" ఎదుటిటేబుల్ వ్యక్తి బేరర్‌తో అన్నాడు.

''ముప్పై రెండు సార్''.

అతను మెల్లిగా జేబులో చెయ్యిపెట్టి ఉలిక్కిపడ్డట్టు అయ్యాడు. ''అరే! పర్సేది?''అని పెద్దగా పైకే అనేశాడు.

బేరర్ నిశితంగా అతన్నే చూస్తున్నాడు. అతని మాటలు, కదలికలు అస్తవ్యస్తంగా ఉన్నాయి.

''ఏమిటి సార్?'' అడిగాను.

"నా పర్సు పోయింది. ఉన్నదనుకొని వచ్చాను" మాట ముద్దగా దొర్లుతోంది.

"ఇప్పుడు ఎట్లా?'' అనిగొణుక్కుంటున్నాడు.

"ఏమీ అనుకోకపోతే...బిల్లు నేనిస్తా" జేబులో చెయ్యిపెట్టి దగ్గరగా, సాధ్యమైనంత స్టయిల్‌గా పర్సుతీశాను.

అంతే! నా ముఖం మీద పిడుగులాంటి దెబ్బపడింది. కళ్ళు... మూ... త...లు ...ప... డు... తు... న్నా... య్.... అ...బ్బా... నా... త... ప్పే... మి...టో...?

—డి. మల్లికార్జునరావు





# జేబురుమాలు

ఎలాగయితేనేం కుస్తీపట్టి, దొమ్మీలో యథాశక్తిన నెగ్గి, టికెట్లు తీసుకొచ్చేశాడు ఫణి.

చొక్కా భ్రష్ఠంగా నలిగిపోయింది. జుట్టంతా రేగిపోయింది. చెమట ధారాపాతంగా కారిపోతోంది.

మాకు కొంచెం దూరంగా నిలబడ్డ అమ్మాయిల్ని చూసి, అర్జంట్‌గా పాంట్ జేబులోనుండి దువ్వెన తీసేసి, తల సర్దేసుకున్నాడు. జేబురుమాలులోని పౌడర్‌ని ముఖానికి 'పామే'సుకొన్నాడు.

హాల్లోకి నడుస్తూ, అడిగాను వాణ్ని – "ఎన్నోసారిరా ఈ 'ప్రేమ పక్షులు' సినిమా చూడటం?"

నవ్వి, సగర్వంగా చెప్పాడు ఫణి – "పదోసారి బ్రదర్! వరసగా పదిరోజులు 'ఫస్టు షో'లకి హాజరయిపోతున్నాను. అబ్బో...'అందాలు' తెగ వచ్చేస్తున్నాయనుకో. వాళ్ళ గురించే నేనీ సినిమా చూస్తూంట. ఏం కలర్స్? ఒక్కొక్కళ్ళందాన్నీ చూస్తుంటే అబ్బా! మతిపోతుందనుకో" తల పట్టేసుకొంటూ చెప్పాడు.

"మరే పాపం!" ఒప్పేసుకొన్నాను. ఫణికి చీటికిమాటికి మతి పోతూనే వుంటుంది. వయసులో వున్న కుర్రాళ్లందరూ ఇంచుమించు సామాన్యంగా అమ్మాయిలని 'ఇష్ట'పడతారు. ఫణి మిగిలిన వాళ్ళకన్నా కొంచెం ఎక్కువగా ఇష్టపడుతుంటాడు.

మేం వెళ్ళేటప్పటికి హాల్ ఇంకా హౌస్ ఫుల్ కాలేదు. ఖాళీగా వున్న వరస చూసుకొని, ఆ వరసలోని మొదటి రెండు సీట్లలోనూ కూర్చున్నాము.

మా పక్కన వున్న రెండు సీట్లమీద

చేతిరుమాలు పర్చేసాడు.

"ఎందుకురా అది? ఎవరయినా మన ఫ్రెండ్స్ వస్తానన్నారా?" ఆశ్చర్యపోతూ అడిగాను.

"ఓరి పిచ్చివాడా!" అన్నట్లునవ్వాడు ఫణి. "ఇంక అయిదు నిమిషాల్లో థియేటరంతా హౌస్‌ఫుల్ అయిపోతుంది. మన పక్కనున్న ఈ రెండు సీట్లు తప్పించి,ఎవరయినా అడిగితే'రిజర్వేషన్' అని చెబుతాము''

"అంటే సీటు ఏ రూపాయికో అమ్ముతావా?" అమాయకంగా అన్నాను.

"ఛా! ఈసీట్లు అమ్మాయిలకి మాత్రమే ఇవ్వబడును. ఎవరైనా ఇద్దరు అందమైన అమ్మాయిలు సీట్లు వెతుక్కుంటూ ఇటువేపొచ్చినప్పుడు, బుద్ధిమంతుల్లా ఆ చేతిరుమాలు తీసేస్తాం. అప్పుడు వాళ్లు ఏ సీట్లూ లేకపోవటంతో విధిలేక తప్పనిసరిగా మన పక్కన కూర్చుంటారు. అందమయిన అమ్మాయిల పక్కన కూర్చుని, 'ప్రేమపక్షులు' సినిమా చూడటం ఎంత థ్రిల్లింగ్‌గావుంటుంది?!''

తన ప్లాన్ వివరించాడు ఫణి.

'నిజమే సుమా!' అనిపించింది నాకు. అమ్మాయిల పక్కనే కూర్చుని 'లవ్ పిక్చర్' ఎంజాయ్ చెయ్యటం ... ''అద్భుతం గురూ!'' వాడి భుజం చరిచి, నా ఆనందాన్ని తెలియజేశాను.

ఎవరయినా వచ్చి, సీట్ల గురించి అడిగితే, "అబ్బే...లేదు సార్! రిజర్వ్‌డ్" అని చెప్పసాగాను-కళ్ళముందు'అందాల' పక్కన కూర్చుని, సినిమా చూస్తున్న దృశ్యం చూస్తూ.

పిక్చర్ టైటిల్స్ ప్రారంభమయ్యాయి. హాలంతా నిండిపోతోంది.

ఇంతలో ఇద్దరు అందమైన అమ్మాయిలు ఇటే రాసాగారు.

"ఒరేయ్ ఫణీ! హేండ్ కర్చీఫ్ తీసెయ్యడా తీసెయ్!!" నా గుసగుస పూర్తి కాకముందే ఖంగుమంటూ ఓ కంఠం వినిపించింది అటువేపునుంచి.

"ఎవడెహె?!ఈ కుర్చీల్లో జేబుమాల్లు వేసారూ?? రేయ్ బావా ... కూసోహె! ఎవడొత్తాడో చూత్తాను."



ఉలిక్కిపడి, నా పక్కకు చూసాను. ఇద్దరు కూలీపనివాళ్ళు మా పక్కసీట్లు ఆక్రమించేశారు. 'నాటుసారా వాసన' గుప్పుమంటోంది వాళ్ళ దగ్గర.

నోట్లోని కారాకిళ్ళీ నములుతూ తుపుక్కున వుమ్మెయ్య సాగారు. పొరబాటున వాళ్ళల్లో ఒకడి చేతి మీద పడితే, మా జేబు రుమాలుతో తుడిచేసుకుంటున్నాడు.

మేం జేబురుమాళ్ళ వదులుకుని దిగులుగా అలాగే ఉండిపోయాం.

—విపంచి

# బల్లి పతన ఫలం

మాగన్నుగా నిద్రపట్టే సమయానికి 'తప్'మని మెత్తగా ఏదో పదార్థం పొట్ట మీద పడేసరికి, ఆ కాస్త నిద్రా పటాపంచలయి, కంగారుగా మంచం దిగి లైట్ స్విచ్ ఆన్ చెయ్యగానే గదంతా దేదీప్యమానం అయింది. అనుమానంగా మంచం మీదా—కిందా గోడ మూలల్ని పరిశీలిస్తున్నాను. సీత చికాకుగా లేచి కూచుంది—"ఏవిటండీ గొడవ?" అంటూ.

"ఏంలేదులే" అని గొణుగుతూ వెదుకుతున్నాను.

"ఏవిటండీ ... ఏమయింది?" రెట్టించింది.

చెప్పేను. అంతా విని ఓసారి పక్కంతా పరికించి చూసింది. "అదుగో చూడండి'' అంది. అటు చూసాను. చిటికిన వేలంత బలపం ముక్కలా కనిపించింది. భయం భయంగా ఆ పక్కనే తోక తెగిన బల్లి జర జర పాకుతోంది.

అర్థమయింది — నా పొట్ట మీద బల్లి పడింది. దాని తోక తెగింది.





''మీరు వెంటనే బాత్‌రూమ్‌కి వెళ్ళి కాళ్ళు, చేతులు, మొహం కడుక్కుని రండి. తర్వాత అక్కడ మా నాన్నగారి ఫొటో ఒకసారి ముట్టుకుని, దండం పెట్టండి. ఆయన కంచి వెళ్ళి బంగారు బల్లి ముట్టుకున్నారు. ఆయన ఫొటోని తాకుతే పాపం పరిహారం అవుతుంది"

మారు మాటాడకుండా చెప్పినట్టు చేశాను.

సీత పంచాంగం తీసి, పేజీలు తిరగేస్తోంది.

"ఆ(... దొరికింది. వూ(... బల్లి పతన ఫలం... శిరస్సు... కలహం..." అంటూ గొణిగి, ఒక క్షణం ఆగి "ఏవండోయ్! 'మీకు సంతాన ప్రాప్తి'...ట" అంది.

పరమనాస్తికుడినైననాకు, ఆస్తికురాలైన సీతను ఈ దెబ్బతో, ఛాదస్తాలూ, మూఢ నమ్మకాలూ, దేవుడూ గట్రా అంతా... ఉబ్బిపోతూ — "సీతా ఎంత అమాయకురాలివి. ఇంకా మనకు సంతాన ప్రాప్తేంటి...? ఈ పాత పంచాంగాలు తిరగ రాయాలి. కాలమాన పరిస్థితుల్ని బట్టి... ఇప్పటికేనా ఈ ఛాదస్తాలు మానావా? కుటుంబనియంత్రణ ఆపరేషను అయిం తర్వాత—ఇంకా సంతాన ప్రాప్తేంటి...? శాస్త్రం వమ్ము అయింది కదా! పాపం పంచాంగ కర్త పప్పులో కాలేశాడు '' అన్నాను వెటకారంగా నవ్వుతూ.

"శాస్త్రం ఎప్పుడూ వమ్ము కాదండీ! ఆపరేషన్ చేయించుకున్నది నేనూ, బల్లి పడింది మీ పొట్ట మీద. మీరెక్కడ ఏ వెధవ్వేషాలేస్తున్నారో నాకెన్నడూ చెప్పకపోయినా బల్లి చెప్పేసిందండీ!" అంది కోపంగా.

ఖంగుతిన్నాను నేను!

—ఎ. బి. సుందరరావు

# సితార

• మీరు అభిమానించేది ఏ తారనైనా సరే
మీకు కావలసింది సితార

• మల్టీకలర్ ముఖచిత్రమే కాదు, అనేక రంగుల సెంటర్
స్ప్రెడ్‌తో మిమ్మల్ని మురిపించి, మైమరపిస్తుంది
సితార

ఆకాశంలో వెలిగేది ధ్రువతార
సినీజగతిలో వెలిగేది సితార

• సినిమాకు సంబంధించిన అన్నిరకాల వార్తలకు,
వ్యాఖ్యలకు, కబుర్లకు, విమర్శలకు పెట్టింది పేరు
సితార



ఈనాడు కాంపౌండ్, సోమాజిగుడా
హైదరాబాద్ - 500 004

చుట్టూ ఎత్తయిన ప్రహరీ. దానికివతల గోడనానుకొని పేవ్‌మెంట్ మీద రకరకాల షాపులు. రోడ్డుమీద రద్దీ. లోపల కాలేజీ వయస్సును గుర్తుచేస్తూ ఎత్తుగా, గుబురుగా ఎదిగిన చెట్లు.

ఆ ఉమెన్స్ కాలేజీ గేటుముందు కావాలనే ఇద్దరు ముగ్గురు స్టూడెంట్స్ స్కూటర్‌నానుకొని కబుర్లు చెప్పుకుంటూంటే కాస్త ఎడంగా బీడీ కాల్చుకుంటూ బీట్ కానిస్టేబుల్ దిక్కులు చూస్తున్నాడు.

బెల్ అయింది.

అది లంచ్ అవర్.

క్లాస్‌రూమ్స్‌లోంచి విద్యార్థినులందరూ బయటికొచ్చేశారు. కొంతమంది అమ్మాయిలు చెట్లనీడకు చేరారు. టిఫిన్ బాక్సులను ఓపెన్ చేసుకొని, నలుగు రైదుగురు కల్సి, ఒకళ్లు తెచ్చిన టిఫిన్‌ను మరొకళ్లు పంచుకొంటూ, కబుర్లు చెప్పుకుంటూ తింటున్నారు.

మరికొంతమంది అమ్మాయిలు బయటికి వెళ్ళిపోతున్నారు. కొందరు క్యాంటీన్ వైపు వెళ్లారు. కాలేజీ ఆవరణ రంగురంగుల తారలతోనిండిన ఆకాశంలా ఉంది.

బొటానికల్ గార్డెన్‌లో ఓ చెట్టుకింద రాణి, వనజ కూర్చున్నారు. మంజూ, రవళి ఎందుకో పెద్దగా నవ్వుకుంటూ వచ్చి వీళ్ళతో చేరారు.

"ఎందుకోయ్. అంత నవ్వు" అంది వనజ.

వచ్చే నవ్వును ఆపుతూ, "ఇదో పెద్ద మంకీ" అంది రవళి మంజూ వీపుమీద చరుస్తూ.

"నవ్వు నాలుగువిధాల నష్టమంటూ వుంటుంది మా నాయనమ్మ. అందులోనూ ఆడపిల్లలు అసలు నవ్వకూడదట!" అంది రాణి.

"కాలేజీలో కూడా నాయనమ్మ కబుర్లెందుకోయ్ రాణీ" అంది వనజ.

"అన్నమాట చెప్పాను" అంది రాణి.

"మగవాళ్ళముందు నవ్వకూడదుగానీ, అందరూ ఆడవాళ్ళే వున్నప్పుడు నవ్వొచ్చు, తుళ్ళొచ్చు" అంది వనజ.

"సర్లెండర్రా! ఆకలేస్తోంది. హోటల్‌కు పోదామా? లేక క్యాంటీన్‌కు పోదామా?" అంది రవళి.

"క్యాంటీన్‌కెందుకోయ్! రోజూ ఆ రవ్వకేసరీ, సొమాసాయేగా? బయటకే పోదాం" అంది మంజూ.

నలుగురూ లేచారు.

వనజా, రాణీ, మంజూ అల్ట్రా మోడరన్. మంజూ జీన్స్‌లో వుంది; రాణి పంజాబీ యూనిఫారమ్‌లో వుంది; వనజకు బాబ్డ్ హెయిర్, టైట్ ప్యాంట్, పైన 'టీ'షర్టు. వాళ్ళల్లో రవళే ప్రత్యేకంగా కొట్టొచ్చినట్టు కనబడుతుంది. నుదుటిమీద పావలా అంత బొట్టు, ఆమె నడకరు లయగా, వొయ్యారంగా వూగే వాలుజడా, శరీరానికి నప్పే కాశ్మీర్‌సిల్కు సీరా, మోచేతులదాకా బ్లౌజూ, తగు మాత్రమైన ఎత్తూ, ఎత్తుకు తగిన వొళ్లూ, అన్నిటికీ మించి ఆమె కళ్ళల్లో ఒక రకమైన తీక్షణతా! ఒక్క క్షణం ఆగి మరీ చూడాలనిపించే ఆకర్షణ ఉంది ఆమెలో. రవళిని ఎవరు ఎప్పుడు చూసినా అందంగానే వుంటుందంటారు. ఆమె ఏ మగవాడివంకయినాచూస్తే, ఆమె చూసినట్టు మగవాడు గ్రహిస్తే అతను ఎంతటి వాడైనా ఒక్క క్షణం ఆమెను చూడకుండా వెళ్ళలేడు. ఆమెలో ఏదో హుందాతన ముంది. అందుకే అంత అల్ట్రా మోడరన్‌గా వుండే రాణి, వనజ, మంజూ





లకు సైతం రవళి అంటే ఇష్టం. ఇష్టం మాత్రమేకాక ఓరకమైన గౌరవంకూడా రవళి పీళ్ళ ముగ్గుర్నీ అదుపు చేస్తుంటే వాళ్ళెవరూ కాదనలేరు.

నలుగురూ హోటలువైపు నడుస్తున్నారు.

"ఇందాక ఎందుకోయ్ అంత పెద్దగా నవ్వుకుంటున్నారు మీ రిద్దరూ?" మంజూను అడిగింది రాణి.

"ఇందాక స్టాఫ్‌రూమ్ ముందునుంచి నేనూ, రవళీ వస్తూంటే హిస్టరీ లెక్చరర్ రవళిని చూసి నవ్వారు. నేను ఆయన్ను చూసి నవ్వాను"

"నిన్ను చూసి నవ్వలేదా ఆయన?" మంజూ మాటకు అడ్డొచ్చింది రాణి.

"నేనంటే భయంలే. నన్ను చూసి నవ్వటమే?"

"నువ్వంటే భయం ఎందుకు?"

"మనం మాట్లాడితే కంకరరాయి పుచ్చుకు కొట్టినట్లేగా!"

"మరి రవళి?"

"ఆమె మాట్లాడితే మెత్తని ఫోమ్ చెప్పుతో కొట్టినట్లుంటుంది"

"ఇంతకీ ఏమంటాడు ఔరంగజేబు?"

"ఔరంగ్‌జేబ్ ఎవడు?"

"అదేనోయ్. హిస్టరీ లెక్చరర్"

"ఆయన పేరు ఔరంగజేబా?"

"కాకపోవచ్చు. హిస్టరీ లెక్చరర్లను అలా హిస్టారికల్ పేరుతో పిలవడం మనకలవాటు. ఇంతకీ మీరెందుకు నవ్వారో చెప్పారు గాదు"

"చెబుతా. ఆయన రవళిని ఆపుచేసి, 'సూర్యహాన్ మీద వండర్‌ఫుల్ బుక్కొచ్చింది. నువ్వు తప్పకుండా చదవాలి...' అని ఏదో చెప్పబోతున్నాడు. అప్పుడు రవళి చాలా తెలివిగా అడ్డుతగిలి 'వెరీనైస్ ఆఫ్‌యు, ఫోర్‌వో క్లాక్‌కి వొచ్చి తీసుకుంటాను.ఇప్పుడాకలేస్తోంది. సీ యు సర్' అని ఆయన్ని మళ్ళీ మాట్లాడనివ్వకుండా, వెనక్కి తిరిగి చూడకుండా ఇటు వచ్చేసింది. 'ఎందుకోయ్... పాపం ఆయన్నంత మరీసున్నితంగా వొదిలించుకున్నావ్, అని అడిగాను మన రవళిని'"

"'ఏమంది?" అడిగింది రాణి కుతూహలంగా.

"ఆయన హిస్టరీ లెక్చరర్. ఏం చెప్పినా హిస్టరీలా చెబుతారు. క్లాసు తీసుకున్నా ఒన్ అవర్. బయట మాట్లాడటం మొదలెట్టినా ఒన్‌అవర్. ఈలోగా బెల్ అయిపోతుంది! లంచ్ అవర్ అయిపోతుంది. లంచ్ లేకుండా క్లాసుకు వెళ్లాల్సి వస్తుంది' అంది మన రవళి. క్లాసు తీసుకున్నా ఒన్‌అవర్, బయటమాట్లాడినా ఒన్ అవరే అన్న మాటకు నాకు నవ్వొచ్చింది.'యూ నాటీ' అని రవళి నడుంమీద గిల్లబోయాను. రవళికి వల్లమాలిన కితకితలుగదా! 'డోంట్ బి సిల్లీ' అంటూ నన్ను వారిస్తూ నవ్వ మొదలెట్టింది. అలా ఇద్దరం నవ్వుకుంటూ మీ దగ్గర కొచ్చాం"

"ఎక్కడకోయ్ అలా పోతున్నారు? మాటల్లోబడితే చుట్టూరా ప్రపంచాన్నే మర్చిపోతారు. హోటల్‌కు వచ్చేశాం" అంది రవళి.

"మమ్మల్ని కాపలా కాయడానికి నువ్వున్నావు గదా! అందుకే ధైర్యంగా మా లోకంలో మేమున్నాం" అంది మంజూ.

నలుగురూ హోటలుకెళ్ళి, ఫ్యామిలీ సెక్షన్‌లో కూర్చున్నారు. ఎవరికి కావాల్సిన టిఫిన్లు వాళ్ళు ఆర్డరిచ్చారు. రాణి సర్వర్ టేబుల్ మీద పెట్టివెళ్లిన

గ్లాసుడుమంచినీళ్ళనూగడగడా తాగేసింది

"వసపోసిన పిట్టలా ఆ వాగడమెందుకు, అన్ని నీళ్ళు తాగడమెందుకు" అంది వనజ రాణితో.

"నీళ్లు ఎక్కువ తాగడం హెల్తుకు మంచిదంటుంది మా నాయనమ్మ"

"ఈ రాణి అన్నింటికీ వాళ్ళ నాయనమ్మను కోట్ చేస్తుంది. ఆవిడేదో పెద్ద ఎన్‌సైక్లోపీడియా అయినట్టు!"

"ప్రస్తుతం ఇంటికెళ్ళితే నా కంపెనీ నాయనమ్మే, ఆవిడకు కంపెనీ నేను" అంది రాణి.

వనజ నవ్వింది.

"ఈ రాణీకి, మంజూకి పెళ్ళయ్యాక ఇరుగూ పొరుగూగా మటుకు వీళ్లిద్దరు వుండకూడదు"

"నీకేమైనా ఇబ్బందా?" మంజూ అడిగింది కొంటెగా.

''నాకేమీ ఇబ్బంది లేదులే! అప్పుడు కూడా మీరిద్దరూ ఇలా మాటల్లోనే మునిగిపోతే మిమ్మల్ని కట్టుకున్న ఆ పురుష పుంగవులు ఏమైపోవాలా అని" అంది వనజ.

"వనజకి దూరదృష్టి ఎక్కువోయ్! మనం కాలేజీలో క్లాస్‌రూమ్‌లో కూర్చున్న దగ్గర్నుంచి గ్రాండ్‌మదర్స్ అయ్యేదాకా ఆలోచిస్తుంది''

రవళికి విసుగనిపించింది.

"మీరు మాట్లాడకుండావుండటానికేం కావాలి?" అంది కాస్త చిరుకోపంగా రవళి.

"వడ"

"ఆర్డరిచ్చాంగా?''

"వడొస్తే అది నములుతూ వుంటాం... మాట్లాడం''

నలుగురూ నవ్వుకున్నారు.

సప్లయర్ టిఫిన్లు తెచ్చాడు.

టిఫిన్లు తిన్నారు. నలుగురికీ ఆకలిగా వుండటంచేత ఎక్కువగా ఎవ్వరూ మాట్లాడలేదు. మంజూ ఏదో మాట్లాడబోయింది. రాణీ తన ప్లేట్లోవున్న వడ ముక్కను తీసి మంజూ నోట్లో పెట్టింది. మంజూ 'ఇదేమిటి?' అన్నట్టు చూసింది.

రాణి "నవులు...మాట్లాడకు" అని రవళి వైపు చూపెట్టింది.

మంజూ నవ్వింది. నవ్వితే కొంచెం మారింది.

''అందుకే తినేటప్పుడు సైలెంట్‌గా వుండమంటాను" అంది రవళి.

మంజూ సర్దుకోవడానికి ఓ నిమిషం పట్టింది. కళ్లు ఎర్రబడ్డాయి. కళ్ళ వెంట నీళ్ళు వస్తున్నాయి. తన బ్యాగ్‌లోని కర్చీఫ్ తీసి మంజూకిచ్చింది రవళి. కళ్ళు పొత్తుకొని "థ్యాంక్యూ!" అని కర్చీఫ్ తిరిగి ఇచ్చేసింది.

''మంచినీళ్లు తాగు'' అంది రవళి.

"ఎవరో తల్చుకున్నట్టున్నారు" అంది రాణి.

''ఆఁ... మీ నాయనమ్మ" అంది మంజూ.

"మీ ఇద్దరూ నిజంగా కోతులేనర్రా!" అంది రవళి పెద్దరికంగా.

"మనకిది రోజూ మామూలే గానీ, 'సాగర సంగమం' ఆడుతోందిట...వెళదామా?" ప్రపోజ్ చేసింది వనజ.

"ఎకనామిక్స్ క్లాస్ ఎగ్గొట్టా?" అంది రవళి.

"అవును. ఎప్పుడూ ఆవిడ నోట్స్ గదా డిక్టేట్ చేసేది. మా అక్కయ్య చదువుకొనేటప్పుడు కూడా ఆవిడే మేడమ్. అదే నోట్స్. మా అక్కయ్య దగ్గరుంది. మీరందరూ కూడా కాపీ చేసుకోవచ్చు...పోదాం పదండి"

రవళికి కూడా 'సాగర సంగమం చూడాలని వుంది. చూసినవాళ్లు బాగుం దని చెప్పారు.

నలుగురూ సరేననుకొని రాయల్ టాకీసుకు బయలుదేరారు.

* * *

నలుగురూ సినిమా చూశారు.మధ్యలో ఎవ్వరూ మాట్లాడలేదు. సినిమా అయి పోయాక బరువుగా బయటికొచ్చారు.

"ఇప్పుడు ఎక్కడికి వెళదాం?" అంది రాణి.

''ఇంటికి వెళ్ళవా?" అంది మంజు.

"వెళదాం లేవోయ్! కాసేపు అలా వెళ్ళి ఏదైనా పార్కులో కూర్చుంటే బెటరేగదా?" అంది రాణి.

"అవును. కాసేపు పార్కులో రిలాక్సయి వెళ్లిపోదాం. పిక్చర్ చాలా హెవీగావుంది" అంది రవళి.

నలుగురూ ఒకే ఆటో ఎక్కి పబ్లిక్ గార్డెన్‌కు వెళ్లారు. జనం తక్కువగా వున్న ఓ పొద పక్కన కూర్చున్నారు. లోపలకు వచ్చేటప్పుడే రాణి గేటు దగ్గర పల్లీలు కొంది.

"ఇదో పెద్ద రైసుమిల్లు. ఏదో ఒకటి నములుతూ వుండకపోతే తోచదు" అంది వనజ రాణిని ఉద్దేశించి.

"అసలు సినిమా హాలులోనే ఇంటర్ వెల్‌లో కొందామనుకున్నాను. ఎవడూ కనపళ్ళేదు" అంది రాణి పల్లీలు నోట్లో వేసుకుంటూ.

"కమల్‌హాసన్ చాలా బాగాచేశాడు" అంది రవళి-తాను పొందిన అనుభూతిని వ్యక్తంచేస్తూ.

"బాగా చేశాడని నెమ్మదిగా అంటా వేమిటి? కమల్ అంటే నాకెంత ఇష్టమో తెలుసా? నాకు ఛాన్స్ దొరికితే అతన్ని గట్టిగా 'హగ్' చేసుకుని ఆ రెండు కళ్ళ మీద ఆగకుండా వందేసి ముద్దులు పెట్టు కుంటాను" అంది రాణి. ఇంకా తృప్తి చెందక ఏదో చెప్పాలనే తపనతో, "కమల్‌లో ఎంత 'ఈజ్' వుందో.." అని రాణి ఏదో చెప్పబోయింది.

"అరవకు....ఎవరన్నా వింటే బావుం డదు" అంది వనజ.

''దీని తలకాయ. కమల్‌హాసన్ దేముంది? ఆ పాటలు పాడిన బాలు సంగతి ఎత్తరేం? మీరెవరైనా చూశారా బాలును? నేను చూశా. బూరెల్లా బుగ్గలు, మనిషి లడ్డూలా వుంటాడే కానీ, ఆ గొంతు? ఎంత రేంజ్! లైట్‌మ్యూజిక్ పాడతాడు, కర్నాటిక్ మ్యూజిక్ పాడతాడు. హిందూస్తానీ,పాప్,వాట్‌నాట్? రియల్లీ థ్రిల్లింగ్. అలా బాలు ముందు కూర్చుని అతను పాడుతూంటే ఆ లైవ్ సాంగ్ విని, తన్మయత్వం చెందాలి. అలాంటి అవకాశమే నాకొస్తే అతనికి నా లైఫే ఇచ్చేస్తాను" అంది ఆవేశంగా మంజు.

''నీ మొహం. బాలూ, కమల్, అమి తాబ్ ఏముంది వీళ్ళల్లో? సీ, గవాస్కర్. అతను స్టేడియంలోకి ఎంటర్ అవు తూంటే ఓహ్...ఆ స్టైయిలే వేరు. బ్యాట్ పట్టుకుంటే ఎంత మంది ఫ్యాన్సు! మీరెన్ని చెప్పండి. అతన్ని గురించి ఏం చెప్పాలో నాకు తెలీదుగానీ జస్ట్ అతనంటే నేను పడిచస్తాను. రియల్లీ అయ్ డై ఫర్ హిమ్. లైఫ్‌లో ఎప్పుడో ఒక్కసారి అతని దగ్గర ఓ షేక్‌హేండ్ తీసుకోవాలి" అంది వనజ.

"షటప్! రాణి కమల్ అంటుంది, మంజూ బాలూ అంటుంది, నువ్వేమో గవాస్కర్ అంటావు. మీకేమైనా మతులు

 

పోయాయా? కమల్‌కి నటన వృత్తి. బాలుకు పాడటం వృత్తి. గవాస్కర్ ప్రొఫెషనల్ ప్లేయర్. ఒక డాక్టరూ, ఒక ఇంజనీరూ, లాయర్‌లాగే వాళ్ళు బతుకుతున్నారు. వాళ్ళకి ఫ్యామిలీస్ ఉన్నాయి. బాధ్యతలు ఉన్నాయి. ఊరికే ఏదోవూహించేసుకొని, ఊహల్లో విహరించేయటంకంటె ప్రాక్టికల్‌గా ఆలోచించడరా. మీరు కోరుకున్నవాటిల్లో ఏది జరిగినా నష్టపోయేది మీరేగానీ, వాళ్ళు కాదు. పదండి పోదాం" అంటూ లేచింది రవళి.

రవళి మాటకు ముగ్గురూ ఎదురు చెప్పలేదు. వెంటనే సమాధానం చెప్పే రాణీ కూడా మౌనంగా వుండిపోయింది.

"కాసేపు కూర్చుందామనుకున్నాం గదా" అంది వనజ.

"లేదులే! చీకటి పడుతోందిగా ... పోదాం" అంటూ నడిచింది రవళి. ఆమె వెనుకే రాణీ, వనజా, మంజూ నడిచారు. బయట గేటుదగ్గరకొచ్చి ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

రవళి సోమాజిగూడా వెళ్ళాలి. అక్కడ ఓ చిన్న పోర్షన్‌లో వుంటోంది. ఇంట్లో వంటమనిషి వుంది. తనకోసం తాతయ్య చేసిన ఏర్పాట్లు అవన్నీ. సిటీలో తెల్సిన వాళ్ళూ, దూరపు బంధువులూ ఉన్నా ఎవరింట్లోనూ రవళిని ఉంచడానికి ఆమె తాతగారికి ఇష్టంలేదు. ఉమెన్స్ హాస్టల్లో ఉండటం రవళికి ఇష్టం లేదు. చదివేది బి.ఎ. అయినా ఆమె కోసమని ప్రత్యేకంగా ఒక వంటమనిషినీ, ఓ ఇల్లూ ఏర్పాటుచేశాడు. తాతగారు రాఘవేంద్రరావు నెలకోసారి వచ్చి కావాల్సిన డబ్బు ఇచ్చి వెళ్ళిపోతాడు.

రాఘవేంద్రరావు తమ స్వస్థలం పెద్దపల్లి. చుట్టుపక్కల కాలేజీలు ఉన్నా, మనమరాల్ని బాగా చదివించాలనే ఉద్దేశంతో హైదరాబాద్‌లో పెట్టి చదివిస్తున్నాడు. ఇంట్లో రవళీ, పనిమనిషీ మాత్రమే ఉండటంచేత రవళికి కావల్సినంత స్వేచ్ఛ. రవళి విచ్చలవిడిగా తిరిగే అమ్మాయి కాదు. పుస్తకాలంటే ఇష్టం. మార్కెట్‌లోకి కొత్త నవల వస్తే మొట్టమొదట కొనేది ఆమే. అలాగే వార, మాస పత్రికలు కూడా వరసతప్పకుండా చదువుతుంది. ఆలోచిస్తుంది.

రవళి ఇల్లు చేరుకుంది.

వంటమనిషి యాదమ్మ టీ ఇచ్చింది.

రవళి ఓ రెండు గుక్కలు టీ తాగి, టవల్ తీసుకొని బాత్‌రూమ్‌కెళ్ళింది. స్నానం ముగించుకుని తన గదిలో కూర్చుంది. పక్క డెస్కులో వున్న డైరీ తీసింది. డైరీలోంచి నీలి రంగు కవరు జారిపడింది. దాన్ని అందుకుని కవరులోంచి ఆకాశం రంగులోవున్న పేపర్ను తీసి విప్పింది. తనలో తనే చదవడం మొదలెట్టింది.

"ప్రియమైన రవళీ...

మీ మూడు పేజీల ఉత్తరం చదివాను. అందులో ఒక వాక్యం నాకు బాగా నచ్చింది, 'కళ్ళముందు మనిషి వుంటే చెప్పలేని కొన్ని విషయాలు ఉత్తరం ద్వారా చెప్పడం చాలా సులువు' అని రాశారు.. బావుంది. కాని ప్రతి విషయాన్ని ఒక కోణం నుంచే కాకుండా మరోకోణం నుంచికూడా చూడొచ్చు. నాకేమనిపిస్తుందో తెల్సా! కొన్ని విషయాలు ఉత్తరం ద్వారా చెప్పడంకంటే మనిషి ముందే చెప్పడం మంచిదని. నేను మంచి దంటున్నానుగానీ, సులువు అనడంలేదు. రాత బలిగోరుతుందంటారు. అన్ని



విషయాలూ మీరే అలా రాసేస్తే ఎలా?

—రవి"

భలే తెలివైనవాడు. తనయితే ఏం రాసినా ఫర్వాలేదు. ఆయనతో పోలిస్తే తను అనామకురాలు. రవళి అనే సంతకంతోవున్న ఉత్తరం ఎవరి చేతుల్లోనైనా పడినా ఆ రవళి ఎవరో ఏమిటో అంత తేలిగ్గా ఎవరికీ అర్థంకాదు. ఫలానా అని గుర్తించడం కూడా కష్టం. కాని 'రవి' సంతకంతో ఉన్న ఉత్తరం మరో రవి ఎవరైనా రాసినా 'రవి' అనే పేరు చూడగానే ఆయన దగ్గరికే చేరుస్తారు. అందుకే ఇంతముందు జాగ్రత్తగాబోలు! కాని ఈ హెచ్చరించడంలో కూడా ఏదో ఒక రకమైన ఆప్యాయత కనబడుతోంది. ఎందుకో! త్వరలోనే ఆయన్ను కళ్లారా చూడగలగాలి! ఆయనతో ఎన్నో చర్చించాలి! మరి ఎప్పటికో ఆ అవకాశం!

టేబిల్ సొరుగులోంచి మరో పాత



ఉత్తరం తీసి తెరిచింది

“ప్రియమైన రవళీ

ఇదివరకెప్పుడూ ‘రవళిగారూ’ అని సంబోధించేవారు. ఈసారి మాత్రం ‘ప్రియమైన రవళీ’ అని మొదలెట్టారు.

అంటే తమ మధ్య స్నేహం పెరిగిందన్న మాట.

ఈ ఉత్తరం కాస్త "పేలు చూసుకొని ఎక్కువే రాస్తున్నాను. గతంలో మీరు రాసిన ఉత్తరాలు చూస్తే ఎప్పుడో ఓసారి తప్పకుండా విశాఖపట్నం వచ్చేస్తారనుకున్నాను. ఎంతకీ మీరు రాకపోతే ధైర్యం చాలలేదేమో అనుకున్నాను. నేనే రేపు 14వ తేదీన హైదరాబాద్ వస్తున్నాను. హోటల్ అడ్రసు కింద రాస్తున్నాను. రిసెప్షన్‌లో అడిగితే నా రూమ్ నెంబరు చెబుతారు. నాకు చాలామంది చాలా ఉత్తరాలు రాస్తూ వుంటారు. కాని మీ ఉత్తరాలు నన్ను చాలా ఇంప్రెస్ చేశాయి. ఒకరకంగా చెప్పాలంటే శారీరకంగా మీకు బాగా దూరంగా వున్నా మానసికంగా చాలా చేరువయ్యానని పిస్తోంది. ఈ ఉత్తరం మీకు సకాలంలో చేరితే 14వ తేదీ ఉదయం నా హోటల్‌లో మీరు నన్ను కలుస్తారు. తర్వాత విషయాలన్నీ ముఖాముఖీ. అన్నీ రాయడం కష్టం గదా! 14వ తేదీ కోసం ఎదురుచూస్తూ.

మీ, రవి"

'మీ రవి' అని మళ్ళీ తనలో తాను అనుకొంది.

అప్పటికి రాత్రి తొమ్మిది గంటలైంది.

ఆరోజు మార్చి 13. తెల్లవారితే మార్చి 14.

సూర్యుడు ఉదయిస్తే అతని దర్శనమవుతుంది. ఏం మాట్లాడాలి? ఏం చర్చించాలి...? ఆలోచనలో నిద్ర రాక, రవళి సమయాన్ని, తన్ను తానూ మర్చిపోయింది.



2

ఆరోజు మామూలుగానే తెల్లవారింది.

రవళికి కాస్త జంకుగానే ఉంది. ఒంటరిగా అపరిచితుడిని హోటల్ గదిలో కలుసుకుని మాట్లాడటానికి.

'మంజును గాని, మరొకర్నిగానీ వెంట తీసుకువెళ్లామా?' అని ఆలోచించింది. కానీ మూడోవాళ్లుంటే ఫ్రీగా మాట్లాడుకోలేమేమో అనిపించింది.

లేచి త్వరగా తయారవ్వాలని మనస్సులో వున్నా, లేవడానికి బద్ధకంగా వుంది రవళికి. ఒక్కసారి వొళ్లు విరుచుకొని, బద్ధకం తీర్చుకుంది.

"యాదమ్మా!" అని వంటమనిషిని పిల్చింది.

సాధారణంగా యాదమ్మను పిలిస్తే, ఆ వేళప్పుడు టీ తీసుకురమ్మనే అర్థం. రవళి పిలుపు విన్న యాదమ్మ టీ ఇంకా తయారుకాలేదని కంగారుపడింది. "తెస్తున్నానమ్మా!" అని వంట గదిలోంచే బదులుచెప్పింది.

"ఇంకా తయారుకాలేదా ఛాయ్" అంది రవళి కళ్లు మూసుకొని.

"అప్పుడే లేస్తారనుకోలేదమ్మా" అంది యాదమ్మ.

రవళి కళ్లు తెరచి వాచీ చూసుకుంది. ఐదుం అయిదున్నరే అయింది. తాను రోజూ ఆరు దాటాక గానీ లేవదు. ఈరోజు అరగంట ముందే లేచింది.

అందుకే టీ ఇంకా తయారుకాలేదు.

పక్కమీద నుంచి లేచింది రవళి. టవల్ తీసుకొని బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది. తొందరగా పళ్ళు తోముకుంది. బద్దకం పోవటానికి తలారా స్నానం చేసింది.

రవళి బాత్‌రూములో ఉండగా, యాదమ్మ టీతెచ్చింది రవళిగదిలోకి. రోజూ రవళి టీ తాగాకనే పళ్లు తోముకుంటుంది. అట్లాంటిది ఈరోజు టీ తాగకుండానే పళ్లు తోముకోవడం, స్నానం చేయడం కూడా జరిగిపోతున్నాయి. తాను టీ తొందరగా చేయలేదని రవళికి కోపం వచ్చిందేమోనని భయపడింది యాదమ్మ. ఒక్కక్షణం ఏం చేయడానికీ తోచక "చాయ్ తెచ్చినానమ్మా!'' అంది యాదమ్మ - బాత్‌రూమ్‌లో వున్న రవళికి వినిపించేలా.

"కాసేపు ఆగి తీసుకురా! స్నానం చేశాక తాగుతాను" అంది బాత్‌రూమ్ లోంచే రవళి.

యాదమ్మ టీ తీసుకొని వంట గదిలోకి వెళ్లిపోయింది.

రవళి స్నానం ముగించుకొని బయటి కొచ్చింది. డ్రస్సింగ్ టేబుల్ ముందు కూర్చుంది. ఆమెది మరీ పెద్ద తలకట్టు.

టర్కీ టవల్‌తో విడతచుట్టి జుత్తంతా ఒత్తుకుంది. టవల్ విప్పేసింది. అయినా తలింకా బాగా తడిగానే వుంది. తడి తల ఆరబెట్టుకోవడం కోసం సాంబ్రాణి పొగవేసుకోడం ఆమెకు అలవాటు.

"యాదమ్మా!" అంటూ వంట మనిషిని మళ్లీ పిల్చింది రవళి.

యాదమ్మ టీ పట్టుకొచ్చింది.

"చాయ్ తాగకుండానే స్నానానికెళ్లా రేందమ్మా!" అంటూ టీ కప్పు రవళికి అందించింది.

తడి తలతో వున్న రవళిని చూసి, ''అదేంటమ్మా! పొంటిమీద నుంచే స్నానం చేస్తున్నారనుకున్నాను. తల స్నానం చేసినారా? నిప్పులు తెస్తానుం డండి పొగేసుకుందురుగాని" అంటూ కంగారుపడింది యాదమ్మ.

"అసలు నిన్ను పిల్చింది ఆ నిప్పుల కోసమే. త్వరగా తీసుకురా!'' అంది రవళి.

టీ తాగుతూ అద్దంముందు కూర్చున్న రవళి తన ప్రతిబింబాన్ని అద్దంలో చూసుకుంది. రాత్రి సరిగా నిద్రలేక కాబోలు కళ్లు ఎరుపెక్కాయి. ఇంకా రెప్పలు బరువుగానే వున్నాయి. పొద్దున్నే తలకు స్నానంచేయడంచేత కొద్దిగా రొంప పట్టినట్టుంది.

గడియారం చూసుకుంది. అప్పుడే ఏడు గంటలైంది. తొమ్మిది గంటలకల్లా తను అతను దిగిన హోటల్‌కి వెళ్లాలి. రమ్మన్న టైంకు వెళ్లకపోతే, కాసేపుచూసి వేరేపనిమీద వెళ్లిపోవచ్చు రవి.

ఆ ఆలోచన రాగానే ఎందుకో భయం వేసింది రవళికి. చాలాకాలంగా అతనితో ఎన్నో చర్చించాలని ఉంది. అతని రచనలు తనకు బాగా చదివిస్తాయి. కాని, ప్రతిదాంట్లోనూ ఏదో లోపం ఉన్నట్లని పిస్తుంది.

ఆలస్యమైపోతూందన్న ఆత్రుతలో- "యాదమ్మా! నిప్పులింకా తయారు కాలేదా?" అని కేకవేసింది.

"తెస్తున్నానమ్మా"అంటూనే తొందర తొందరగా ఓ పళ్లెంలో నిప్పులు పోసి పట్టుకొచ్చింది యాదమ్మ. డబ్బాలో వున్న సాంబ్రాణి పొడితీసి బొగ్గులమీద చల్లి రవళి తలకట్టును పాయలు పాయలుగా తీసి

ఆరబెడుతోంది యాదమ్మ.

"పొడిబట్టతో కాస్త గట్టిగా తుడ్చుకో వాలిగదమ్మా ముందు. అసలు వెలుగు రాకుండానే తలస్నానమెందుకు! వెలుగొచ్చాక అయితే ఎండలో ఆరబెట్టుకోవచ్చు గదా తల. ఇలా తడితలతో ఎక్కువసేపుంటే దగ్గు, పడిసెం రావూ..." ఇంకా





ఏదో అనబోతోంది యాదమ్మ.

రవళి అదేమీ వినటంలేదు. యాదమ్మ ఏదో సణుగుతోందని మాత్రం తెలుసు. అసలు మరో మనిషి ఆ సమయంలో తన పక్కన ఉండటమే తన ఏకాంతానికి భంగంగా అనిపించింది రవళికి.

''సరేగానీ...నువ్వెళ్లి నీపనిచూసుకో, నేను ఆరబెట్టుకుంటా'' అని యాదమ్మను పంపించేసింది రవళి.

త్వరగా ఎక్కువ సాంబ్రాణి పొడిని నిప్పులమీద చల్లి, తల ఆరబెట్టుకోవడానికి ప్రయత్నించింది. ఎంత ప్రయత్నించినా ఆమె జుత్తు మరీ ఒత్తూ, పొడుగూ కావడం చేత పూర్తిగా ఆరలేదు. ఆరీ ఆరని స్థితిలోనే జుత్తు చిక్కుతీసుకుంది. బయలుదేరబోయేముందు జడ వేసుకోవచ్చని చిక్కుతీసిన జుత్తును అలా వొదులుగా వొదిలే

స్తింది.

లేచి తన బట్టల బీరువా దగ్గరకెళ్లింది. బీరువా తెరిచింది. బీరువాలో హేంగర్స్‌కు తగిలించి చాలా చీరలూ, బ్లౌజులూ ఉన్నాయి. ఏరోజూలేని సమస్య ఈరోజు ఎదురైంది ఆమెకు. 'ఈవేళ ఏ చీర కట్టుకోవాలి?' ఎంత ఆలోచించినా తేలడం లేదు. ఏదీ ఆమెకు నచ్చడంలేదు. నిజానికి ఆ చీరలన్నీ తానుఇష్టపడికొనుక్కున్నవే!

పది నిముషాలపాటు చీరలన్నీ తిరగేసి తన పచ్చని శరీరానికి సరిపడే పొద్దు తిరుగుడు పువ్వు రంగు పోలిస్టర్ శారీ, మ్యాచింగ్ బ్లౌజును ఎంచుకుంది. టైం చూసుకుంది. ఎనిమిదిగంటలు కావస్తోంది. హాటల్ ఇక్కడినుంచి కాస్త దూరమే. 'అప్పుడే ఎనిమిదైంది. డ్రస్సుచేసుకోవాలి. జడవేసుకోవాలి. బైటికెళ్లి ఆటో తీసుకోవాలి. అంత పొద్దున్నే ఆటోలు దొరకవు' అనుకొంటూ త్వరత్వరగా బీరువా లోంచి మ్యాచింగ్ పెట్టికోట్‌ను తీసుకొంది. డ్రస్సు చేసుకుంది. హైహీల్స్‌ను తొడుక్కొని, చీర కిందంచు పాదాలు దిగేలా సరిచేసుకుంది. వొదులువొదులుగా జడవేసుకుంది. చివర రబ్బరు బాండ్ తగిలించి జడ వెనక్కు వొదిలింది. పిరుదులకిందదాకా జడదిగింది.సింధూరం రంగు బొట్టును పెట్టుకుంది. అద్దంముందు నిలబడింది. తననుతాను పరిశీలనగాచూసుకుంది. పక్కలనుంచి, వెనుకా, ముందూ చూసుకొని సంతృప్తిపడింది.

రవళి రోజూ భోంచేసి మరీ బయలుదేరుతుంది కాలేజీకి. అందుకే యాదమ్మ వంట గదిలో హడావుడిగా వంటజేస్తోంది.

"యాదమ్మా" అంటూ మళ్లీ పిల్చింది రవళి.

"వస్తున్నానమ్మా!" లోపలనుంచే పలికింది యాదమ్మ.

"ఊరికే రావొద్దు. ఓ కప్పు ఛాయ్ తీసుకురా"

"ఎవరయినా వచ్చారామ్మా?''

"లేదు...నాకే!''

"వంట అయిపోయింది గదా! భోజనం ముందు చాయెందుకు?''

"నేను చెప్పినట్టు చేయి... చాయ్ తీసుకురా''

"మరైతే భోజనం టిఫిన్ డబ్బాలో సర్దేయనా''

''ముందు నే చెప్పినట్టు చెయ్. చాయ్ తీసుకురా'' చిరాకుపడింది రవళి.

ఎన్నడూలేని ఈ గద్దింపులు చూసి ఇంకేమీ మాట్లాడకుండా చాయ్ తెచ్చింది యాదమ్మ.

టీ తాగుతూ, ''నాకీ పూట ఆకలిగా లేదు. టిఫిన్‌బాక్సు కూడా పట్టుకెళ్ళను. తర్వాత వచ్చి భోంచేస్తా.నాకోసం చూడక నువ్వు భోంచేసెయి" అని యాదమ్మకు మాట్లాడే అవకాశం ఇవ్వకుండా పురమాయించేసింది రవళి.

ఒక్క నోట్‌బుక్కు చేత్తో పట్టుకొని "వస్తాను" అంటూ తన గదిలోంచి హాల్లోకి వచ్చింది.

కాలింగ్‌బెల్ మోగింది.

"చూడు ఎవరో?" అంది రవళి వంట మనిషితో.

యాదమ్మ తలుపు తెరిచింది.

ఆ వచ్చింది రాణి.

"రవళి లేదా?''

"ఉన్నారమ్మా!"

"ఉన్నారా?'' అంటూ రాణి రవళి గదిలోకి వెళ్ళింది. రోజూకంటే చాలా చక్కగా అలంకరించుకొని బయటికి వెళ్ళడానికి సిద్ధంగా ఉన్న రవళికి ఆ సమయం

 

లోనే రాణి సాక్షాత్కరించడం ఎంత మాత్రం ఇష్టంలేదు.రాణి వస్తే ఓ పట్టాన వదలదని భయం. రాణిని వొదిలించుకొని వెళ్ళడం ఎలాగా అనే ఆందోళన. ఏం చేయడానికీ పాలుపోక, ''ఏమిటోయ్! ఇంత పొద్దున్నే వచ్చావ్?'' అంది రవళి.

"అవన్నీ తర్వాత మాట్లాడుకుందాం. కదలకుండా అలా ఓ క్షణం నిలబడు. కళ్ళతోటే ఫొటో తీసేసుకొని, మనస్సులో డెవలప్‌చేసి, ప్రింట్ చేసేసుకుంటాను. యూ స్వీట్ డార్లింగ్!నువ్వెంత అందంగా ఉన్నావో తెలుసా?తెలుగుతనం సరదాపడి స్త్రీ అయిపోతే అచ్చు నీలాగే వుంటుంది" అంది ఆవేశంగా రాణి.

''నీకు కవిత్వం కూడా వస్తుందన్న మాట",

''ఇప్పుడు ఇలా నిన్ను చూశాక''

''ఎప్పుడూలా లేనా?"

''నిన్నెప్పుడయినా డార్లింగ్‌అన్నానా నేను? లేదు.ఎప్పుడూలా ఇవాళ లేవుకాబట్టి డార్లింగ్ అన్నాను. కమాన్...బయల్దేరు. ఇవాళ మనకు కారు దొరికింది. మా డాడీ క్యాంపు వెళ్ళారు. అలా అలా రౌండ్స్ కొట్టి పదిగంటలకు కారు పంపించేసి మనం కాలేజీకి పోదాం" అంది రాణి.

రాణి ఆ సమయానికి రావడం రవళికి పచ్చివెలక్కాయ గొంతుకు అడ్డుపడ్డట్లయింది. ఎలాగో ఓలాగు రాణిని వదిలించుకుని, సాధ్యమైనంత త్వరగా హోటల్ దగ్గర వాలిపోవాలని ఉంది. కాని రాణి అంత సులువుగా వదిలేఘటం కాదు. ఏదో ఒక సాకు చెబితే సవాలక్ష ప్రశ్నలు వేస్తుంది. ఏం చెప్పాలో, ఎలా వదిలించుకోవాలో రవళికి అర్థం కావడంలేదు. ఒక విధంగా రాణి ఆ సమయానికి కారుతో రావడం కూడా మంచిదే అనిపించింది రవళికి. ఎందుకంటే–ఆవేళప్పుడు వాళ్ళ ఇంటిముందు ఆటోలు దొరకవు.

కారు ఎక్కాక, దారిలో ఏదో సాకు చెప్పి తప్పించుకోవచ్చనుకొని, "సరే... పద" అని రాణి వెంట నడిచింది రవళి.

రాణీ, రవళీ ఇంట్లోంచి బయటకు రాగానే డ్రయివరు డోరు తెరిచాడు. ఇద్దరూ వెనుకసీట్లో కూర్చున్నారు.

కారు స్టార్టుచేసి,''ఎక్కడికి అమ్మాయిగారూ?'' అన్నాడు డ్రయివరు రాణీని ఉద్దేశించి.

"మంజూ ఇంటికెళ్ళి మంజూను కూడా పికప్ చేసుకుందామా?" అంది రాణి.

తొమ్మిదిగంటలకల్లా తాను హోటల్‌లో ఉండాలని గుర్తువుంది రవళికి. అందుకే వెంటనే, "ఇప్పుడొద్దులే! ముందుగా మనం ఓ హోటల్‌కి వెళ్ళాలి" అంది రవళి.

"ఎందుకూ?''

"పనుంది''

"ఏం పని?"

"పర్సనల్"

"నాతో చెప్పగూడదా?"

రాణి ప్రశ్నలు రవళికి చిరాకు కలిగిస్తున్నాయి. అయినా తమాయించుకొని, "పర్సనల్ అంటే చెప్పకూడదనేగా! 'పర్సనల్' అన్న తర్వాత నువ్వు అడక్కూడదు గదా అసలు" అంది రవళి.

"మనం ఫ్రెండ్స్‌మి కాబట్టి అడిగాను. చెప్పకపోతే మానేయ్" అని బుంగమూతి పెట్టింది రాణి.

రవళి నవ్వింది.

"ఏంలేదులే! మా వూరునుంచి మా అంకుల్ ఒకాయన వచ్చాడు. ఆయన హోటల్‌లో దిగాడు. తొమ్మిది గంటలకు హోటల్‌కు వస్తానని చెప్పాను. అందుకని

ముందుగా హోటల్‌కి కారు పోనివ్వ మన్నాను" అంటూ రాణీకి నచ్చజెప్ప డానికి ప్రయత్నించేసింది రవళి.

"ఓకే... హోటల్‌కి వెళదాం. మీ అంకుల్‌తో మాట్లాడాక, అక్కణ్నుంచి మంజూ ఇంటికి వెళ్ళొచ్చు" అంది రాణి.

"నే చెప్పేది కాస్త సరిగ్గా వినిపించుకో రాణీ! మా అంకుల్‌తో మాట్లాడటం అంత త్వరగా తెమలదు. మా కుటుంబ విషయాలు, పొలాల గొడవలు ఏవేవో మాట్లాడతాడాయన. అంతసేపూ నువ్వక్కడ వెయిట్ చేయడం నీకే తలనొప్పి. ఒకవేళ నేను ఈరోజు కాలేజీకి కూడా రాకపోవచ్చు. అంచేత ఓ పనిచేస్తే







బావుంటుంది" అంది రవళి.

"ఏమిటది?" అంది రాణి.

"కాస ఆటో వున్నచోట కారు ఆపు చేస్తే హోటల్‌కి నేను ఆటోలో వెళ్ళి పోతాను. ఆ తర్వాత నువ్వు మంజూని పికప్ చేసుకొని, ఇద్దరూ కాలేజీ టైందాకా హాయిగా తిరగొచ్చు"

"భలేదానివే రవళీ నువ్వు! నిన్ను రోడ్డు మీద వొదిలేసి వెళ్ళమంటావా? నథింగ్ డూయింగ్. మనం హోటల్‌కే

వెళతాం. నిన్నక్కడ డ్రాప్ చేస్తాను. ఆ తర్వాత మంజూ ఇంటికెళతాను" అంది రాణి.

అప్పటికి రవళి మనస్సు కుదుట పడింది. తనని హోటల్ దగ్గర డ్రాప్‌చేసి రాణి వెళ్ళిపోతుంది. ఆ తర్వాత తాను రిసెప్షన్‌కు వెళ్ళి, రవి రూం నెంబరు తెల్సుకొని, ఆ తరువాతి విషయాలన్నీ... లోలోపలే వూహించుకుంటోంది రవళి.

ఊహల్లో వున్న రవళికి సమయం తెలియడంలేదు. పదినిముషాల్లో హోటల్ ముందు కారాగింది. రాణి పరధ్యానంలో వున్న రవళి భుజం తట్టింది. రవళి ఉలిక్కిపడి ఏమిటంది.

"హోటల్ వచ్చింది" అంది రాణి.

"థాంక్యూ"అంటూ డోరు తెర్చుకొని కారు దిగింది రవళి.

"బై'' అని రవళికి చెప్పి, కారు మంజూ ఇంటికి పోనివ్వమని డ్రైవర్ను ఆదేశించింది రాణి.

రూమ్ నంబరు 115 ముందు ఆగింది రవళి. హోటల్ దర్జాగా ఉంది. ఖరీదైన హోటలని వెంటనే తెలుస్తోంది. అందుకే కాలింగ్‌బెల్ నొక్కాలంటే ఎందుకో బెరుకు బెరుగ్గావుంది. రిసెప్షన్ దగ్గర రవి రూమ్ నంబరు తెల్సుకొని, లిఫ్ట్‌లో ఫస్ట్‌ఫ్లోర్‌కు రావటానికి అయిదు నిముషాలు కూడా పట్టలేదు. రూమ్ నంబరు 115 ఎక్కడుందో వెతుక్కుంటూ చివరకు ఆ రూమ్ దగ్గరకు చేరుకుంది.

ఆ హోటల్ చాలా అధునాతనమైనది. వరండాలోకూడా మెత్తని కార్పెట్స్ పరిచి ఉన్నాయి. సీలింగ్ చక్కటి నగిషీలతో చూడముచ్చటగా వుంది.

'తాను బెల్ నొక్కకుండానే రవి వచ్చి తలుపుతీస్తే బావుణ్ణు' అనిపించింది రవళికి. తాను ఫొటోలో చూసిన అతని రూపాన్ని మననం చేసుకుంది. కాలింగ్ బెల్ నొక్కడమా, మానడమా అన్న మీమాంసలో ఉంది రవళి. బేరర్లు ఇటూ అటూవున్న ఇతర గదుల్లోకి ఫలహారాలు తీసుకెళుతున్నారు. వరండాలో మసులుతూన్నవాళ్ళు తననిఓకంటచూసి కొందరూ, బాగా పరకాయించిచూసి మరికొందరూ వెళ్ళిపోవడం రవళి గమనించింది. అట్టే సేపు ఆ గదిముందు అలా ఒంటరిగా నిలబడటం ఆమెకు ఇబ్బందనిపించింది. చివరికి తెగించి తన చూపుడు వేలితో కాలింగ్‌బెల్ నొక్కింది.

ఒక్క నిముషం నిశ్శబ్దం.

తర్వాత తలుపు తెర్చుకుంది.

ఎదురుగ్గా బక్కపల్చగా, ఎర్రగా ఉన్న మనిషి. పైజామా, లాల్చీ నలిగి వున్నాయి. జుత్తు చిందరవందరగావుంది. నల్లఫ్రేం కళ్ళజోడు అతని మొహానికి అందంగానేవుంది. ఓ పత్రిక మధ్య, మధ్యవేలును పెట్టి మిగిలినవేళ్ళతో పత్రిక పట్టుకొని, మరోచేత్తో తలుపుతీసినఆవ్యక్తి ఎదురుగా వున్న రవళిని చూసి, చిరునవ్వు నవ్వాడు.

"ప్లీజ్..కమిన్" అన్నాడతను.

తాను ఫొటోలో చూసిన రవి మొహానికీ, తన ముందు నిలబడ్డ ఈ వ్యక్తి మొహానికీ ఎక్కడా పోలికలు కనిపించడం లేదు. ఫొటోలో రవి మొహానికి కళ్ళజోడు లేదు. అది కాకపోయినా మిగతా పోలికలనుబట్టి తనముందు నిలబడ్డ ఈ వ్యక్తి రవి కాదనే నిర్ణయానికొచ్చేసింది రవళి. అతను సాదరంగా ఆహ్వానించినా, అడుగు ముందుకు వేయకుండా, "నేను రవిగార్ని కలవాలి" అని బదులు చెప్పిందామె.

"రండి...లోపలున్నారు" అన్నాడు




అతను.

రవళి అతని వెనుకే గదిలోకి వచ్చింది. స్ప్రింగ్ డోర్ మూసుకుంది.

రవళి చుట్టూ చూసింది. నిజానికి రూమ్ చాలా బావుంది. కాని, ప్రస్తుతం చాలా కంగాళీగా ఉంది.

''అలా కూర్చోండి" అని రవళికి కుషన్ ఛైర్ చూపించాడు అతను.

ఆ డబుల్‌రూంలో ఓ మంచం మీద రగ్గు చెల్లాచెదురుగా పడివుంది. మరో మంచంమీద రగ్గు నిండా కప్పుకొని ఎవరో పడుకుని ఉన్నారు. రెండు మంచాలకూ మధ్యా టీపాయ్, టీపాయ్ మీద కాళీ అయిన విస్కీ, బీర్ బాటిల్స్, ఖాళీ సోడాలు, సగం తిని వొదిలేసిన భోజనం ప్లేట్లు.

ఆ గది పరిస్థితి చూస్తే అక్కడ కూర్చోడం రవళికి ఇబ్బంది అనిపించింది. వెంటనే వెళ్ళిపోవాలనిపించింది.

"మీ పేరు?" అన్నాడతను ముక్తసరిగా:

"రవళి'' అందామె.

"నా పేరు హరి. పూర్తిపేరు హరనాథ్. రవి స్నేహితుణ్ని" అని పరిచయం చేసుకున్నాడు అతను.

''హరి అంటే...మీరూ రచయితేనా?"

"కాదండీ! అందరూ రచయితలైతే చదివేవాళ్ళెవరు? నేను రవి రచనలన్నీ క్షుణ్ణంగా చదివాను. కొన్ని కొన్ని భాగాలు నేనే రాసిపెట్టాననుకోండి. ఆ ఛాప్టర్లు గడగడా అప్పజెప్పగలను" అన్నాడు హరి.

"మిమ్మల్ని కలవడం చాలా సంతోషంగా వుంది. నాకూ రవిగారి రచనలంటే ఇష్టం" అంది రవళి, హరి ధోరణికి కొంత ఆశ్చర్యపడుతూనే. ఒకరికి ఇంకొకరు రాసిపెట్టడం ఏమిటో అర్థంకాలేదామెకు.

"మీరు రవిని కలవడానికొచ్చారు. కాని అతన్ని మీరు కలవకుండానే ముందుగా మనం కలిశాం. చూశారా? మనిద్దరమూ అతని అభిమానులం కాబట్టి ముందుగానే స్నేహితులమయ్యాం" అని నవ్వాడు హరి.

బదులుగా రవళి కూడా నవ్వింది.

''మీరు భలే సరదాగా మాట్లాడతారే!''

"సావాస దోషమండీ! మన గురుడు నాకంటే సరదాగా మాట్లాడతాడు''

"గురుడెవరండీ?" అంది రవళి అయోమయంగా.

"గురుడంటే తెలియదా? భలేవారే! గురుడంటే మనవాడేనండీ.. మన 'రవే'"

''మీరు పెట్టిన ముద్దు పేరా అది?"

''అది అసలైన పాయింట్. నిజంగా ముద్దు పేరే. ఎందుకంటారా...జీవితంలో మనకు అనేక సమస్యలు ఎదురవుతూ వుంటాయి. వాటిని మన గురువుతో చర్చిస్తే తాను రాసే నవల్లోనో,కథల్లోనో మనం చెప్పిన సమస్యను కూలంకషంగా చర్చించి, మన ఊహకందని పరిష్కారాన్ని కూడా సూచిస్తాడు. మనకు చేతగాని పని చేయగలిగినవాడూ, మనకు సలహా ఇవ్వగలిగినవాడూ 'గురువే' గదండీ!" అన్నాడు హరి నవ్వుతూ.

ఈసారి రవళి మొహమాటపడకుండా నవ్వేసింది.

ఇంతసేపూ వాళ్ళిద్దరూ అలా మాట్లాడుకుంటున్నా, రవి ముసుగు తొలగించి తొంగి కూడా చూడలేదు. గాఢనిద్రలో ఉన్నట్లున్నాడు. ఒకవేళ రాత్రి ఈయన కూడా బాగా తాగాడేమో అనిపించింది రవళికి.

ఇంతలో కాలింగ్‌బెల్ మోగింది.

"కమిన్" అని అరిచాడు హరి.

వెంటనే తలుపు తెరిచి రూమ్‌బాయ్ లోపలకు వచ్చాడు.

"నీ పేరేమిటోయ్?" అన్నాడు హరి.

"దస్తయ్యండీ!"

"పేరు బావుందోయ్! తొమ్మిది గంటలైనా రూమ్ శుభ్రం చేయకపోలే ఎలాగయ్యా?" అన్నాడు హరి.

"ఏడున్నరకే ఒకసారి వచ్చానండీ! 'డోన్ట్ డిస్టర్బ్' లైట్ వెలుగుతోంది బయట. అందుకని వెనక్కి వెళ్ళి పోయానండీ! ఇప్పుడు బెల్ కొడితే వచ్చానండీ" అని సంజాయిషీ ఇచ్చాడు రూంబాయ్.

"సరేలే! లైటో ఫ్యానో, వెయ్యాలని ఎదురుగా వున్న స్విచ్చులన్నీ నొక్కితే 'ఆ డోన్ట్ డిస్టర్బ్' లైటు కూడా వెలిగి వుంటుంది. నువ్వు లోపలికొచ్చి నీ పని చూసుకోకపోతే మేం డిస్టర్బ్ అయ్యే స్థితిలో లేములే! అయినా ఇంతసేపట్నుంచీ మేమిద్దరమూ ఇక్కడ కూచుని మాట్లాడుకుంటున్నా ఆయన డిస్టర్బ్ అయ్యాడని మా గురించి వర్రీకాక నీ పని నువ్వు కానివ్వు. నువ్వెళ్ళి ఆ బేరర్‌ను పంపించు" అన్నాడు హరి.

రూంబాయ్ టేబుల్ మీదున్న గ్లాసులూ, భోజనం ప్లేట్లూ, ఖాళీ సోడాలు అన్నీ తీసేసి రూమ్ క్లీన్‌చేసి వెళ్ళి పోయాడు. అంతసేపూ హరి ఏం మాట్లాడలేదు.

రవళి పక్కనేవున్న పత్రిక తీసుకుని తిరగేస్తూ కూర్చుంది.

మొహం కడుక్కుని బాత్‌రూమ్ లోంచి వచ్చిన హరి రవిని లేపాడు.

రవి 'ఊఁ!' అన్నాడుగానీ ముసుగు తీయలేదు.

"నిన్ను కలవడానికి రవళిగారొచ్చారు. చాలాసేపైంది" ముసుగు తొలగించి రవి చెవి దగ్గర గట్టిగా చెప్పాడు హరి.

బద్ధకంగా మూలిగి ఒళ్ళు విరుచుకున్నాడు రవి. రగ్గు తొలగిపోయింది. లుంగీ సర్దుకొని లేచి కూర్చున్నాడు. వాచ్ చూసుకున్నాడు. "ఓ! నైన్ ఫార్టీ" అనుకొని "సారీ! మీకు నైన్ క్లాక్ టైమిచ్చాను. రాత్రి లేటుగా పడుకోవడంతో మెలకువరాలేదు. ఫయివ్ మినిట్స్‌లో తయారవుతాను" అంటూనే లేచి బాత్‌రూమ్ లోకి వెళ్ళాడు రవి.

రవి లేవగానే 'నమస్కారం' అందామనుకుంది రవళి. అయినా అనలేకపోయింది. అతనే మాట్లాడేస్తున్నాడు. అతను 'సారీ' చెప్పినప్పుడు 'ఫర్వాలేదండీ!' అందామనుకొందిగానీ అనలేకపోయింది. అసలు అవకాశమివ్వకుండా మాట్లాడేసి బాత్‌రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

తాను పత్రికలో చూసిన రవికీ తన కళ్ళముందున్న రవికీ ఏమీ తేడా కనిపించలేదు. ఫొటోలో అతని కళ్ళల్లో కనిపించిన చురుకుదనం – ఇక్కడ ఈ మనిషిలోనూ చూసింది, అతని ప్రవర్తనలోనూ చూసింది. చూసేకొద్దీ చూడాలనిపించే రూపం కాకున్నా చూపులు తిప్పుకోవాలనిపించని ఆకర్షణ ఏదో ఉంది. రచయితల రచనలు చదవాలేగానీ రచయితల్ని చూడకూడదు అన్నారెవరో. కాని ఇతని విషయంలో అది నిజం కాదు. అతని రచనలు చదివేకొద్దీ చదవాలనిపించినట్లే మనిషి కూడా చూసేకొద్దీ మాట్లాడాలనిపించేలా ఉన్నాడు.

పత్రిక తిరగేస్తున్నా అందులోని ఏ విషయాన్నీ గమనించకుండా రవి

 చతుర ... 3 5

గురించి అలా అలా ఆలోచించుకుంటోంది రవళి.

"ఏమిటీ..పత్రికలో మునిగిపోయారు? అందులో మన గురుడి సీరియల్ వుందా?" పలకరించాడు హరి.

ఆ పలకరింపుతో ఈ లోకంలోకి వచ్చిన రవళి "లేదండీ! వూరికెనే చూస్తున్నాను" అంది.

"బేరర్ వచ్చాడు. మీ బ్రేక్‌ఫాస్టు ఏమిటో చెప్పండి"

"నాకేమొద్దండీ! కాఫీ చాలు"

"అలా మొహమాటపడకూడదు. మీరు తొమ్మిదిగంటలకు ఈ హోటల్‌కు వచ్చారంటే ఎనిమిదిన్నరకు ఇంటిదగ్గర బయలుదేరుండొచ్చు. అంత పొద్దున్నే బ్రేక్‌ఫాస్టు చేసివుండరు"

"లేదండీ....నాకు తొమ్మిదిగంటలకే భోంచేసి కాలేజీకి వెళ్ళడం అలవాటు"

"అయ్‌సీ! మీరు స్టూడెంటన్నమాట! ఏం చదువుతున్నారు?"

"బి.ఏ. ఫైనల్!"

"ఏ కాలేజ్?"

"ఉమెన్స్ కాలేజీ"

"ఏ ఉమెన్స్ కాలేజీ? సిటీలో చాలా వున్నాయిగదా"

"యూనివర్సిటీ ఉమెన్స్ కాలేజీ"

"పోన్లెండి. సింపుల్‌గా ఇడ్లీ తీసుకోండి" రవళి అంగీకారం కోసం ఎదురు చూడకుండా మూడు ప్లేట్లు ఇడ్లీ, కాఫీ ఆర్డర్ చేశాడు హరి.

బేరర్ వెళ్ళిపోయాడు.

మొహం తుడుచుకుంటూ బాత్‌రూమ్ నుంచి బయటికొచ్చాడు రవి.

"గెస్ట్ వస్తే ఏ కాఫియో ఆర్డరివ్వక అలా కూర్చున్నావేమిటోయ్?" అన్నాడు రవి.

"గెస్టుకే కాదు గురూ! నీకూ, నాకూ కూడా టిఫినూ, కాఫీ ఆర్డరిచ్చాను. నువ్వు ముసుగుతోనే నిద్రపోతున్నా, అరగంట కితంనుంచే నీ గెస్టుని ఎంటర్‌టెయిన్ చేస్తున్నా. నీతోపాటు నేనొచ్చి ఉండక పోతే, పాపం వీరు రూమ్ బయటే నిలబడి కాలింగ్‌బెల్ నొక్కీనొక్కీ ఎంతకీ నువ్వు తలుపు తెరవకపోతే, వేలు కందిపోయి, వెనక్కి వెళ్ళిపోయివుండేవారు. తర్వాత రచయిత రవి 'మేనర్‌లెస్‌గై' అనికాలేజంతా ప్రచారం చేసేవారు..." అని ఇంకా ఏదో మాట్లాడబోతూంటే, అతని మాటకు రవి అడ్డొచ్చాడు.

"కాసేపు వచ్చినవారితో మాట్లాడ నీయవోయ్! పొరుగూరొచ్చినా నువ్వు లెక్చరరులాగే ఉపన్యసిస్తే ఎలాగ?"

రవళి అర్థం కానట్టు చూసింది.

"మరేం లేదండీ! మేమిద్దరం చిన్నప్పట్నుంచీ స్నేహితులం. మావాడికి మాట్లాడటం ఎక్కువ అలవాటు.మనం ఆపకపోతే తనంతట ఆగడు...చెప్పండి ఏం చదువుతున్నారు? మీ హాబీస్ ఏమిటి?" అన్నాడు రవి ఆమెనుద్దేశించి.

తనకూ, రవికీ మధ్య సంభాషణ అట్లా ప్రారంభమవుతుందని అనుకోలేదామె.

అతని పరామర్శలో తనను తొందరగా పంపించేయాలనే ప్రయత్నం ఉన్నట్లు సూచాయగా అనిపించిందామెకు.

"ఇప్పుడు మీకు వేరే ఎంగేజిమెంట్సు ఏమైనా వున్నాయా?" రవళి అడిగింది.

"సాయంకాలం ఆరుగంటలదాకా ఏ ఎంగేజిమెంట్సూ లేవు.ఆరుగంటల తర్వాత మాత్రం ఓ ఫంక్షన్‌కు వెళ్ళాలి. ఓ కాలేజి స్టూడెంట్సు యూనియన్‌కు గెస్టుగా వచ్చానులెండి. అంతవరకూ మీరేం మాట్లాడినా నేను వింటానికి సిద్ధమే"





అన్నాడు రవి పక్కనేవున్న దిండును వాళ్లోకి తీసుకుంటూ.

"థాంక్యూ వెరీ మచ్. ముందు మిమ్మల్ని చూడాలనే కుతూహలం, ఆ తర్వాత మీతో మాట్లాడాలని. తీరా మీరు ఎదురుగుండా కనిపిస్తే, ఏం మాట్లాడాలో తెలియటం లేదు. మీరు మాట్లాడితే విందామని ఉంది"

"గురుడు మాట్లాడటం వినాలంటే సాయంత్రం మెడికల్ కాలేజీకి రండి. ఆ స్పీడూ, జోరూ మీకర్థమవుతాయి" అన్నాడు హరి.

"తప్పకుండా వస్తాను. ఒక రచయిత రాసిన పుస్తకాన్ని ఒక్కొక్కళ్ళమే చదువుతాం. అంటే నాఉద్దేశం ఎవరంతటికి వాళ్ళు చదువుకుంటారు. ఉపన్యాసం అందరూ కల్సి వినాలి. అంతమంది జనం ముందు ఉపన్యసించేటప్పుడు రచయిత అయినా, కళాకారుడయినా, రాజకీయవేత్త అయినా జాగ్రత్తగానే మాట్లాడాలి. పుస్తకంలో రాసినవన్నీ అందరిముందూ మాట్లాడటం కష్టం. అందరి ముందూ మాట్లాడలేనివి కూడా పుస్తకంలో రాయవచ్చు. మీ రచనలన్నీ నేను చదివాను. నాకు చాలా సందేహాలున్నాయి. మీతో పర్సనల్‌గా మాట్లాడాలనుకున్నాను. మీరు నాతో నాకోసం మాట్లాడే మాటల్ని వినాలనుకున్నాను. అందరిముందూ మీరు మాట్లాడేది వినే అవకాశం నాకు కలిగితే అదీ ఒక అనుభూతే గదా!" అంది రవళి.

"గుడ్... మీరు తెలివైనవారే. మీరు ఏమన్నా రాశారా? ఇలాంటి తెలివీ, సాహిత్యంపట్ల అభిరుచీకల మీవంటి వాళ్ళతో మాట్లాడటం నాకేకాదు...ఏ రచయితకైనా బాగానే వుంటుంది పదునుచేసిన నేలమీద విత్తనాలు చల్లితే వెంటనేమొలకెత్తుతాయి. ఎడారిలో చల్లితే మొలవవుగదా! అందుకే రసాస్వాదనా శక్తిగల వ్యక్తులతో మాట్లాడటం పదునుచేసిన నేలమీద విత్తనాలు చల్లడం లాంటిదే. మీతో ఎంతసేపైనా మాట్లాడతాను" అన్నాడు రవి.

"అది నా అదృష్టం" అంది రవళి వినమ్రంగా.

ఇంతలో హరి డ్రస్సు చేసుకున్నాడు.

బేరర్ టిఫినూ, కాఫీ తెచ్చాడు.

హరి రవళికీ, రవికీ చెరో ప్లేటు ఇడ్లీ ముందుపెట్టి తానో ప్లేటు తీసుకున్నాడు.

ముగ్గురూ టిఫిన్ చేస్తున్నారు.

ఒక్క నిముషం ఎవ్వరూ మాట్లాడలేదు.

"తినేటప్పుడు మాట్లాడకూడదనే నియమమా మీకు?" రవళిని అడిగాడు హరి.

"అదేం లేదండే! ఆ మాటకొస్తే మీరిద్దరూ కూడా ఇంతవరకు మాట్లాడలేదు గదా!" రవళి నవ్వుతూ అంది.

"అబ్బో...రవళిగారు మాటకారే!" అన్నాడు హరి రవితో.

"మాట్లాడటం నీ ఒక్కడిసొత్తే అనుకున్నావా? మంచి పాఠకులు ఒక రచనను చదివి, రచయిత ఊహించని విషయాలను కూడా ఆ రచననుంచి వెలికితీస్తారు. బర్హంపూర్‌లో ఒకసారి నా నవల మీద చర్చాగోష్ఠి పెడితే వెళ్లాను. ఆ గోష్ఠిలో నా నవల గురించి కొందరు పాఠకులు మాట్లాడారు. విషయాలు వింటే నాకే ఆశ్చర్యమనిపించింది. అలాగే ఓ పాఠకుడు అదే వేదికమీద నా నవలలోంచి లోపాలను ఎత్తిచూపుతూంటే సమంజసమే అనిపించింది. రచయితను పాఠకులు గౌరవించినంతమాత్రంచేత, అభిమానించినంత మాత్రంచేత వారికంటే మనమే తెల్సినవాళ్లమనుకోవడం పొరబాటు. ఇంత శ్రమ



తీసుకొని రవళిగారు ఇక్కడికెందు కొచ్చారు..." రవి ఇంకా ఏదో మాట్లాడ బోతుంటే.

"నీ ప్రశ్నకు నువ్వే సమాధానం చెప్పకు. రవళిగార్నే సమాధానం చెప్ప నివ్వు" అన్నాడు హరి కప్పుల్లో కాఫీ పోస్తూ.

"సరే...మీరే చెప్పండి రవళిగారూ!"

అట్లాంటి ప్రశ్నకు సమాధానం చెప్పాల్సివస్తుందని రవళి అనుకోలేదు. ఏం చెప్పడానికి తోచక ఒక్కక్షణం ఆలోచించి–

"మీ రచనలంటే నాకు చాలా చాలా ఇష్టం. కానీ వాటిల్లో చాలా లోపాలున్నాయనిపిస్తుంటుంది. వాటిని చదివిన మిమ్మల్ని చూడాలనీ, చర్చించాలనీ అనిపించింది. అందుకే ఈ ప్రయత్నమంతా" అంది రవళి.

"అంటే రవళిగార్ని నా దగ్గరకు తీసుకొచ్చింది నా రచనేగదా! ఇంకో విధంగా చెప్పాలంటే – నా రచనల్ని ఆస్వాదించగలిగే శక్తి, సామర్థ్యం రవళిగారికి ఉండబట్టేగదా!" అన్నాడు రవి.

"ఇంతకీ నువ్వు చెప్పదల్చుకున్న



విషయమేమిటి గురూ!" అన్నాడు హరి.

"రచయితకు గుర్తింపు రావడానికి రసజ్ఞులైన పాఠకులు ఎంత అవసరమో, రసజ్ఞులైన పాఠకులకు రసానుభూతిని కలిగించే రచనలుచేయగల రచయిత కూడా అంతే అవసరం. ఒకరిమీద ఒకరు ఆధారపడి జీవించవల్సినవాళ్ళే" అని వివరించాడు రవి.

"ఓ.కే. ఒక మంచి రచయితా, ఒక మంచి పాఠకురాలూ కలిశారు. మీ చర్చలు నిరంతరాయంగా సాగనివ్వండి. నేను అలా బయటికి వెళ్ళి ఫ్రెండ్‌ను కల్సి భోజనం వేళకు వస్తాను" అంటూ లేచి బయటికి వెళ్ళాడు హరి.

అతనలా వెళ్ళగానే కొంత స్వేచ్ఛ వచ్చినట్టు ఫీలయింది రవళి.




"మీతో నేను చాలా విషయాలు మాట్లాడాలని వచ్చాను" అని మొదలు పెట్టింది రవళి.

"చెప్పండి..."

"నేను మీ ఫ్యాన్‌ను"

"థాంక్యూ" అన్నాడు రవి.

"నేను మీరు రాసిన ప్రతి నవలా, ప్రతి కథా ఎంతోఆసక్తిగా చదివాను... చదువుతున్నానుమళ్ళీ మళ్ళీ కూడాచదివాను. నిజానికి మీ రచనా నైపుణ్యమే నన్నలా చదివిస్తోంది. మీరంటేనే ఓవిధమైన గౌరవం, అభిమానం ఏర్పడ్డాయి అందుకే మీకు ఉత్తరం రాశాను" అతని ముఖంలోకి చూడకుండా తన వేలి గోళ్ళను చూసుకుంటూ మాట్లాడింది రవళి.

"మీరు రాసిన ప్రతి ఉత్తరం శ్రద్ధగా చదివాను. మీరు మంచి పాఠకులేగాదు, విమర్శకులు కూడా. నేను సమాధానాలు కూడా ఇచ్చాను" అన్నాడు రవి.

"అవును" అంది ముక్తసరిగా ఆమె.

"ఉత్తరాల్లో అంతకంటే ఎక్కువగా రాయడానికి సమయం దొరకదు నాకు. అదీగాక మన పరిచయంకూడా తక్కువ గదా!"

"ఎంత పరిచయముంటే పెద్ద ఉత్తరాలు రాస్తుంటారేమిటి మీరు?" అంది రవళి.

"అది పరిచయాన్ని బట్టి"

"అంటే...?"

"రకరకాల పరిచయాలుండవచ్చు. ఒక్కోరకం పరిచయాన్నిబట్టి ఒక్కో రకంగా సమాధానం రాయాల్సి వుంటుంది" అన్నాడు రవి.

"పరిచయాన్నిబట్టి రాయటం ఏమిటి? విషయాన్నిబట్టి ఉంటుందిగాని?"

"రాసేవాళ్ళ వయస్సూ, ఆడా, మగా అనేదాన్నిబట్టి కూడా ఉంటుంది గదా జవాబు రాసే పద్ధతి? సరేగానీ...మీ గురించి చెప్పండి" అన్నాడు రవి.

"నేను బి. ఏ. ఫైనలియర్ చదువుతున్నానని చెప్పానుగదా! నా వయస్సు ఇరవై సంవత్సరాలుండొచ్చునని అంచనా వేసుకోవచ్చు"

"అయితే మీ వయస్సు ఇరవై" అన్నాడు రవి.

"అవును... నేను మీ ఆదాయం

అడగటంలేదు" నవ్వింది రవళి.

"అయితే నా వయస్సు చెప్ప మంటారా?"

"అది కూడా నేను వూహించుకో గలను. ముప్ఫైయేళ్ళకు ఒక సంవత్సరం ఎక్కువో, తక్కువో వుండొచ్చు"అంది రవళి.

"కరెక్టుగా అంచనా వేశారు. ముప్ఫై నడుస్తోంది"

"ముప్ఫైయేళ్ళల్లో ఇన్ని రచనలు చేసేటంత అనుభవం మీకెలా వచ్చింది?"

"అనుభవాలు రెండు రకాలు. ఒకటి తనంతట తాను అనుభవించడం. రెండోది తన కళ్ళముందు మరొకరికి జరిగిన అను భవాన్ని ఆకళింపుజేసుకోవటం. మూడో రకం అనుభవం కూడా వుంది. ఇతర్ల అనుభవాలు రచన రూపంలోవస్తే, వాటిని చదివి అనుభూతిని పొందడం కూడా ఒక అనుభవమే'' చెప్పాడు రవి.

"సాధారణంగా మీరు ఏ రకమైన అనుభవంమీద ఎక్కువ ఆధారపడతారు?" కుతూహలంగా అడిగింది రవళి.

"అన్ని రకాలైన అనుభవాలూ రచయితకు అవసరమే.అన్నింటికీ మించి ప్రత్యక్ష పరిశీలన అవసరం. కొంత వూహ తప్పనిసరి"

"మీరు మీ నవలల్లో చిత్రమైన ప్రేమ సన్నివేశాలు సృష్టిస్తారు. ప్రేయసీ ప్రియుల సంభాషణలు రెండూ మీరే రాస్తారు. అందులోవున్న విలన్‌ను కూడా మీరే సృష్టిస్తారు. ఇంకా తాగుబోతు, జూదరి, పెద్దమనిషిలాంటి రకరకాల పాత్రలు సృష్టిస్తారు. వాళ్ళచేత మాట్లాడించేటప్పుడు అచ్చువాళ్ళు మాట్లాడే మాటలే రాస్తారు. ఇది మీకెలా సాధ్య మవుతుంది?"

"అందుకే రచయితకు పరిశీలన అవసరమన్నాను. రచనలో కొంత పరిశీలన, వూహ వుంటుంది"

"నేనింకో రకంగా చెప్పనా?" అంది రవళి జంకుతూనే.

"చెప్పండి'' అన్నాడు రవి ప్రోత్సహిస్తూ.

"మీరు సృష్టించిన పాత్రలన్నీ మీలో దాచుకుంటారు ముందు. ఆ పాత్రకు రూపం దిద్దేటప్పుడు, ఆ పాత్రను మాట్లాడించేటప్పుడు ఆ పాత్రలో మీరు ఇమిడిపోతారు...అవునా?''

"అంటే మీరనేది రచయితలో హీరో, హీరోయిన్, విలన్, ఫాదర్, మదర్, సంఘంలో మనకు కనిపించే మంచివాళ్ళూ, చెడ్డవాళ్ళూ, మోసగాళ్ళూ వుంటారంటారా?"

"ఎగ్జాక్ట్‌లీ...అదే నా ఉద్దేశం. ఇంత సేపట్నుంచీ మనిద్దరం మాట్లాడుకున్నాం. ఇన్ని పాత్రల్ని మీ రచనల్లో సృష్టించిన మీరు ఏ పాత్ర స్వభావానికి దగ్గరగా వున్నారో నాకర్థం కావడంలేదు"

"అసలు మీకు నేను ఎందుకర్థం కావాలి?'' సూటిగా ప్రశ్నించాడు రవి.

"మిమ్మల్ని నేను లైక్ చేస్తానుగాబట్టి. అయ్‌మీన్ ... రచయితగా మిమ్మల్ని ఆరాధిస్తున్నాను కాబట్టి'' చాలా మృదువుగా అంది రవళి.

ఒక్కక్షణం అతను ఏమీ మాట్లాడ లేదు.

"నేను తప్పు మాట్లాడానా?'' అతని కళ్ళల్లోకి చూస్తూ అడిగింది రవళి.

"మీలా ఆరాధించేవాళ్ళు, అభిమానించే వాళ్ళు ఉండటం రచయితకు ఓ వరం. ఆవిధంగా నేను అదృష్టవంతుణ్ని'' అన్నాడు-అతనామెను తదేకంగాచూస్తూ.

"మిమ్మల్ని అభిమానించేవాళ్ళ్ని, ఆరాధించేవాళ్ళు చాలామంది ఉండొచ్చు.

అటువంటి అవకాశం మీకుంది. మీ రచనల ద్వారా మీరు చాలామందికి సన్నిహితంగా చేరివుంటారు. చాలామందిచేత ఆరాధింప బడతారు. కాని నేను కోరుకునేదేమిటో తెలుసా...?"

"ఏమిటి?''

"మీరు రచయిత గనక మీఆలోచనల్ని, వూహల్ని సులువుగా చెప్పగలరు. కాని, నా భావాలు మీకర్థమయ్యేలా చెప్పడం నాకు చేతకావడంలేదు"

''ఫర్వాలేదు..చేతనయినట్లే చెప్పండి. మీరు చెప్పినదాన్నిబట్టి నేను అన్వ యించుకుంటానుగా''

"అన్వయించుకొంటే చాలదు. అవగాహనచేసుకోవడానికి ప్రయత్నం చేయండి''

"మీరు ఫ్రీగా చెప్పదల్చుకుంది చెప్పండి''

"ఆ ప్రయత్నంలోనే వున్నాను. నేను మిమ్మల్ని ఆరాధించేది అందరిలాగా కాదు, నేను మిమ్మల్ని మీ రచనల ద్వారా ఆకర్షితమైన ఒక వ్యక్తిగా మిమ్మల్నీ, మీలోని రచయితనీ ఆరాధిస్తున్నాను. ఇంకా విపులంగా చెప్పాలంటే మీరు ఆలోచించేటప్పుడు, మీరు పాత్రలకు రూపకల్పన చేసేటప్పుడు, రచించబోయే రచన గురించి మీలో మీరు తర్జనభర్జన పడేటప్పుడూ మీతో నేనుండాలని పిస్తుంటుంది. మీరు రాయబోయే కథ ముందుగా నాకూ తెలియాలి. మీరు రాసే టప్పుడూ నేను పక్కనుండాలి. మీరు గొప్పగా చదివించేలా రాయటమేగాదు... పాఠకులను ఉన్నతంగా ఆలోచింప జేసేలా రాయగలగాలని నా కోరిక. ప్రస్తుతం మీ రచనలు గొప్పగా ఉన్నా విషయం అంత గొప్పగా ఉండటంలేదని పిస్తోంది నాకు"

రవళి చెప్పిందంతా శ్రద్ధగా విని, బరువుగా నిట్టూర్చాడు రవి. ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకొని, మృదువుగా నొక్కాడు.

రవళి ఏం మాట్లాడలేదు.

కొద్దిక్షణాల తర్వాత రవళి సున్ని తంగా తన చేతిని అతని చేతుల మధ్య నుంచి తీసుకోవాలనుకుంది. కాని ఆ పని చేతకాలేదు.

అంతలో కాలింగ్ బెల్ మోగింది.

రవి చేతులు ఆమె చేతిని వొదిలే యడం, అతని చేతుల్లోంచి ఆమె చేతిని తీసుకోవడం ఒకేసారి జరిగాయి.

"మిమ్మల్ని డిస్టర్బ్ చేయడం లేదు గదా!" అంటూ ప్రవేశించాడు హరి.

ఆ మాటలకు రవళి నవ్వింది.

''ప్రపంచంలో నీకొక్కడికే మేనర్స్ తెల్సినట్టు పెద్ద! సరేగానీ... భోజనానికి ఆర్డరివ్వు" అన్నాడు రవి.

"రవళిగారు బ్రేక్‌ఫాస్ట్ వేళకొచ్చి లంచ్ వేళదాకా ఆగిపోయారంటే నీ సాహిత్యం మొత్తం గురించి డిస్కస్ చేసివుంటాలి"

"ఇంకా పూర్తి కాలేదు. మధ్యాహ్నం టీకి, రాత్రి డిన్నర్‌కు కూడా మనతోటే వుంటారు" అన్నాడు రవి.

"ఇట్స్ ఎ ప్లెజర్. అంతకంటె ఆనంద మేముంది?" అన్నాడు హరి.

"లేదండి...నేను వెళ్లాలి" అంది రవళి మొహమాటంగా.

''నో నో! మీరు మాతోటే ఉంటు న్నారు. సాయంకాలం ఫంక్షన్‌కు మా వెంట వస్తున్నారు. రాత్రి డిన్నర్‌కు కూడా మాతోటే ఉంటున్నారు. డ్రస్సు మార్చుకోవడానికి ఇంటికి వెళ్లాల్సి

వుంటే కింద కారుంది. ఎప్పుడు కావాలంటే అప్పుడు వెళ్ళిరావచ్చు" మృదువైన ఆదేశంలా అన్నాడు రవి.

సాయంత్రం నాలుగు గంటలకు రవళి ఇంటికి వెళ్ళి వస్తానంటూ లేచింది.

"పదండి. కింద మన కారుంది. డ్రైవరుకు చెబుతాను" అంటూ రవళి వెనుకే హరి కూడా నడిచాడు.

హోటల్ ఎడం పక్కగా పార్క్ చేసివున్న కారు దగ్గరకు రవళిని తీసుకెళ్ళాడు.

"అమ్మగార్ని ఇంటికి తీసుకెళ్ళి, వారి వెంటే వుండి తిరిగి ఇక్కడకు తీసుకురా" అని డ్రైవరుతో చెప్పాడు హరి.

హరి డోర్ తెర్చి "కూర్చోండి" అన్నాడు రవళితో.

రవళి 'థాంక్స్' చెప్పింది హరికి. కారు బయలుదేరింది.

హరి తిరిగి రూమ్‌కు వచ్చాడు.

"త్వరగా వస్తానన్నారా ఆవిడ?" ఆత్రంగా అడిగాడు రవి.

"త్వరగా వచ్చే ఉద్దేశం లేకపోతే కారెందుకు తీసుకెళతారు? కాకపోయినా, నీతో ఓసారి మాట్లాడినవాళ్లు నువ్వు తిరిగి ఈ వూరునుంచి వెళ్ళేదాకా నిన్ను వదలరని నీకు తెలుసు, నాకు తెలుసు"

"నువ్వొకసారి సైకియాట్రిస్టును చూడకూడదూ!"

"ఇప్పుడు నాకేమైందనీ?"

"అతి వాగుడుకు ఏమైనా ట్రీట్‌మెంట్ చెబుతారేమోనని"

"మాట్లాడే మనిషివల్ల ప్రమాదం లేదు బ్రదర్. మనిషి అర్థమైపోతాడు ఎదుటివానికి. మౌనంగావుండేమనిషితోటే ప్రమాదం. ఆ మనిషేమిటో, ఆ మనిషి మనస్సేమిటో చచ్చినా అర్థంచేసుకోలేం"

"ఇంకోలా ఎందుకనుకోకూడదు? అన్ని జీవరాసుల్లోకీ మనిషి ఒక్కడికే తెలివి ఎక్కువ. పైగా మాట్లాడగలిగిన జీవి. మనిషి మాటలు నేర్చినవాడు కాబట్టి మనస్సులో ఒకటి పెట్టుకుని, పైకొకటి మాట్లాడి, ఎదుటివాడికి అర్థం కాకుండా మాట్లాడొచ్చుగదా!" అన్నాడు రవి.

హరికి సమాధానం వెంటనే దొరకలేదు. చివరికి అన్నాడు "అదేనోయ్ నీలో ప్రత్యేకత? కాలికేస్తే మెడకూ, మెడకేస్తే కాలికీ-లంకె వేసి, నీ వాదనతో నువ్వే రైటనిపించుకుంటావు. అబద్ధాన్ని నిజంగానూ, తప్పును ఒప్పుగానూ ఒప్పిస్తావు. లాయరు కావల్సినవాడివి రచయితవయ్యావు" అన్నాడు హరి.

నవ్వి వూరుకున్నాడు రవి.

"నేను బయటికెళ్ళి తిరిగొచ్చేదాకా రవళీ, నువ్వూ ఏంచేసినట్టు?" కాసేపాగి అడిగాడు హరి.

"నీకెందుకంత క్యూరియాసిటీ?"

"ఒకబ్బాయీ, మరో అందమైన అమ్మాయీ గదిలో మూడుగంటలుంటే.. అందులోనూ ఇలాంటి చక్కటి హోటల్ రూం వాతావరణంలో ఏం జరిగి వుంటుందోనని తెల్సుకోవాలనే కుతూహలం ఎవరికైనా కలుగుతుంది"

"నాన్సెన్స్! ఇద్దరు మగవాళ్ళు ఒక గదిలో వుంటే అలాంటి క్యూరియాసిటీ కలగదా?"

"కలక్కపోవచ్చు... కలగదుకూడా. ఆడా మగా కల్సివుంటే అనుమానిస్తారుగానీ, ఇద్దరు మగవాళ్ళుంటే ఎందుకనుమానిస్తారు? వాళ్ళిద్దరూ ఏ స్మగ్లర్సో,

గ్యాంబ్లర్సే అయితే లోపల ఏం చేస్తూ వుంటారా అని పోలీసులు అనుమానిస్తారు! ఈమధనంతా ఎందుకన్నా, నీ సంగతి తెల్సినవాణ్ని కాబట్టి అడుగుతున్నాను...కథ ఎందాకా నడిచింది?"

"వచ్చాక ఆమెనే అడుగరాదూ?"

"ఇదిమటుకు అన్యాయం రవీ! ఇన్నాళ్ళబట్టి స్నేహితులం. నువ్వు చెప్పింది ఆ ఆడపిల్ల ఎందుకు చెబుతుందయ్యా" చెప్పి తీరాలనే డిమాండ్ చేస్తూ అడిగాడు హరి.

రవి ఎక్కడా చెక్కు చెదరకుండా "నా సంగతి నీకు తెల్సు కాబట్టి నీకు చెప్పనక్కరలేదు. ఆమె సంగతి నీకు తెలియదు కాబట్టి ఆమెనే అడుగు" అన్నాడు.

"తప్పు నాదేలే. ఆమె వెంట అదే కారులో తోడుగా వెళ్ళివుంటే ఏం జరిగిందో నేనే చెప్పివుండేవాణ్ని దట్సాల్ రైట్....ఏదో ఓరోజు మూడ్‌లో ఉండగా నువ్వు చెప్పకపోతావా! నేను వినకపోతానా" అన్నాడు హరి.

ఇంతలో ఫోన్ మోగింది.

హరి రిసీవర్ ఎత్తుకుని "జస్ట్ ఎ మినిట్" అని, "నీకే" అంటూ రవికిచ్చాడు రిసీవర్.

రవి మాట్లాడాడు.

"అలాగే? ఆరు గంటలకు మేం రెడీ. రండి" అని రిసీవర్ పెట్టేశాడు రవి.

"లేచి తయారవ్వు. మళ్ళీ ఆ అమ్మాయి వస్తే డ్రస్సు మార్చుకోవడం ఇబ్బంది" అని సలహా ఇచ్చాడు హరికి.

హరీ, రవీ తయారయ్యారు.

టైం అయిదున్నర కావస్తోంది.

కాలింగ్ బెల్ మోగింది.

"ప్లీజ్ కమిన్" అని అరిచాడు హరి మామూలు ధోరణిలో.

కాలింగ్ బెల్ నొక్కినవాళ్ళు తలుపు తెర్చుకొని లోపలకు రాలేదు.

"స్టూడెంట్స్ యూనియన్‌వాళ్ళేమో.. వెళ్ళిచూడు" అన్నాడు రవి.

హరి వెళ్ళి తలుపు తెరిచాడు.

ఎదురుగా రవళి.

పొద్దున్నకంటే ఇపుడు చాలా అందంగా వుంది. చాలా జాగ్రత్తగా అలంకరించుకొంది. అలంకరణ అంటే పట్టు చీరలూ, నగలూ కాదు. చూడ్డానికెంతో సింపుల్‌గా నిరాడంబరంగా వుంది. కాని అందులోనే ఏదో ఆకర్షణ కొట్టొచ్చినట్టు కనబడుతోంది. ఒక్క క్షణం కన్నార్పకుండా చూసి, తమాయించుకుని "రండి లోపలకు" అని వెంట తీసుకొచ్చాడు హరి.

"నేను లేట్ చేశానా?"

"లేదండీ" అన్నాడు రవి.

"ఆడది చీర సింగారించుకునేసరికి పూరు మాటుమణిగిందనే సామెతుంది. అలాంటిది ఆరుగంటలకు ప్రోగ్రాం అనుకొంటే అయిదున్నరకు వచ్చేశారనుకుంటే లేటు కానేకాదు" అన్నాడు హరి.

"థాంక్యూ" అంది నవ్వుతూ రవళి.

అంతలో కాలేజి యూనియన్ సెక్రటరీ వచ్చాడు.

"ఇతను నా స్నేహితుడు హరి. మంచి పాఠకుడు, స్వయంగా రచయిత కూడా. వీరు మిస్ రవళి. మా హరి కజిన్. నా సాహిత్యమంటే వారికి చాలా ఇష్టం. చక్కటి విమర్శనా శక్తిగల వ్యక్తి" అంటూ వాళ్ళిద్దర్నీ పరిచయం చేశాడు రవి.

తర్వాత సెక్రటరీని వాళ్ళకు పరిచయం చేశాడు.

"బయల్దేరదామా?" అన్నాడు




సెక్రటరీ.

"ష్యూర్. వీఆర్ రెడీ" అంటూ లేచాడు రవి. వెంట రవళీ, హరీ బయల్దే రారు.

వాళ్లు తీసుకొచ్చిన కారులో రవి ఎక్కాడు. అతను ఎక్కిన కారులోనే ఎక్కి అతని వెంటే వుండాలని రవళికి మనసునిండా వుంది. కాని తనని వాళ్ళకు పరిచయం చేసినప్పుడు రవి తనను హరి కజిన్ అని పరిచయంచేశాడు. అది గుర్తుకు తెచ్చుకుని ఆమె హరి వెంటేవుంది. తాను ఇంటికెళ్లి వచ్చిన కారులోనే ఎక్కింది రవళి.

ముందు రవి కూర్చున్న కారూ, ఆ వెనుక రవళీ, హరీ ఎక్కిన కారూ బయ ల్దేరాయి.

రెండు కార్లూ కాలేజి కాంపౌండ్‌లో ఆగాయి. అతిథుల్ని వెంటబెట్టుకుని యూనియన్ సెక్రటరీ ప్రిన్సిపాల్ రూమ్‌వైపు నడిచాడు.

ప్రిన్సిపాల్ లేచివచ్చి, రవినీ, అతని వెంటవున్న హరినీ, రవళినీ రిసీవ్ చేసు కున్నాడు. అప్పటికే వచ్చివున్న మరో ప్రసిద్ధ రచయిత్రి శ్రీలేఖను ప్రిన్సిపాల్ పరిచయం చేయబోయాడు.

"వారు నాకు తెలియకపోవడమేమిటి?" అన్నాడు రవి.

"గత సంవత్సరం అకాడమి అవార్డ్స్ ఫంక్షన్‌లో కల్సుకున్నాం. రచయితగా చాలాకాలంబట్టి తెల్సినా ముఖాముఖీని కల్సుకోవడం అదే మొదటిసారి" శ్రీలేఖ వివరించింది తనకు రవితోగల పరిచ యాన్ని.

ప్రిన్సిపాల్ యూత్ ఛాంబర్‌లో ఏర్పాటుచేయబడిన అల్పాహార విందుకు స్టాఫ్ మెంబర్సు, స్టూడెంట్ లీడర్సుకూడా హాజరయ్యారు.

రచయిత్రి శ్రీలేఖతో సహా అందరికీ రవితోమాట్లాడాలనేతాపత్రయమే. అతనికి చేరువగా నిలబడి ఫొటోలు దిగాలన్న ఆరాటమే. ముఖ్యంగా స్టూడెంట్స్‌లో ఈ పోకడ మరీ ఎక్కువగా కనిపించింది. "ఇప్పుడు మీరెన్ని సీరియల్స్ రాస్తు న్నారు?", "రాబోయే కొత్త సీరియల్ ఏమిటి?", "మూడు నాలుగు సీరియల్స్ ఒకేసారి ఎలా రాస్తారు?", "ఈ రచన లన్నీ మీ స్వానుభవాలేనా?"...ఇలాంటి ప్రశ్నలవర్షం కురిపిస్తున్నారు విద్యార్థులూ లెక్చరర్లూ కూడా.

రవి చిరునవ్వుతో పొడిమాటలతోనే సమాధానాలు చెబుతున్నాడు.

ఇంతమంది అంత ఇదిగా రవిని అభిమానించడం చూసిన రవళి మనసు లోనే గర్వపడింది. వీరికెవరికీ దొరకని అవకాశం తనకి కలిగినందుకు లోలోపలే సంతోషించింది. రవితో మాట్లాడాలని వీళ్ళందరూ ఎంతో తాపత్రయపడుతు న్నారు. కానీ తాను ఉదయంనుంచీ అతని వెంటేవుంది. ఆవిధంగా తాను నిజంగా అదృష్టవంతురాలే! ఈ ఆలోచనలతో రవి చుట్టూ మూగుతున్న జనాన్ని పరీక్షిస్తూ అతనికి కాస్త దూరంగానే నిలబడింది.

అల్పాహారం పూర్తయ్యాక అందరూ డయాస్ దగ్గరకు నడిచారు. స్టూడెంట్స్ యూనియన్ సెక్రటరీ అందర్నీ ముందు వరసలో కూర్చోబెట్టి డయాస్‌మీదకు వెళ్ళాడు.

ముందుగా ప్రిన్సిపాల్‌నూ, రచయిత్రి శ్రీలేఖనూ, ప్రఖ్యాత రచయిత రవినీ, యూనియన్ ప్రెసిడెంటునూ వేదికమీదకు ఆహ్వానించాడు.

రవి వేదికమీదకు వస్తూన్నప్పుడు సభలోవున్న విద్యార్థులు మిన్నుముట్టేలా చప్పట్లుకొట్టారు. రవికి లభించిన ఆ ఆహ్వానం, ఆదరణ అపూర్వం. ఒట్టి చప్పట్లతో తృప్తిచెందక కొంతమంది విద్యార్థులు 'రవీ...హిపిప్' అనికూడా అన్నారు; కొందరైతే ఈలలూ వేశారు.

సభా కార్యక్రమం మొదలయింది.

ప్రిన్సిపాల్‌గారి ప్రారంభోపన్యాసం, స్టూడెంట్స్ యూనియన్ సెక్రటరీ నివేదిక పూర్తి అయిన తర్వాత శ్రీలేఖ మాట్లాడటం ప్రారంభించింది. కొద్దినిముషాలకే జనంలో కలకలం ప్రారంభమైంది. జనాన్ని ఆవిడ ఆకట్టుకోలేకపోయింది. "రాసేవాళ్లందరూ మాట్లాడలేరు. మాట్లాడగలిగేవాళ్ళందరూ రాయలేరు. ఈ రెండు ప్రజ్ఞలూ కలిగివుండటం నిజంగా ఒక వరం" అంటూ తన ఉపన్యాసాన్ని ముగించి, కుర్చీలో కూలబడి, పవిట చెంగుతో ముఖానికి, మెడకూ పట్టిన చెమటను ఒత్తుకుందామె.

తర్వాత మాట్లాడవల్సిన వ్యక్తి రవి.

రవి మైకుముందు నిలబడ్డాడు.

విద్యార్థులు ఆపకుండా చప్పట్లు కొడుతున్నారు.

రవి చిరునవ్వు నవ్వాడు.



అయినా కరతాళధ్వనులు ఆగలేదు.

"థ్యాంక్యూ వెరీమచ్" అన్నాడు రవి.

సభనిండా నిశ్శబ్దం ఆవరించింది.

"మీరు నాపట్ల చూపిన అభిమానానికి కృతజ్ఞుణ్ని"

సూది నేలమీద పడినా వినపడేంత నిశ్శబ్దం నెలకొంది సభలో.

"నన్ను మీరింతగా గౌరవించడం చూస్తే నాకు జాలేస్తోంది. దానికి కారణం—నేను మీ అందరికంటే గొప్పవాణ్ని కాదు. మీరు అభిమానించి ఆరాధించే నాలోని రచయిత మీ అందరిలోనూ ఉన్నాడు. మీరెవ్వరూ ఆశ్చర్యపోనక్కర్లేదు. నేను నిజమేచెబుతున్నాను. నేనుచేసిన రచనల్ని మీలో ప్రతిఒక్కరూ చేయగలరు. దానికి కారణం–మన పసితనంనుంచీ మన నాయనమ్మో, అమ్మమ్మో కథలుచెప్పి మనల్ని బుజ్జగించారు. లాలి పాడి మనల్ని నిద్రబుచ్చారు. అలా ప్రతి తెలుగువాడూ కథను వినడం నేర్చుకున్నాడు, కథను చెప్పడమూ నేర్చుకున్నాడు. కథ చెప్పడం తెలుగువాడిసొత్తు.నవల అనేపదం ఇంగ్లీషు పదమే అయినా కథ లేనిదే నవలా లేదు. భారతం నవలా? కథా? కాశీమజిలీ కథలు నవలలా, కథలా? 'వేయిపడగలు' కథా, నవలా? పేరులో ఏముంది? సమకాలీన సాంఘిక రాజకీయ ఆర్థికపరిస్థితుల్ని సామాన్యుని జీవితాన్ని ప్రతిబింబించలేనిది నవల కాదు...." అలా రవి ఒక ప్రవాహంలా ఉపన్యసిస్తూ వుంటే సభ యావత్తూ నిశ్శబ్దంగా, నాగస్వరాన్ని వింటూన్న నాగులా, తన్మయత్వంలో మునిగిపోయింది.

రవి మాట్లాడే ప్రతిమాటకూ, అతడి మాటలకు ప్రతిస్పందనచెందే సభావేశాన్నీ రవళి శ్రద్ధగా గమనిస్తోంది. కొన్ని గంటల పరిచయంతో రవి తనకు సన్నిహితుడయిపోయాడని వూహించుకుంటూన్న రవళి, రవి ప్రతి మాటనూ, ప్రతి కదలికనూ, ప్రతి చేష్టనూ శ్రద్ధగా గమనిస్తోంది.

రవి ఉపన్యాసాన్ని ముగించాడు.

కరతాళధ్వనులు తప్ప ఇంకా ఏమీ వినిపించలేదు.

అక్కడక్కడ కూర్చున్న కొందరు లేచి రవిని దగ్గర్నుంచి చూడటానికీ, ఆటోగ్రాఫ్‌లు తీసుకోవడానికి స్టేజిమీదకు ఎగబడ్డారు.

అంతమంది, అందులో కొందరు అమ్మాయిలు కూడా రవికోసం ఎగబడుతూంటే ఎదుటి వరసలో ఒంటరిగా కూర్చోలేక రవళి కూడా స్టేజిమీదకు వెళ్ళింది.

అప్పటికి కర్టెన్ వాలిపోయింది.

అబ్బాయిలతోపాటు అమ్మాయిలూ రవి చుట్టూచేరి తాము ఆడవాళ్ళమన్న సంగతి మర్చిపోయి, షేక్‌హాండ్స్ ఇస్తూ, ఏవేవో మాట్లాడుతూ రవికి వూపిరాడనివ్వడంలేదు.

రవళి ఆ అమ్మాయిల ముందు తాను ఎంత చిన్నదో ఆ క్షణంలో తెల్సుకుంది. ఇన్ని ఆకర్షణల ముందు, ఇలాంటి ప్రజ్ఞ ప్రదర్శనలముందు రవి కరిగిపోకుండా వుండగలడా? అతన్ని తనవాడిగా చేసుకోగలదా? అసలితను మనిషిగా ఎలాంటివాడు?–అన్న ఆలోచనలు రవళి మనస్సును కమ్ముకున్నాయి.

చుట్టూ మూగినవారికి ఆటోగ్రాఫ్‌లు పెడుతున్నప్పుడు మధ్యలో ఓసారి రవళి చూపులతో రవి చూపులు కలిసి ఏదో మాట్లాడాయి. తన పద్ధతి ఆమెకు నచ్చలేదని అర్థమైంది, రవికి.




"సారీ! ఇంక ఆటోగ్రాఫ్స్‌లేవు. బై" అంటూ రవి వేదికమీదనుంచి దిగాడు.

ఈసారి రవి, హరి, రవళి కారులో బ్యాక్‌సీటులో కూర్చునారు.

స్టూడెంట్స్ యూనియన్ సెక్రటరీ ముందుసీట్లో కూర్చున్నాడు.

చల్లగాలిలో కారు వేగంగా పోతోంది హోటల్ దిశగా.

కారుకంటె వేగంగా రవి మనస్సు తియ్యని అనుభూతులవైపు పరుగులు తీస్తోంది. ఈమెకు తానంటే ఇష్టం అని స్పష్టమైపోయింది. నోరుతెర్చి అడగాలేకాని తన సర్వస్వాన్ని సమర్పించ డానికి సిద్ధంగావుంది.నిజానికి అడగాల్సిన అవసరం కూడాలేదు. కాస్త దారి చూపితే సరసకు చేరేట్లేవుంది. ఇట్లాంటి అనుభవాలు తనకేం కొత్తకాదు గానీ ఈమె తనకు కొత్త! పైగా చదువుకుంది. ధైర్యం, సంస్కారం ఉంది. విమర్శనా శక్తి వుంది. అన్నింటికీమించి తనమీద విపరీతమైన అభిమానముంది. అందుకే రోజంతా హోటల్లోనే గడిపేసింది. ఇప్పుడు ఏదో సాకుచెప్పి హరినీ, ఈ సెక్రటరీనీ త్వరగా వొదిలించుకోవాలి. తనూ, రవళీ ఏకాంతంగా గడపాల్సి ఉందనేసంగతి హరి అర్థంచేసుకోగలడు. వాడికి తన సంగతి బాగాతెల్సు. ఇక మిగిలింది సెక్రటరీ. హోటల్‌కు వెళ్లాక పరిస్థితినిబట్టి చూడొచ్చు...

రవళి తన ధోరణిలో తను ఆలోచిస్తోంది.

'ఇంతటి పేరుప్రఖ్యాతులూ, క్షణంలో మనుషుల్ని ఆకట్టుకొనే వాక్చాతుర్యం. ఆడా మగా అన్నభేదం లేకుండా అందర్నీ చుట్టూ తిప్పుకొనే ఆకర్షణ ఈ మనిషితో వ్యవహరించటం కష్టమే! ఇన్ని ఆకర్షణలూ, ఇన్ని ప్రలోభాలూ చుట్టూ ముసురుతూంటే ఏదోఒక వైపుకు కొట్టుకుపోడని నమ్మకమేమిటి? అయినా తనంటే ఒక ప్రత్యేక గౌరవాన్ని పెంచు కున్నట్లున్నాడు. ఒక్కసారి తను ఆయన కళ్లలోకి చూసేసరికే ఆ అమ్మాయిల్తో ఆటోగ్రాఫ్ అదే ఆఖరిదని చెప్పి బయల్దేరాడు. తను కోరుకునే ఆదర్శ జీవితం ఈయనతోనే స్థిరమైతే...ఇంకా ఆపైన ఆలోచించలేక తనలోతనే నవ్వుకుంది రవళి.

కారొచ్చి హోటల్ పోర్టికోలో ఆగింది.

"ఇంక మీరు వెళ్లిరండి... ఈ ఫంక్షన్ అరేంజ్‌మెంట్స్‌తో చాలా అలిసిపోయారు. నాక్కూడా వేరే పనులున్నాయి. రేపు కలుద్దాం" సెక్రటరీకి తన వెంటవుండే అవకాశమివ్వకుండా పోర్టికోనుంచే వెనక్కు సాగనంపాడు రవి.

"ఓకే సర్" అని అతను వెళ్లిపోయాడు.

హరీ, రవీ, రవళీ రూమ్‌కు వచ్చారు.

రవి హరిని ఎలా పంపించడమా అని ఆలోచిస్తున్నాడు. అనుకోకుండా "ఇంక నీ ప్రోగ్రాం ఏమిటి?" హరి అడిగాడు రవిని.

"నీ ప్రోగ్రాం ఏమిటి?" ఎదురుప్రశ్న వేశాడు రవి.

"హిమాయత్‌నగర్‌లో మా కజిన్ వుంది. ఫంక్షన్ అయ్యాక సాయంత్రం భోజనానికి వస్తానని చెప్పాను.వాళ్లు వొదిలేస్తే త్వరగావస్తాను.అలాగాక డిన్నర్‌లో ఉండిపోతే లేటవుతుంది" అన్నాడు హరి.

"ఓకే. వీలైనంత త్వరగారా. నువ్వొచ్చాక రవళిగారిని ఇంటిదగ్గర డ్రాప్

చేయాలి. మేమిద్దరం ఇక్కడే భోంచేస్తాం'' అన్నాడు రవి.

రవళి 'లేదండీ... నేను వెళ్లాలి' అనా లనుకుంది మర్యాదగా. ఒకవేళ అలా అంటే, 'మీరూ హరితో కల్సి వెళ్లండి' అని ఎక్కడ అంటాడోనని భయపడి రవి ప్రపోజల్‌కు అంగీకరించినట్లు మౌనంగా వుండిపోయింది.

హరి బయటికి వెళ్లిపోయాడు.



4

గదిలో రవి, రవళి ఇద్దరే వున్నారు.

ఇద్దరిమధ్యా కాసేపు నిశ్శబ్దం.

రవళి పత్రిక తీసుకొని పేజీలు తిరగే స్తోంది.

రవి బట్టలు మార్చుకొని బొమ్మల లుంగీ కట్టుకున్నాడు. బెల్ నొక్కాడు బెడ్‌మీద కూర్చుంటూ.

పత్రికచాటునుంచే ఒకసారి రవిని చూసింది రవళి. అదేసమయానికి అతనూ ఆమెను చూశాడు.

"చదువుతున్నారా? బొమ్మలు చూస్తు న్నారా?"

"వూరికే తిరగేస్తున్నాను"

''రవళిగారూ! ఉదయం తొమ్మిది గంటలకు మీరు గదిలోకి వచ్చినప్పుడు మీరు నా ఫ్యాన్. ఇప్పుడు ఎనిమిది గంటలు కావస్తోంది. ఈ పదకొండు గంటల్లో మనం దగ్గరయ్యాం. అంటే పరిచయస్తులయ్యాం. ఈ పరిచయం స్నేహమైతే బావుంటుందని నా కోర్కె. అందుకని మీరు ఫ్రీగా వుంటే నేనూ ఫ్రీగా వుండగలుగుతాను. ఇది మీ రూమ్ అనుకోండి. మిమ్మల్ని పరాయివాళ్లనుకో కుండా నా పద్ధతిలో నేనుంటాను. మీరూ అలాగే మీకు నచ్చినట్టు మీరుండండి" అన్నాడు రవి.

రవళి పకపకా నవ్వింది.

''ఎందుకు నవ్వుతున్నారు?''

''ఉదయంనుంచీ ఎలాగున్నానో ఇప్పుడూ అలాగే వున్నానుగా. మీరిదంతా ఎందుకు మాట్లాడారో తెలియక నవ్వాను'' అంది రవళి.

''కాదు. మీరు తెలిసే నవ్వారని పిస్తోంది"

అంతలో బేరర్ వచ్చాడు.

"నాలుగు సోడాలూ, రెండు థమ్స్ అప్‌లూ తీసుకురా"

రవి మొహంలోకి బెరుకు బెరుకుగా చూసింది రవళి.

కళ్ళతోటే ఫర్వాలేదని సమాధాన మిచ్చాడతను.

బేరర్ వెళ్ళిపొయ్యాడు.

బీరువాలోవున్న ఫారిన్ విస్కీబాటిల్ తీసి టీపాయ్‌మీద పెట్టాడు. ట్రేలో వున్న రెండుగ్లాసులు కూడా టీపాయ్ మీద వుంచాడు.

రవళి కాస్త ఇబ్బందిగా ఫీలవు తోందని గ్రహించాడు రవి.

"తాగేవాళ్ళంటే మీకు అసహ్యమా?"

''అబ్బె...అదేంలేదండీ!" అంది రవళి పెదవుల మీదకి రాని నవ్వును తెచ్చి పెట్టుకుంటూ.

"తాగేవాళ్ళందరూ తాగుబోతులు కాదండీ! తాగుబోతులంటే భయపడాలి.

మితంగా తాగేవాళ్ళను చూసి భయపడక్క్కర్లేదు" ధైర్యం చెబుతూన్నట్టు అన్నాడు రవి.

"అసలు తాగడం దేనికి?'' సూటిగా అతని కళ్ళల్లోకి చూస్తూ అడిగింది రవళి.

''హైదరాబాద్‌లో వుంటున్నారు. ఉమెన్స్ కాలేజీలో బి. ఏ. ఫైనలియర్ చదువుతున్నారు. అన్నింటికీ మించి ఆధునిక సాహిత్యంతో పరిచయముంది. నా రచనలు గొప్పగా ఉన్నాయికానీ, మంచిగా లేవంటున్నారు. మీరు వేసిన ఈ చిన్న ప్రశ్నకు సమాధానం కూడా తెలియదా?" ఎదురు ప్రశ్న వేశాడు రవి.

"సరైన సమాధానం నిజంగా నాకు తెలియదు. మీనుంచి తెల్సుకుందామని అడిగాను''

"అయితే చెబుతాను. మనిషి తాగటం వల్ల 'రిలాక్స్' అవుతాడు. చెప్పదల్చుకున్న మనసులోని విషయాన్ని ఏవిధమైన మొహమాటం, బిడియంలేకుండా ఫ్రీగా, ధైర్యంగా చెప్పగలుగుతాడు. ఇప్పుడు మనిద్దరంమాట్లాడుకుంటున్నామనుకోండి. ఒకటి రెండు రౌండ్స్ తర్వాత మీతో నేనింకా ఫ్రాంక్‌గా మాట్లాడగలుగుతాను. మీరూ నాతోపాటు కంపెనీ ఇచ్చారనుకోండి. మీరూ ఫ్రీగా, ఫ్రాంక్‌గా మాట్లాడగలుగుతారు"

''సారీ! నాకలవాటులేదు. నాకివాసనే పడదు. మా ఊళ్ళో కొన్ని పార్టీల్లో కంపెనీకి కూర్చోవాల్సొచ్చిందిగానీ, ఆ వాసనే నాకు పడదు"

"అయితే నేనూ మానెయ్యనా?'' అన్నాడు రవి పసివాడిలా.

రవళికి జాలేసింది. అతను అంతమంచివాడూ, మర్యాదస్తుడూనని వూహించలేదు తను.

"ఫర్వాలేదు...మీరు తీసుకోండి. నేను కూల్‌డ్రింక్‌తో కంపెనీ ఇస్తాను" అంది రవళి.

''థాంక్యూ. మీరు నిజంగా గొప్పవారు. ఎదుటి వ్యక్తుల్ని అవగాహన చేసుకోడంలో మీకు మీరే సాటి"

బేరర్ సోడాలు, థమ్సప్‌లు తెచ్చి టీపాయ్‌మీద పెట్టి వెళ్లాడు.

గ్లాసులో విస్కీ పోసుకొని, సోడా కలిపాడు రవి. మరో గ్లాసులో థమ్స్ అప్ బాటిల్ ఓపెన్‌చేసి పోశాడు. ఆ గ్లాసు రవళి ముందు పెట్టాడు. 'ఛీర్స్' చెప్పి, విస్కీ సిప్‌చేశాడు.

రవళి థమ్సప్‌ను సిప్‌చేసింది.

అసలు విషయాన్ని సభ్యతగా ఎలా చెప్పాలా అని ఆలోచించాడు రవి.

తన మనస్సులోని భావాలను అతనికి ఎలా వ్యక్తం చేయాలా అని ఆలోచిస్తోంది రవళి.

ఇద్దరూ ఎవరి ఆలోచనల్లో వారున్నారు.

అతనితో జీవితాన్ని పంచుకొంటే ఎలా ఉంటుందని రవళి ఆలోచన.

రవళిని ఎలా ప్రస్తుతం దారికితెచ్చి అనుభవించాలని రవి ఆలోచన.

ఉన్నట్టుండి గ్లాసు టేబిల్‌మీద పెడుతూ "మనిషికి జీవితంలో కొన్ని అవకాశాలు అరుదుగా వస్తాయి.అప్పుడా అవకాశాన్ని వినియోగించుకోకపోతే ఆ తర్వాత జీవితాంతం ఎదురుచూసినా అటువంటి అవకాశం మళ్ళీ రాకపోవచ్చు" అన్నాడు రవి.

"మీరు దేన్ని గురించి చెబుతున్నారు?"

"ఈవేళ ఈ గదిలో ఇలా మనిద్దరం కల్సుకోగలిగాం. ఈ ఏకాంతంలో ప్రశాంతంగా మాట్లాడుకుంటున్నాం.

ఇలాంటి ఏకాంతం మళ్ళీ మనకు దొరక్క పోవచ్చు"

"నిజమే! మీకు తీరిక చాలా తక్కువ. శారీరకంగా మనిషి ఒక చోట ఉన్నా మనస్సు ఎక్కడో వుండొచ్చు. రచయితలు గదా!" మృదువుగా అంది రవళి.

"ప్రస్తుతం మనిషీ,మనస్సూ ఇక్కడే వున్నాయి. మనస్సును కూడా అటూ ఇటూ పోనివ్వకుండా మీ ముందే నిల్పుకున్నాను" రవి ఆమె కళ్లల్లోకి చూస్తూ అన్నాడు.

"అయితే నేనొక కోర్కె కోరనా?" ఆ మాట అన్నప్పుడు ఆమె మొహంలో సిగ్గు తొణికిసలాడింది.

"అడగకుండా నేనే ఆ కోరిక తీర్చనా?" అంటూ ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు, రవి.

"సరిగ్గా మనం ఇలాంటి స్థితిలో వుండగానే పొద్దున డోర్ బెల్ మోగడంతో విడిపోయాం" గుర్తుచేశాడు రవి.

రవళి అతని చేతుల్లోంచి తన చేతిని తీసుకోవడానికి ప్రయత్నం చెయ్యలేదు రవి మరికొంచెం చనువు తీసుకోబోయాడు.

రవళి కాస్త జంకింది.

అతను తనవాడు కావాలి. ఇప్పుడు మాత్రమేకాదు,ఎప్పుడూతనవాడు కావాలి అతను. అందుకు అతను సరేనంటే తన అణువణువూ అతనికి అర్పించడానికి సిద్ధమే. అందుకే ''మీకు నేనో విషయం చెప్పాలి" అంటూ అతని చేతుల్లోంచి తన చేతిని వెనక్కి తీసుకొంది.

"చెప్పండి. ఏనీ కండిషన్స్?" కొంటెగా అన్నాడు రవి.

"మీరు నన్ను ప్రేమిస్తున్నారా?" సూటిగా అడిగింది రవళి.

"లేకపోతే ఇంతసేపు మీతో గడపలేను గదా!"

"నిజమే! కాని ఈ ఒక్కరోజూ మీరు నాతో ఇంతసేపు గడపడం కాదు నాకు కావాల్సింది. జీవితమంతా మీతో గడపాలని వుంది నాకు. అంటే మీచేత తాళి కట్టించుకొని, మీరెక్కడ తిరిగొచ్చినా మీకోసం ఎదురుచూస్తూ, పిల్లల్ని పెంచుకుంటూ వుండటంకాదు నా ఉద్దేశం. మీ ఆలోచనల్లో, మీరచనా వ్యాసంగంలో, ఇంటా బయటా కూడా మీ నీడలా మసలాలని నా కోర్కె. మీ నవలలు కాలక్షేపంగా కాక, ప్రయోజనకరంగా ఉండాలని నా కోరిక. మిమ్మల్ని నా కనుమరుగు కాకుండా కళ్లముందే అనుక్షణం నిల్పుకోవాలని ఆశ. దీనికి మీరు ఔనంటే ఈ క్షణం నుంచీ నేను మీదాన్నే'' అని ఆగింది రవళి అతని జవాబు కోసం ఎదురుచూస్తూ.

తను అనుకొన్నది వేరు, రవళి ఆశిస్తున్నది వేరు అని తెలిపోయింది రవికి.

'తనకు పెళ్లవలేదు గానీ సంబంధం సిద్ధంగా ఉంది. వెనకడుగు వేసే ప్రశ్న లేదు. అందువల్ల రవళి కోరినట్టు ఆమెతో తను ఉండగలగడం అసాధ్యం. అలా అనుకొంటే ఒక్క రవళేమిటి? చాలా మందితో తనకు పరిచయం కలిగింది. వారిలో కొందరితో సరదాలూ తీర్చుకున్నాడు. మరి వాళ్లందరూఇలాంటి కోర్కె కోరితే నవాబుగారి భార్యలకంటే తనకే ఎక్కువమంది వుంటారు? కాకపోయినా పెళ్లి ఆలోచనేమిటి ఈ పిల్లకు? సిల్లీ...' అలా ఆలోచిస్తూమరో సిప్‌తీసుకున్నాడు.

''మీరు నన్ను పెళ్లిచేసుకోవాలను కుంటున్నారా?'' సూటిగా అడిగాడు రవి.

''పెళ్లంటే మీ ఉద్దేశం?'' అంది





రవళి.

"అగ్నిసాక్షిగా కాని దేవుని ఎదుటగాని మనసా, వాచా కర్మా కల్సి జీవిస్తామని ప్రమాణంచేసి తాళిగట్టడం" వివరించాడు రవి.

"అలా ప్రమాణం చేసి తాళి కట్టి కూడా విడిపోయినవాళ్ళూ ఉన్నారు. కల్సి బతకనివాళ్ళూ వున్నారు. నాకు తాళి ప్రధానం కాదు. మనస్సూ, మనిషీ నా సొంతం కావాలి. నాకు హక్కు అక్కర్లేదు. కోరుకున్న మనిషితో కలిసి జీవించే అవకాశం కావాలి. జాపాల్ సార్త్రే, గోనేల జీవితం మీకు తెల్సుగా"

"వారిద్దరూ భార్యా భర్తలు కారు" అన్నాడు రవి- ఈమెకు చాలా విషయాలు తెలుసని మనస్సులోనే భయపడుతూ.

"కాని, అంతకంటే ఎక్కువే! కల్సి ఒకే ఇంట్లో వుండలేదు గానీ, కల్సి ఆలోచించారు, కల్సి జీవించారు. జీవితం చివరిదాకా ఒకరంటే ఒకరికి గౌరవం, ప్రేమ పెంచుకున్నారు. మీతో నాకు అలాంటి లైఫ్ లీడ్ చేయాలని వుంది" అంది రవళి నిర్భయంగా.

"ఒకవేళ నేను వివాహితుణ్ని అయితే!"

"నాకభ్యంతరం లేదు"

రవి షాక్ తిన్నాడు.

"బహు భార్యాత్వం చట్టరీత్యా నేరం గదా!"

"మీ భార్య స్టేటస్ నాకక్కర్లేదు. అంతకంటే నేనెక్కువ" చాలా ధైర్యంగా చెప్పింది రవళి.

"దీనికి మీ పెద్దవాళ్లు..." అని ఏదో అడగబోయాడు రవి.

"నేను పెద్దదాన్నే... మేజర్ని. మా పెద్దవాళ్ల వల్ల మీకేం ప్రమాదముండదు. ఎవరు అవునన్నా, ఎవరు కాదన్నా నా మనసుకు నచ్చినట్టు బతికితేచాలు అనే విశ్వాసంగల మనిషిని నేను. జీవితాంతం రాజీపడి బతికేకంటే మనసుకు నచ్చినట్టు ఒక్కరోజు బతకగలిగితే జీవితానికది వరమే" ఆవేశంగా అంది రవళి.

"ఆవేశపడుతున్నారు"

"లేదు...నిజమే చెబుతున్నాను"

"నేనందుకు అంగీకరించకపోతే?"

"ఈ రచనలకు అర్థం లేదనుకుంటాను. వ్యర్థమనుకుంటాను" అంది రవళి.

"ఆల్ రైట్. మీరూ నాకు కావాలి"

"థ్యాంక్యూ" ఎక్కడలేని ఉత్సాహం కనబరుస్తూ కళ్ళు వొత్తుకుంటూ అంది రవళి. కాని ఆ ఉత్సాహం ఆట్టేసేపు నిలవలేదు.

"ఫ్రెండ్‌గా మీతో కలవడానికి, మనిద్దరం ఏకాంతంగా ఒకటి రెండ్రోజులు గడపటానికి నేను సిద్ధమే గానీ..." రవి ఇంకా ఏదో చెప్పబోయాడు.

నివ్వెరపోయింది రవళి. ఆవేశంగా అంది-

"మీరు ఆశించేదానికి నేను రెడీ కాదు. నేను మీ నుంచి ఆశించేదానికి ఔనంటే మాత్రం జీవితమంతా నేను మీదాన్నే" స్పష్టంచేసింది రవళి.

ఆ అమ్మాయి ఆవేశం, నిర్ణయం, పట్టుదలా చూస్తే భయమేసింది రవికి. ఏదో పెగ్గు వేసి ఫోంచేసినట్టు ఏవిధమైన బాదరబందీ లేకుండా ఆ రాత్రి రవళితో గడిపి తనదారిన తను వెళ్ళిపోవచ్చనను కున్నాడు. కాని రవళి ప్రవర్తన తను అనుకున్న దానికీ, ఆశించినదానికీ విరుద్ధంగా వుంది. ఆ అమ్మాయి తీవ్రత చూస్తే ఏ అఘాయిత్యం చేస్తుందోనని

భయమేస్తోంది. ప్రస్తుతానికి ఆమె చెప్పిన ప్రతి విషయానికీ సరేనని తలవూపి ఆమెను సుఖపెట్టి, తాను సుఖపడి వెళ్ళిపోతే–ఆ తర్వాత ఆమె తను చావడం కాదుగానీ తననే చంపడం ఖాయం అనిపిస్తోంది. ఇలాంటి కేసు ఇంతవరకూ రాలేదు. ఈ పరిస్థితినుంచి ఒడ్డున పడాలంటే తన నిర్ణయాన్ని అయిష్టంగానైనా వాయిదావేయడం కంటే మార్గం లేదనుకున్నాడు.

"చూడండి రమణిగారూ! ఇన్ని నవలలూ, కథలూ రాశాను. కాని ఇలాంటి సంఘటనని నేను సృష్టించలేకపోయాను.



నా వయసు ముప్ఫై. నాకు వూహ తెలిసినప్పట్నుంచీ రకరకాల మనుషులతో పరిచయాలు పెంచుకున్నాను. కలిశాను, మాట్లాడాను. ఇటువంటి సంఘటన నాకెప్పుడూ ఎదురుకాలేదు. ఈసారి ఈ సంఘటన్నే ఆధారంగా తీసుకుని నవల రాస్తాను." అన్నాడు రవి.

"నవల కాకపోతే మహా కావ్యం రాయండి. కానీ ఇంతకీ నా కోర్కెను మీరు మన్నిస్తున్నారా లేదా?" సూటిగా అడిగింది.



"మీ ప్రశ్నకు సమాధానం నా నవల పూర్తయాక మీకే తెలుస్తుంది"

"సూటిగా చెప్పలేక, నవల ద్వారా ఏవేవో కారణాలు చెప్పి వదిలించుకోడానికేగా ఈ ప్రయత్నం?"

నఖశిఖపర్యంతం సున్నపుకుండలా వుడికిపోతూ ఎర్రబడిన కళ్ళతో, అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అడిగింది రవళి.

పైకి గంభీరంగా ఉన్నా రవి మనసు గజగజలాడుతోంది. ఈ పిల్ల ఏదైనా అఘాయిత్యంచేస్తే...? ఆమె తన హోటల్‌కు రావడం, తను ఎంగేజ్ చేసిన కారులో వాళ్ళ ఇంటికామె వెళ్ళడం, ఫంక్షన్‌కు తనతోపాటు రావటం, తిరిగి తనతో హోటల్‌కు రావటం చూసిన వాళ్ళు తనని రచ్చకీడ్చటం ఖాయం. పేరొస్తున్నవాడంటే పగబట్టేవాళ్లు వుంటారు. ఏమైనా ఈమెను నొప్పించకుండా తప్పించుకోవాలి. అలా ఆలోచిస్తూ "మీ ప్రశ్నకు సమాధానం నవల్లో చెబుతానన్నానుగానీ, మీ కోర్కెను తిరస్కరిస్తున్నానని చెప్పలేదే! ఆ నవల చదివాక కూడా మీరిదే నిర్ణయంతోవుంటే మీ కోర్కెను నేను మన్నించడం ఖాయం" అన్నాడు రవి.

"సరే! మీ నవలకోసం ఎదురుచూస్తూ వుంటాను. ఏ పత్రికలో వస్తుందో మీరు చెప్పనక్కర్లేదు. నేను అన్ని పత్రికలూ చూస్తూనేవుంటాను. మీ నవల పూర్తి అయ్యేదాకా మనం కలుసుకోము. ఆ తర్వాతే ఎప్పుడు కలుస్తామో, ఎక్కడ కలుస్తామో, ఎలా కలుస్తామో ... ఇక నేను వెళతాను" అంటూ లేచింది రవళి.

"కిందదాకా నేను తోడు వస్తాను... పదండి" రవి కూడా లేచాడు.

"ఇంటిదాకా రాలేరా?" అంది నవ్వుతూ.

"రావొచ్చు. కాని..." ఇంకా ఏదో అనబోయాడు.

"కిందిదాకా కూడా వద్దులెండి. నేన వెళ్ళగలను. ఇంకా సెకండ్‌షో పిక్చర అయి ఉండవు" అంది రవళి వాచీ చూస కుంటూ. వెంటనే లేచి అతడు తన వెం రావడం కోసం కూడా ఆగకుండా, రూమ్ నుంచి బయటికొచ్చి, వరండాలో నడు సాగింది రవళి.

రవి ఆమె వెంటే కిందిదాకా వెళ్లాడు తాను ఎంగేజ్ చేసిన కారులో హ వెళ్ళడంచేత, వేరే టాక్సీలో రవళి పంపించాడు. తిరిగి రూమ్‌కొచ్చి ఎప్పుడు తాగనంత తాగాడు.




వారపత్రికలో రవి కలంనుంచి వెల వడిన కొత్తనవల 'మోహం' ధారావాహి కంగా రాసాగింది.

పాఠకులు, అభిమానులు ఎంత ఉత్సుకతతో దాన్ని చదవసాగారు.

రవళికూడా మొదటివారం ఆ సీరియల చదివింది. అంతాతనకు తెల్సినవిషయమే తన గురించీ, తాను హోటల్‌కు రావడ గురించీ, హరీ, తానూమాట్లాడుకోవడం ఈ విషయాలే ఉన్నాయందులో.

సీరియల్ చదువుతూంటే, జరిగిందంతా కళ్ళకు కట్టినట్లుంది. తెల్సిన విషయమే అయినా తనచేత మళ్ళీ చదివించేలా రాశాడు అని మెచ్చుకుంది కూడా.

సీరియల్‌లో రెండోభాగం వచ్చింది.

రాత్రి ఇంటికి వెళ్ళింతర్వాత భోం చేసి, పక్కమీదనడుంవాల్చి సావకాశంగా పత్రికను తెరిచింది. తాను వూహించిన దానికంటే భిన్నంగా అందులో ఏమీ కనబడలేదు. కాలేజీకి ఫంక్షన్‌కు వెళ్ళడం, అక్కడ అమ్మాయిలూ, ఆటోగ్రాఫ్‌లూ.. అన్నీ ఆ విషయాలే ఉన్నాయి. తననే హీరోగా చేసుకొని రాసుకున్నాడు అను కొంది రవళి. అదీ నిజమే గదా అని సరి పెట్టుకుంది మళ్ళీ.

ఫంక్షన్‌నుంచి తిరిగి వచ్చాక తమ మధ్య జరిగిన సంభాషణ గురించి ఏంరాస్తాడో, అతని మనస్సులో తనని గురించి ఏమనుకున్నాడో వచ్చే వారంలో తెలియాలి అనుకుంటూ నిద్రపోయింది.

ఆ తరువాతి వారం...

తమమధ్య ఆరాత్రిజరిగినసంభాషణా, ఆ వాతావరణమూ ఎంత చక్కగా రాస్తాడో చూడాలన్న ఆత్రుతతో చదవ సాగింది. 'విస్కీతాగడం గురించికూడా రాశాడు. తను వద్దన్న సంగతి కూడా రాశాడు. మనిషి మరీ తెగించినవాడిలా ఉన్నాడు. లేకపోతే ఇంత పచ్చిగా, తాగినట్టు కూడా రాసేసుకుంటాడా?' అనుకుంది రవళి సీరియల్ చదువుతూ.

చివరకు తన కుడిచేతిని అతని చేతుల్లోకి తీసుకోవడం, తనని దగ్గరకు తీసుకోబోతూండగా తను మృదువుగా దూరం కావడంకూడా వర్ణించాక అక్కడ ఆగింది నవల.

అయితే ఇక అసలు విషయం వచ్చే వారంలో రావొచ్చు అనుకొంది రవళి.

మరుసటి వారం సీరియల్ వొచ్చింది. చేతికి పత్రిక రావడంతోటే ప్రశాంతంగా వున్న ఓ స్థలానికి వెళ్ళి, చెట్టుకింద కూర్చుని పత్రిక తెరిచింది రవళి. ఆ నాలుగు పేజీలూ గబగబా చదివేసింది.

'భలే తెలివైనవాడు. విషయాన్ని తేల్చకుండా మానసిక సంఘర్షణలను చిత్రిస్తూ, డ్రాగ్ చేస్తున్నాడు. తను ఎదురుచూసేలా చేయడం కోసమేగా ఇదంతా? సరే...ఎదురుచూస్తా! అతని సమాధానంకోసం, ఎంతకాలమైనా ఎదురు చూస్తా!' అనుకుంది రవళి.

మరుసటి వారం సీరియల్ వచ్చింది. రవళి గుండెలు కొట్టుకుంటున్నాయి. ఆ రాత్రి అతను చెప్పిన మాటల్నిబట్టి తన కోర్కెను మన్నిస్తాడనే ఆశ లేక పోయినా ఆశానిరాశలమధ్య నలుగుతోంది రవళి.

మధ్యాహ్నం కాలేజినుంచి త్వరగా ఇంటికి వెళ్ళిపోయింది. తన గదిలోకి వెళ్ళి పత్రిక తెరిచింది. సీరియల్‌కు వేసిన సెంటర్‌స్ప్రెడ్ బొమ్మ భయంకరంగా వుంది. హీరోయిన్ ఆత్మహత్య చేసు కున్నట్లుంది. ఆ బొమ్మ చూసి రవళి కంగారుపడి చదవడం మొదలెట్టింది.

"నాకు పేరు ప్రతిష్టలున్నాయి, భార్య లేకున్నా త్వరలో రానుంది. నీకు తాళి కట్టకుండా కేవలంనాఉంపుడుగత్తెగా ఉంచకున్నా, నా పేరు జనం నోళ్ళల్లో నానుతుంది. అది నాకిష్టంలేదు. కావాలంటే ఈ ఒక్క రాత్రే నీకు కాల్‌షీట్ ఇస్తాను. అంతకుమించి నానుంచి ఏమీ ఆశించకు" అని అతను సూటిగా చెప్పిన మాటలు విని, అతన్ని జాలిగా చూసి వెళ్ళిపోతుంది ఆ నవలలోని కథానాయిక.

అటువంటి వ్యక్తిని ఆరాధించినందుకు తనను తనే అసహ్యించుకొని ఆత్మహత్య చేసుకుంది ఆ అమ్మాయి..అదీ ముగింపు.

చివరివరకూ చదివి పత్రికను మధ్యకు చించేసింది రవళి పట్టరాని కోపంతో.

అయితే వీడు చెప్పే పరిష్కారం నన్ను ఆత్మహత్య చేసుకోమనా?జీవితం నవలంత తేలిక అనుకుంటున్నాడు కాబోలు! నా జీవితాన్ని తనకు ఇస్తానన్నానేకాని, చస్తాననలేదే! ఇదిలా జరగడానికి వీల్లేదు. వాడు తనకి చేతకాక కథానాయికను ఆత్మహత్యకు గురిచేసినా తనుమాత్రం చావదు. తనలాంటివాళ్ళను చావనివ్వదు. పైగా తగినట్టు బుద్ధి చెబుతుంది.

అసలీ మనిషంటే తనకెందుకింత వ్యామోహం?విపరీతమైన అందగాడా?... కాదే!

అసలు మనిషిని చూడనన్నా చూడకుండానే, స్వయంగా మాట్లాడకుండానే అతన్ని ఎందుకంతగా ఆరాధించింది తను?

ఎందుకు ఉత్తరాలు రాసింది?

ఎందుకతని సమాధానంకోసం ఎదురు చూసింది?

తనను ఇంతగా అతనివేపు ఆకర్షించిందేమిటి?

అతనితోనే కల్సి బతకాలని ఆశలు పెంచుకోవడానికి కారణమేమిటి?

అసలు ఈ ఆకర్షణ ఎక్కడ పుట్టింది?

ఈ ఆలోచనలతో ఆమె మనస్సు కళపెళలాడుతోంది.

చివరకు ఓ విషయం మనస్సుకు తట్టింది. అతని రచనలే తనకు అతనిపై పెరిగిన ఆకర్షణకు మూలకారణం.

అతనిలోని రచయితను తను ఆరాధించింది.

మనిషిగా కళ్ళముందు కనబడితే తనవాణ్ని చేసుకోవాలనితహతహలాడింది. అందుకు అతని ప్రజ్ఞే కారణం. ఆ ప్రజ్ఞే, రచనా శక్తే తన్ను ముగ్ధురాల్ని చేసింది.

గ్లామర్.

అతనిపట్ల తనకుగల గ్లామర్ తన్నీ స్థితికి దిగజార్చింది.

తను ఎదగాలి.

ఈ గ్లామర్‌నుంచి బయటపడాలి.

తను చదవాలి...ఇంకాఇంకా చదవాలి.

రాయాలి. రచయిత్రి కావాలి.

బాధ్యతగల రచయిత్రి కావాలి.

కనువిప్పు కలిగించే రచయిత్రి కావాలి. అతనిలో ఏం చూసి తను చేరువ కావాలనుకున్నదో, దాన్నే తన సొంతం చేసుకోవాలి.

అప్పుడతనితో తనకేం పని??

అనుకుంది రవళి.

* * *

బి.ఎ. ఫైనల్ ఇయర్‌కు ఆఖరు పరీక్ష పూర్తయింది. ఆన్సర్‌బుక్ ఇన్విజిలేటర్‌కు ఇచ్చేసి, ఎగ్జామినేషన్ హాలునుంచి బయటికొచ్చింది రవళి.

ఎప్పుడూ క్లాసునుంచిగానీ, ఎగ్జామినేషన్ హాలునుంచిగానీ బయటికొచ్చిన తర్వాత తన స్నేహితురాళ్లు రాణి,మంజు, వనజలకోసం ఏ చెట్టుకిందో నిలబడి ఎదురు చూడటం, వాళ్లుకూడా వచ్చాక కాలేజీ కాంపౌండ్‌లోవున్న క్యాంటీన్‌కో, బయట హోటల్‌కో వెళ్ళటం అలవాటు ఆమెకు. అలాంటిది ఈమధ్య తన స్నేహితురాళ్ళ కోసం ఎదురుచూడటంలేదు. కాస్త సమయం దొరికితే తిన్నగా లైబ్రరీకి వెడుతోంది. ఏదో ఒక పుస్తకం తీసుకొని చదువుతోంది.

అసలే ఎప్పుడూ రిజర్వ్‌డుగా ఉండే రవళి ఈమధ్య మరీరిజర్వ్‌డుగా ఉండటం




రాణీ, మంజూ గమనించారు! 'కారణ మేమయివుంటుంది చెప్మా!' అని వాళ్లల్లో వాళ్ళే తర్జన భర్జన చేసుకొని, వనజను అడిగారు కూడా.

"ప్రేమలోగానీ పడిందేమో!" అంది వనజ నవ్వుతూ.

"ప్రేమలో పడితేమాత్రం స్నేహితు లందర్నీ వదిలేసుకుంటారా?" రాణి అడి గింది.

"ఒంటరిగావుంటే ప్రేమించిన వ్యక్తినే ధ్యానిస్తూ వుండొచ్చు గదా!" మంజూ వివరించింది.

"నీ తలకాయ్! అసలు కారణం అదై వుండదు. ఏ మూడుగంటలకో లవర్‌ను వచ్చిగేటుదగ్గర వుండమన్నదనుకో! మనం కూడా వున్నామనుకో! అమ్మాయిగారికి ఇబ్బందేగదా! అందుకని ముందునుంచే మనల్ని దూరంగా వుంచితే, కావల్సిన వ్యక్తిని కావాలనుకొన్నప్పుడు కల్సు కోవడంలో ఇబ్బంది వుండదు" పెద్ద ఆరిందాలా వివరించింది రాణి.

ఈ రకంగా వాళ్లు చాలాసార్లు రవళి గురించి మాట్లాడుకున్నారు. కాని 'ఎందు కలా వుంటున్నావు?' అని ఎవ్వరూ రవళిని మొహంమీద అడగలేదు. వాళ్లు నలుగురూ కల్సి హాయిగా నవ్వుకున్నదీ, కబుర్లు చెప్పుకున్నదీ 'సాగర సంగమం' సినిమా చూసిన రోజునే. ఆ తర్వాతనుంచి రవళిలో వచ్చిన మార్పుమూలంగా అంత కలివిడిగా రవళితో వాళ్ళు ఉండలేకపోతున్నారు. ఆమెతో వాళ్లు వుండలేకపోవటం కూడా కాదు. అడిగిన ప్రశ్నకు ముక్తసరిగా సమాధానంచెప్పి,రవళే వాళ్ళకు దూరంగా వుంటోంది.

రవళికి ఏకాంతం కావాలి. ప్రతి నిము షాన్నీ, తనకు తెలియని విషయాన్ని తెల్సుకోవడంకోసం వినియోగించుకోవా లన్న తాపత్రయం ఆమెది. అందుకే కాలేజీ కాంపౌండ్‌లోచెట్లకిందా, కాంటీన్ లోనూ, వరండాల్లోనూ, వెయిటింగ్ రూమ్‌లోనూ రవళి కనిపించటంలేదు. ఉంటే క్లాసులేదాలైబ్రరీ.

పరీక్ష పూర్తయిం తర్వాత రవళి తిన్నగా లైబ్రరీకి వెళ్లి కూర్చుంది.

వనజ, మంజూ, రాణీ- రవళికోసం వెతుకుతున్నారు. రేపటినుంచి వాళ్ళు కాలేజీకి రానక్కరలేదు. రవళి హైదరా బాద్‌లో ఉండదు. పరీక్షలు అయిపోతాయి గనుక రెండుమూడురోజుల్లో వాళ్ల వూరు వెళ్ళిపోవచ్చు. అందుకని రవళిని కల్సు కొని, సాయంకాలం దాకా నలుగురూ బయట కులాసాగా కాలక్షేపం చేయాలని వాళ్ళ ప్రయత్నం.

రాణి ఎగ్జామినేషన్ హాలుదాకా వెళ్లి చూసివొచ్చింది రవళి ఉందేమోనని. తిరిగి వచ్చి "హాల్లో లేదర్రా" అంది.

"అయితే లైబ్రరీలో వుంటుంది" అంది వనజ.

తిన్నగా ముగ్గురూ లైబ్రరీవైపు బయల్దేరారు.

రాణీని వెళ్లి, రవళిని పిల్చుకు రమ్మన్నారు వనజా, మంజూలు.

రాణీ లైబ్రరీలోకివెళ్లి, నాలుగుమూలలా వెతికింది. ఎక్కడా రవళి కనిపించ లేదు. తిరిగి వస్తూ వస్తూ లైబ్రేరియన్ రూములోకి తొంగి చూసింది. అక్కడ వుంది రవళి. లైబ్రేరియన్‌తో మాట్లాడు తోంది.

రాణి అక్కడకు వెళ్ళేసరికి, "పిల్లే దమ్మా! పరీక్షలైపోయాక, మీరు తీసుకున్న పుస్తకాలు లైబ్రరీకి రిటర్న్ చేయాల్సిందే. ఆ తర్వాత లైబ్రరీనుంచి

పుస్తకం తీసుకోడానికి వీల్లేదు" అంటున్నాడు లైబ్రేరియన్.

"మరి నాకు బుక్స్ కావాలంటే ఎలాగండీ?" రవళి అడిగింది.

"బయట బోలెడు పబ్లిక్ లైబ్రరీలు వున్నాయిగదా! హైదరాబాద్‌లో మీకు చాలా మంచి లైబ్రరీలున్నాయి. కావాలంటే మెంబరుగా చేరవచ్చు. లేదా లైబ్రరీలో మెంబరుగావున్నవాళ్ళ ద్వారా కావల్సిన పుస్తకాలు తీసుకోవచ్చు ... అదీ పద్ధతి. ఇక్కడైనా లెక్చరర్లద్వారా తీసుకోవచ్చు'' అంటున్నాడు లైబ్రేరియన్.

ఈమధ్య తరచూ లైబ్రరీలో రవళి కనిపించడంతో పుస్తకాలు చదవడంపట్ల ఆమె ఆసక్తి చూపుతోందని గమనించి, అంత వివరంగా చెప్పాడు లైబ్రేరియన్.

బయటికి వస్తోన్న రవళి, పక్కనే వున్న రాణిని చూసింది.

"ఏమిటే...బుక్స్ రిటర్న్ చేయటానికి వచ్చావా?" అడిగింది రవళి.

"ఇప్పుడు బుక్స్ రిటర్న్ చేయకపోతే కొంపలేమీ అంటుకుపోవు. మన కాషన్ మనీ డిపాజిట్ వీళ్ళ దగ్గరే వుందిగా. నేనొచ్చింది నిన్ను వెంట పెట్టుకువెళదామని" అంది రాణి.

"ఎక్కడికో?"

"చెట్టుకింద వనజా, మంజూ వున్నారు. ఈమధ్యన మామీద మరీ శీతకన్ను వేస్తున్నావు. ఈ వేళ ఆ పప్పులుడకవు. ఇప్పట్నుంచి సాయంత్రం దాకా నిన్ను మేము బుక్ చేసేసుకున్నాం"

"ఏమిటా వాగుడు?" సున్నితంగా రాణి నెత్తిమీద మొట్టింది రవళి.

రాణీ, రవళీ బయట నిలబడ్డ వనజను, మంజూని వచ్చి కలిశారు.

"ఇహ పదండి" అంది వనజ.

"ఎక్కడికి?" రవళి అడిగింది.

"ముందు తిన్నగా హోటల్‌కెళ్ళి లంచ్ తీసుకుందాం. అక్కణ్ణుంచి పిక్చర్‌కి. ఆ తర్వాత ఓ గంట పార్క్కెళ్ళి పిచ్చాపాటీ, ఆపైన బ్రేక్అప్" అంది మంజూ.

"ఇవాళ ఎందుకింత టైట్ ప్రోగ్రాం?" అంది రవళి.

"ఈమధ్య నువ్వు మాకసలు దొరకటంలేదు. రేపట్నించి కాలేజీయే లేకపోతే దొరుకుతావన్న ఆశ అసలే లేదు. తర్వాత మళ్ళీ ఎప్పుడు కలుస్తామో ఏమిటో! ఈరోజు మేం చెప్పినట్టు మాతోనే వుండాలి నువ్వు"

మంజూ మాటలకు రవళి కాదనలేకపోయింది. 'మళ్ళీ ఎప్పుడు కలుస్తామో.. ఏమిటో' అన్న మంజూ మాటలకు రవళిలో ఏదో మార్పు వచ్చింది.

వాళ్ళ ప్రపోజల్‌కు అడ్డు చెప్పకుండా "సరే...పదండి'' అని వాళ్ళ వెంట బయల్దేరింది.

అనుకొన్న ప్రకారమే మొదట లంచ్. తర్వాత ఇంగ్లీషు పిక్చర్ మ్యాట్నీ.

ఆ తర్వాత పార్క్‌కు వెళ్లి ఏపుగా ఎదిగిన ఓ పొద పక్కన మెత్తని పచ్చిక మీద కూర్చున్నారు నలుగురు.

వాళ్ల నలుగురిలోనూ ఆ క్షణంలో వున్నది ఒకటే బాధ. కాలేజీ కారణంగా రోజూ నలుగురూ కలుస్తున్నారు. రేపట్నుంచి కాలేజీ లేకపోతే, కలవాల్సిన అవసరముండదు. మధ్యలో ఎక్కడైనా, ఎప్పుడైనా కనబడితే ఒకర్నొకరు పలకరించుకోవచ్చు. ఎవరి జీవిత మార్గాల్ని వాళ్లు ఎన్నుకున్న తర్వాత నలుగురూ నాలుగు మూలలకూ విడిపోవచ్చు. కొన్ని





వేళ తర్వాత ఏ రైల్వే ప్లాట్‌ఫారం మీదో, ఏ ఎగ్జిబిషన్‌లోనో అనుకోకుండా కలవొచ్చు. అలా కలవడం ఒక థ్రిల్. కాని ఇప్పుడు విడిపోవడం మాటలకందని ఆదో రకమైన బాధ. ఎవరి మటుకు వాళ్లకే ఈ బాధను వ్యక్తంచేసుకోవాలని ఉంది. కాని ఎలా చెప్పుకోవాలో తెలీదు. అందుకే మరింతసేపు కల్సి వుండాలనే తాపత్రయం.

కొంచెంసేపు నలుగురూ మాట్లాడకుండా నిశ్శబ్దంగానే ఉన్నారు.

"మీ వూరు వెళ్లిపోతున్నావా?'' ఓ గడ్డిపరకను తుంపి చిన్న ముక్కలు చేస్తూ రాణి అడిగింది రవళిని.

అప్పటికే రాణి కళ్లల్లో లీలగా నీళ్లు కనబడుతున్నాయి.

''బహుశా వెళ్లను''

''ఏం?''

''నిన్ను చూడకుండా వుండలేను'' అంది రవళి.

రాణిని ఏడిపించడానికి అలా రవళి అంటోందని మంజుకు, వనజకు తెలుసు. అందుకే వాళ్లు నవ్వారు.

రవళి కూడా నవ్వింది.

''ప్చ్. మీకెలా అనిపిస్తోందో ఏమో గాని, రేపట్నుంచి మనం కల్సుకోలేమన్న ఆలోచన వస్తే నాకు ఏడుపొస్తోంది'' అంది రాణి ఇంకా ఏడుపును ఆపుకోవడం చేతకాక ఏడ్చేస్తూ.

నలుగురిలోకీ కాస్త పెద్దగా వ్యవహరించే రవళి చిలిపిగా చలాకీగా వుండే రాణి కళ్ళల్లో నీళ్లు చూసి దగ్గరకు తీసుకొని, బుజ్జగించింది. కళ్లు వొత్త లేకుండానూ వుండలేకపోయింది.

''అదేమిటే పిచ్చి మొహమా! నేను నిజంగానే వెళ్లటం లేదు మా వూరు. వనజా, మంజూ, నువ్వూ ఈ వూళ్ళోనే వుంటారు. అంటే నలుగురం ఇక్కడే వుంటాం గదా! ఎప్పుడు కావాలంటే అప్పుడు మా ఇంటికి నువ్వు రావచ్చు, మీ ఇంటికి నేను రావచ్చు. ఇద్దరం కల్సి వాళ్ల ఇంటికెళ్ళొచ్చు. ఆమాత్రందానికే ఇంత ఇదైపోతే ఎలా?" అంది రవళి.

''నీకేం అమ్మా! ఎన్నయినా చెబుతావు. పరీక్షలైపోయాయిగా. చదువులు అయిపోయాయని పెద్దవాళ్లు పెళ్లి సంబంధాలు చూస్తారు. ఏ వూరివాడో, ఎక్కడి ఉద్యోగస్తుడో దొరుకుతాడు. వెంట తీసుకుపోతాడు. మనం కావాలనుకున్నప్పుడల్లా కల్సుకోవడం కుదురుతుందా?" అంది రాణి ఫిర్యాదు చేస్తున్నట్టు.

''ఇప్పుడందుకేమంటావ్?" అంది మంజు.

"మనం ఈ వూళ్ళో వున్నన్నాళ్ళూ రోజూ కల్సుకుందామంటాను"

''సరే! నువ్వు చెప్పినట్టే కల్సుకుందాం. ఇక బయల్దేరండి... పోదాం'' అంది రవళి లేస్తూ.

"నేనివ్వాళ నీతోటే వస్తాను. మీ ఇంట్లోనే పడుకుంటాను" అంది రాణి.

"ఏం?" అడిగింది మంజు.

"నా ఇష్టం. రవళికి లేని ఇబ్బంది నీకేమిటి?" దెబ్బలాడుతున్నట్టు అంది రాణి.

"దాని మాటలకేం! నువ్వురా నాతోటే" అంది రవళి రాణి భుజంమీద చేయివేసి నడుస్తూ.

అలా ఆ సాయంత్రపు వేళ వాళ్లు నలుగురూ ఎవరి దారిన వాళ్లు వెళ్ళారు.

ఆ రాత్రి చిలిపిగా, చలాకీగా కనిపించే రాణి రవళికి చాలా విషయాలు చెప్పింది.

"నాకో బావ వున్నాడు రవళీ! అతను



పుట్టకముందు నేను పుట్టివుంటే గొడవలేక పోయేది. అతను పుట్టిన నాలుగేళ్లకు నేను పుట్టాను.మర్నాటి నుంచే నన్ను మా బావ పెళ్లాన్ని అన్నారందరూ. నా మెళ్లో తాళి కట్టకపోయినా, నేనే తన పెళ్లాన్ని అని బావ అనుకుంటాడు. నాకేమో నా మొగుడు కమల్‌హాసన్ లాంటి యాక్టర్ కావాలని ఉంటుంది. తీరాచూస్తే మా బావ డాక్టరు. డాక్టరైనా 'ఫర్వా లేదు, సినిమాల్లో హీరోలా ఉండటానికి ప్రయత్నం చేయవయ్యా మహానుభావా!' అని మనిషి ఒంటరిగా దొరికినప్పుడల్లా చెప్పాను. నేను పుట్టినప్పట్నుంచీ తన పెళ్లామే అని అనుకుంటూ కూడా, నా దగ్గర హీరోలాగా బుగ్గమీద చిటికె వేయడంగానీ, చిలిపిగా కొంగు పట్టుకు లాగడంగానీ చేతగాని మనిషి అతను. చెప్పిచెప్పి నా నోరు నొప్పిపెట్టడమేతప్ప మా డాక్టరు యాక్టరుకాలేడని నాకు తెల్సు. నా జీవితానికి యాక్టర్ దొరికే అవకాశం లేదు" రవళి దగ్గర వాపోయింది రాణి!

రవళికి నవ్వొచ్చింది.

"ఏం....డాక్టరైతే మనిషికాదా?" అంది రవళి.

''నీకెలాచెప్పాలో నాకర్థం కావడంలేదు. కమల్‌లాంటి యాక్టర్నే పెళ్ళిచేసుకోవాలని నా కోర్కె''

''అతను నిన్ను చేసుకోడానికి సిద్ధంగా వుండాలిగదా?'

"అదీ పాయింటేలే! పోనీలేగానీ, నా నా సంగతి ఏమిటో నీముందు దాపరికం లేకుండా చెప్పేశాను. ఆమధ్య మనిద్దరం హోటల్‌కు వెళ్లాంగదా! మీ అంకుల్ని కలవాలన్నావు, నేను వెళ్లిపోయాను. ఆరోజు నువ్వు కాలేజీకి ఎందుకురాలేదో?"

"అంకుల్‌తో వుండిపోవాల్సి వచ్చింది" అంది ముక్తసరిగా రవళి.

"ఇంతకీ అంకుల్ అంటే బాబాయా, మామయ్యా?"

"ఏమిటే ఆ కొంటె ప్రశ్నలు?" అని జబ్బమీద గిల్లింది రవళి రాణిని.

"అయితే మామయ్యే నన్నమాట'' అంది నవ్వుతూ రాణి.

"కాదే! తెల్సినాయన. ఎప్పుడూ అంకుల్ అంటూవుంటాను" అంది రవళి.

''నీదగ్గర్నుంచి నిజాన్ని రాబట్టడం నాకు చేతగాదుగానీ, సూటిగా ఒక ప్రశ్న అడుగుతాను...చెప్పు"

''ఏమిటది?''

''నువ్వు ఎవర్నయినా ప్రేమించావా?"

''ఆ!''

''ఎవర్ని?" ఆత్రుతగా అడిగింది రాణి.

''నిన్ను" అంది రవళి కొంటెగా.

"అబ్బా....అదికాదోయ్! నువ్వు ఎవర్నయినా ప్రేమించి పెళ్ళిచేసుకోబోతున్నావా. ఆల్‌రెడీ ప్రేమించినవాడు వున్నాడా? లేకపోతే ఇప్పుడు ప్రేమించడం మొదలెట్టాలా! లేకపోతే ఎవర్నోకర్ని పెళ్లిచేసుకున్నాకే ప్రేమిస్తావా?"

"ఏమిటే పెద్ద విలేకరిలాగా?"

"ఇలా దాటవేస్తావుగానీ, సమాధానం మాత్రం చెప్పవు"

"నాకిప్పట్లో పెళ్ళిచేసుకునే వుద్దేశం లేదే"

"కారణం?''

"నేనేదో సాధించాలనుకుంటున్నాను"

"అందుకని పెళ్ళిచేసుకోవా? ఆ సాధించేదేదో పెళ్లిచేసుకున్నాక సాధించవచ్చుగా" అంది రాణి.

"అదికాదు రాణీ! నేను పి. హెచ్.డి. చేస్తేగాని పెళ్ళిచేసుకోనూ, ఉద్యోగం వస్తేగానీ పెళ్ళిచేసుకోనూ, ఫారిన్ వెళ్ళి వచ్చాకనే నా పెళ్ళి అని మగవాళ్ల అంటారా? అలాగే మనంకూడా ఫలానాది సాధిస్తేగానీ పెళ్లిచేసుకోను అని అనడం తప్పా?"

"అయితే మగవాళ్లతో పట్టుదలా నీది?''

"ఎవ్వరిమీదా కాదు. నా పట్టుదల నాదే. ఇప్పట్లో పెళ్ళివుద్దేశం నాకులేదు గానీ పిచ్చి ప్రశ్నలు వేయక ఇహ పడుకో" అని వొత్తిగిలి పడుకొంది రవళి.

ఆ మాటలు ఏవీ నిజమని నమ్మలేదు రాణి. కానీ తాను చేయదల్చుకుందే చెప్పింది రవళి.

* * *

ఆరోజు సాయంత్రం రవళి స్నేహితురాలు కల్యాణి పుట్టినరోజు. ఇంటర్మీడియట్‌లో ఆ ఇద్దరూ క్లాస్‌మేట్స్.ఆతర్వాత చదువు మానేసి పెళ్లిచేసుకుంది కల్యాణి. ఆమెభర్త ఏదో పత్రికలోపనిచేస్తున్నాడు. కళ్యాణి, ఆమె భర్తా చాలా అన్యోన్యంగా ఉంటారు. ఒకళ్ల పుట్టినరోజుకు ఒకళ్ల ఎంతో ప్రాముఖ్యాన్నిచ్చి సరదాగా స్నేహితులందర్నీపిల్చి జరుపుకుంటారు.





"మా ఆవిడ పుట్టినరోజు-తప్పకుండా రావాలి. మీతో మరీమరీ చెప్పమంది మా కల్యాణి" ఉదయాన్నే కల్యాణి భర్త మోహనరావు వచ్చి రవళిని ఆహ్వానించి వెళ్లాడు.

అందుకే సాయంత్రం అయిదుగంటలకు తయారై బయల్దేరింది రవళి.




**ఆ**మె కల్యాణి ఇంటికి చేరేసరికి ఆడా, మగా చాలామంది చేరివున్నారు.

రవళిని చూసి కల్యాణి, మోహనరావులు ఇద్దరూచాలాఆప్యాయంగాఆహ్వానించారు. మిత్రులకు పరిచయం చేశారు. ఒక ముప్పై యేళ్ళ యువకుణ్ని మోహనరావు రవళికి పరిచయం చేస్తూ, "పేరు పూర్ణిమ" అన్నాడు.

'అదేం పేరు? మగవారుగదా?పూర్ణిమ ఏమిటి?' అని కళ్ళతోనే ప్రశ్నించింది రవళి.

"అది వారి కలంపేరు. గొప్ప పేరేమీ లేదుగానీ చాలా మంచి రచయిత" మోహనరావు వివరించాడు.

"ఇది మా ఆవిడ పేరులెండి. ఆవిడ పేరుతోనే రచనలు చేస్తూంటాను. నా కలం పేరు పార్కర్'' జేబులోంచి కలం తీసి చూపిస్తూ అన్నాడతను.

రవళి నవ్వింది.

"పూర్ణిమగారు చాలా చమత్కారంగా మాట్లాడతారే!" అంది రవళి మోహనరావుతో.

"వారితో పరిచయమయినవారెవరూ వారిని మర్చిపోలేరు. అయిదునిముషాలు మాట్లాడితేచాలు, మర్చిపోనివ్వరు. వారితో మాట్లాడటం ఎడ్యుకేషన్, ఎంటర్‌టెయిన్‌మెంటు, థ్రిల్‌కూడా. ఒక్క మాటలో చెప్పాలంటే - వారిలో వరసగా వారం రోజులు మాట్లాడితే, అదొక వ్యసనంగా తయారయి, వారితో మాట్లాడకుండావుండలేని స్థితివస్తుంది. మీరిద్దరూ మాట్లాడుతూ వుండండి. ఫ్రెండ్స్‌వచ్చారు...రిసీవ్ చేసుకొని వస్తా" అని వెళ్ళాడు మోహనరావు.

"మీరేం చేస్తూ వుంటారు?" పూర్ణిమ అడిగాడు రవళిని.

"నిన్నటిదాకా కాలేజీ స్టూడెంట్‌ను. అంటే బి.ఎ. ఫైనల్ ఎగ్జామినేషన్ ఈమధ్యనేరాశాను.ప్రస్తుతం ఏంచేయాలా అని ఆలోచిస్తున్నాను" అంది రవళి.

"ఆలోచించినా, ఆలోచించకపోయినా ఉన్నవి రెండే మార్గాలు. చదవాలనుకొంటే ఎం.ఎ.చదవడం. చదివింది చాలనుకొంటే పెళ్ళిచేసుకొని ఒక ఇంటివారు కావడం"

"మరోమార్గం లేదంటారా?"నవ్వుతూ అంది రవళి.

"పురుష నియంత్రణలో ఎందుకుండాలి అని మీరనుకుంటే కుమారి రవళిగానే ఉండిపోవడం"

"మోహనరావుగారు చెప్పినట్టు మీతో మాట్లాడటం నిజంగా ఒక ఎడ్యుకేషన్"

"అది వారి అభిమానం. నేను చెప్పేది మీరు వింటున్నారుగాబట్టి, నాకు తెల్సిన విషయాలు మీరు తెలుసుకుంటున్నారు. మీలాగే నేను కాసేపు నోరుమూసుకొని, మీరు మాట్లాడే విషయాలు వింటున్నానను

కోండి. నా తెలియని విషయాలు మీదగ్గర నుంచి తెల్సుకొని మీవల్ల నేనూ ఎడ్యుకేట్ అవుతానుగా"

"నిజం చెప్పారు. కాని నేనేమీ తెలియని దాన్ని అయితే నానుంచి మీరు ఏం తెల్సుకోగలరు"

"నాకు అన్నీ తెల్సని మీరెందుకనుకుంటున్నారు? ఉదాహరణకి, మీకు కుట్టుపని వచ్చుననుకోండి. డ్రాయింగ్ బుక్‌లో వున్న డిజైన్‌చూసి, గుడ్డమీద దాన్ని కుట్టేదాకా ఏమేమి చేయాలో మీకు క్షుణ్ణంగా తెలిసివుండొచ్చు. కుట్టుపనితో పరిచయమే లేని నాకు ఆ పద్ధతులన్నీ తెలియాలని లేదుగదా!" అన్నాడు పూర్ణిమ.

ఆ వాదన రవళికి నచ్చింది. అతన్ని ఇంకా మాట్లాడించాలని అనిపించింది ఆమెకు. సాహిత్యం గురించి అతని అభిప్రాయాలేమిటో,రచనా విధానంలో అతని పద్ధతులేమిటో తెలుసుకోవాలనిపించింది. రవిలా పాపులర్ కాకపోయినా, పూర్ణిమకు కూడా పేరుంది. అతని పాఠకులు అతనికున్నారు. రవి దగ్గర కనిపించే ఆడంబరం ఇతని దగ్గరలేదు. ఏవిధమైన నటనా లేకుండా ఉన్నది ఉన్నట్టు హాయిగా మనస్సువిప్పి మాట్లాడుతున్నట్టు అనిపిస్తోంది. అందుకే సంభాషణ ఇంకా పొడిగించాలనేవుద్దేశంతో "నాక్కూడా రాయాలని వుంది. కాని ఎలా మొదలుపెట్టాలో, ఏం రాయాలో తెలియని సందిగ్ధంలో వున్నాను" అంది రవళి.

ఒక్కసారి రవళిని తేరిపారజూశాడు పూర్ణిమ.

"ఏం...అలా చూస్తున్నారు? నేను రచయిత్రిని కాకూడదా?"

"కాకూడదని చూడలేదు. మిమ్మల్ని చూసి, ఈ కాసేపూ మాట్లాడిన తర్వాత మీరు రచయిత్రి అవుతారు అన్న నమ్మకం నాకు కలిగింది"

"ఎందుకని?"

"ఇంతసేపు నేను మాట్లాడింది మీరు విన్నారు కనుక. వినే ఓపిక మీకు ఉంది గనుక. ఇంకా నన్ను మాట్లాడించటానికి ప్రయత్నం చేస్తున్నారు గనుక...మీరు తప్పకుండా రచయిత్రి అవుతారు"

"మీ మాట నాకు అర్థం కాలేదు"

"ఇందులో అర్థంకాకపోవడానికేముంది? ముఖ్యంగా రచయితకు కావాల్సింది పరిశీలన. కళ్ళతో రూపాన్ని పరిశీలించవచ్చు. మాట్లాడించి కొంతవరకు మనిషిలోని మనసును పరిశీలించవచ్చు. ఆ రకంగా రచయితకు కావాల్సిన మొదటి అర్హత మీకుందని నేను గ్రహించాను. కాబట్టే మీరు రచయిత్రి అవుతారన్నాను అంత ధీమాగా"

"పరిశీలించినంతమాత్రంచేత కథ రాసేయగలమా? కథావస్తువు కావొద్దూ?"

"భలేవారే! ఒక ప్రఖ్యాత రచయిత ఏమన్నాడో తెలుసా?"

"ఏమన్నారు?"

"'నేను నా కిటికీ తెరుచుకుని, కిటికీ దగ్గర కూర్చుని బయటి ప్రపంచాన్ని చూస్తూవుంటే బోలెడన్ని కథా వస్తువులు కళ్ళముందు కనబడతాయి. నా మెదడు కిటికీలను కూడా తెరిచి వుంచితే ఆ కథా వస్తువులు వాటికి చేరతాయి. నన్ను కదిలిస్తాయి. నా చేత రాయిస్తాయి'అన్నాడు"

"చాలా చక్కగా చెప్పారు" రవళి ఆ రచయితను అభినందించింది.

"నిజం చెప్పమంటారా?"

"దేన్ని గురించి?" రవళి అంది.

"రచయితకు ముఖ్యంగా కావాల్సింది నా దృష్టిలో వాతావరణం. అంటే గాలి,




వెలుతురు, టెంపరేచర్ అని కాదు నా ఉద్దేశం. మల్లెపూవు, మంచిగంధం, పండు వెన్నెలా అసలేకాదు. రచయితకు కావాల్సింది మంచి పాఠకుడు. లేదా తాను చెప్పింది వినడానికి ఒక మంచి శ్రోత. అన్నింటికీమించి ఒక రచయిత రాసిందానిపట్ల శ్రద్ధచూపి చదివి నిష్పక్షపాతంగా విమర్శించే పాఠక విమర్శకుడు. ఈ పరిసరాలూ, పరిస్థితులూ మనిషిలోని రచయితను తట్టి లేపడానికీ, రచయిత తప్పటడుగుల నడకలో ఉన్నప్పుడు చేయూతనిచ్చి దృఢంగా నడిపించడానికీ, రచయితను పెంచడానికీ తోడ్పడతాయి. ఇలా మనం కల్సుకున్నాం. ఏవేవో మాట్లాడుకున్నాం. మళ్ళీ మళ్ళీ కల్సుకున్నామనుకోండి. మీరు రాసింది నాకు చదివి వినిపిస్తారు. లేదా రాద్దామనుకుంది నాతో చర్చిస్తారు. ఇవన్నీ కూడా రచయితకు ఎంతో తోడ్పడతాయి! ఇలా కల్సే స్థలాన్నే రైటర్స్ క్లబ్ అంటారు. విదేశాల్లో ఈ క్లబ్స్ ఎక్కువ. ఇలాంటి క్లబ్స్ రచయితకు రాసేందుకు ప్రోత్సాహాన్ని, రాయడానికి తగిన వాతావరణాన్ని కల్పిస్తాయి"

అతను అలా మాట్లాడుతూంటే ఒక ప్రతిమలా వింటూ నిలబడిపోయింది రవళి.

"మీ రేం మాట్లాడదల్చుకోలేదా?" అడిగాడు పూర్ణిమ నవ్వుతూ.

రవళి కూడా నవ్వింది.

"కొన్ని పత్రికల్లో రచయితయొక్క తొలి అనుభవాల్ని గురించి లేదా తాము ఎలా రచయితలయ్యారో రచయితలు వివరించడాన్ని చదువుతూవుంటాం ... అవన్నీ నిజమేనంటారా?" రవళి కుతూహలంతో అడిగింది.

"చూడండి రవళిగారూ...రచయిత కూడా మనిషేగదా! సాధారణంగా మనిషికుండే ప్రలోభాలన్నీ రచయితకు కూడా వుంటాయి. మామూలు మనిషిలాగే రచయితకూ ఆలోచనలుంటాయి. రకరకాల వూహలుంటాయి. మామూలు మనిషి ఈ ఆలోచనల్నీ, ఊహల్నీ మాటల్లో చెప్పలేడు. రచయిత వాటిని మాటల్లో చెప్పగలడు. ఊహల్ని మాటల్లో చెప్పగలిగిన రచయిత అన్నీ నిజమే చెబుతాడా అంటే అది అతని ప్రవృత్తిమీద ఆధారపడి ఉంటుంది. బాగా పేరు వచ్చాక ఏదో గొప్పగా చెప్పాలనే తాపత్రయంతో జరిగింది ఒకటయితే వేరొకటి చెప్పవచ్చు. తాను చెప్పింది ఆకర్షణీయంగా ఉండటం కోసం నిజం చెప్తూనే కల్పించీ చెప్పొచ్చు. ఒక్కొక్కసారి నిజం చెప్పొచ్చుకూడా" అని వివరించాడు పూర్ణిమ.

ఇంతలో కళ్యాణి వచ్చింది. "ఏమిటి రవళీ! పూర్ణిమగారితో సుదీర్ఘంగా చర్చిస్తున్నావు?" అంటూ

"ఏంలేదండీ! రచయితలూ, రచనలూ ఇలాంటి విషయాన్ని గురించి రవళిగారు అడుగుతుంటే నాకు తోచింది నేను చెబుతున్నాను" అన్నాడు పూర్ణిమ.

"మా రవళి మితభాషి. మీతో ఇంతసేపుగా మాట్లాడుతూవుంటే మీరిదివరకే ఆమెకు తెలుసేమో అనుకున్నాను"

"లేదండీ..ఇప్పుడే మోహనరావుగారు పరిచయంచేశారు"

"రండి..అందరూ వచ్చారు" అంటూ ఫలహారాలు అమర్చివున్న టేబుల్ వైపు నడిచింది కళ్యాణి.

ఆమె వెనుకనే రవళీ, పూర్ణిమా నడిచారు.

'మనం మళ్ళీ ఎప్పుడు కలవగలం?' అని అడగాలనుకుంది రవళి పూర్ణిమను. అడిగితే ఏమనుకుంటారోనన్న మొహమాటంతో అడగలేకపోతోంది.

"మీరెక్కడుంటారు ?" పూర్ణిమ అడిగాడు రవళిని.

చెప్పింది రవళి.

"అయితే మీరు మా ఇంటికి దగ్గర్లోనే వున్నారు"

"మీ ఇల్లెక్కడండీ?"

"బేగంపేట. ఇదిగో నా విజిటింగ్ కార్డు. మీరా నంబరుకు ఫోన్‌చేస్తే ముందు నేనే పలుకుతాను"

"అదేమిటి?"

"నేను ఎక్కువసేపు నా డ్రాయింగ్ రూమ్‌లోనే కూర్చుంటా. అదే నా రీడింగ్ రూమూ, నా రైటింగ్ రూమూకూడా. నా పక్కనే ఫోన్ ఉంటుంది. మా శ్రీమతి ఎక్కువసేపు వంటింట్లో వుంటుంది. అందుచేత ఫోన్ మోగగానే ఎత్తేది నేనే"

"మీరెప్పుడూ ఇంట్లోనే వుంటారా? అంటే ఉద్యోగమేది..."

"భలేవారే! ఉద్యోగముంది. మధ్యాహ్నం 12 గంటలనుంచీ 4గంటల దాకా నా ఉద్యోగం. మా స్కూల్లో షిఫ్టు సిస్టం ఉందిలెండి. అంచేత మిగిలిన సమయాల్లో ఎప్పుడూఇంటిదగ్గరేవుంటాను పైగా స్కూలు మాస్టరు ఉద్యోగానికున్న సెలవులు మరే ఉద్యోగానికీ వుండవు గదా! కనుక సాధారణంగా ఇంటి దగ్గరే దొరుకుతాను" అని తన గురించి సవిస్తరంగా వివరించాడు పూర్ణిమ.

అల్పాహార విందుకు వచ్చిన అతిథులందరూ ఆరగించారు.

పెద్దవాళ్లు కల్యాణిని ఆశీర్వదించారు.

చిన్నవాళ్ళు శుభాకాంక్షలు తెలియజేశారు.

ఆ తర్వాత ఎవరి దారిన వాళ్లు బయలుదేరారు.

కల్యాణి ఇంటినుంచి రవళీ, పూర్ణిమా కల్సి బయలుదేరారు.

రోడ్డుమీదకొచ్చి ఆటో ఆపాడు పూర్ణిమ.

"మీకభ్యంతరం లేకపోతే నాతో రండి. మిమ్మల్ని దారిలో మీ ఇంటి దగ్గర దింపి, నేను బేగంపేట వెళతాను" అని ఆహ్వానించాడు రవళిని.

"అలాగే" అని సంకోచించకుండా అతని వెంట ఆటోలో బయలుదేరింది రవళి.

సోమాజిగూడా చేరింది ఆటో

"మీ ఇల్లెక్కడ?" అడిగాడు పూర్ణిమ.

"ఈ పక్క గల్లీలోనే. లెఫ్టకు పోనివ్వు బాబూ" అని ఆటో అతనికి చెప్పింది.

ఆటో గల్లీలోకి వెళ్లాక ఒక ఇంటి ముందు ఆటోను ఆపమంది రవళి. ఆటో దిగకుండా—"ఇదే మా ఇల్లు. అంటే అద్దె ఇల్లు. గుర్తు పట్టగలరుగా మీరు" అంది రవళి.

"ఎందుకు పట్టలేను! దారి స్పష్టంగానే వుందిగా!" అన్నాడు పూర్ణిమ.

రవళి ఆటో దిగకుండానే "వెనక్కు తిప్పు బాబూ ఆటోను" అంది రవళి.

పూర్ణిమ అర్థంగానట్టు రవళిని చూశాడు.

"మీరిక్కడ దిగరా?" అని అడిగాడు.

"లేదు. నేను మీ ఇంటిదాకా వచ్చి, మీ ఇల్లు చూసుకోవాలిగా" అంది రవళి నవ్వుతూ.

వేనికన్నట్టు చూశాడు పూర్ణిమ.

ఆ భావాన్ని బయటకు కనబడనివ్వకుండా "వెల్‌కం... రండి" అని ఆహ్వా




నించాడు రవళిని.

"ఈరోజునుంచీ నేను మీ శిష్యురాల్ని. మీరు కాదంటే ఏకలవ్య శిష్యరికం. అవునంటే ముఖాముఖీ శిష్యరికం"

"దేన్ని గురించీ?''

"నేను రాయాలనుకుంటున్నాను.నాకు మీ సలహాలూ, సహకారం కావాలి" ప్రాధేయపడుతున్నట్టుగా అడిగింది రవళి.

''ఓ యస్...తప్పకుండా" అని తన అంగీకారాన్ని తెలిపాడు పూర్ణిమ.

ఇల్లు చేరుకున్నారిద్దరూ.

పూర్ణిమ ఆటో దిగాడు.

"రండి లోపలికి" రవళిని ఆహ్వానించాడు.

చిన్నగేటు తెర్చుకొని కాంపౌండ్‌లోకి ప్రవేశించారు ఇద్దరూ.

"మా ఆవిణ్ని పరిచయం చేస్తాను" అని. "ఏమోయ్'' అంటూ హాల్లోకి అడుగు పెట్టాడు పూర్ణిమ.

"వస్తున్నాను" అంటూపూర్ణిమభార్య వంటింట్లోంచి వచ్చింది.

"వీరు రవళిగారు. త్వరలోనే మంచి రచయిత్రి కాబోతున్నారు. ఈవిడే మా ఆవిడ...పూర్ణిమ" అని ఒకరికొకర్ని పరిచయంచేశాడు.

పూర్ణిమ నవ్వుతూ రవళిని పలకరించింది.

ఆమె నిండుగా, అందంగా, పున్నమి వెన్నెల్లా అగుపించింది రవళికి.

"రవళిగారు ఎప్పుడైనా మనింటికొస్తూ వుంటారు. నేను వున్నా లేకపోయినా..." అని ఏదో అతను అనబోతూవుంటే, "మర్యాదచేయాలి అని నాతోచెప్పాలా?'' అంది పూర్ణిమ.

ముగ్గురూ నవ్వుకున్నారు.

"ఆ ఆటో పంపేయండి" అంది పూర్ణిమ భర్తతో.

"లేదు...నేను వెళ్లాలి" అంది రవళి.

"భోంచేసే వెళ్లాలి మీరు" పూర్ణిమ అంది చనువుతీసుకొని రవళితో.

"ప్లీజ్..మరోసారి వస్తానండీ! ఇంటి దగ్గర వంటమనిషి నా కోసం ఎదురు చూస్తూ వుంటుంది"

"అయితే ఎప్పుడొస్తారు?"

"ఎల్లుండి ఆదివారం వస్తాను"

"మర్చిపోవద్దు మరి" ఎన్నాళ్ళబట్టో పరిచయమున్న స్నేహితురాల్లా ఆహ్వానించింది పూర్ణిమ.

"ఒక కండిషన్‌కు ఒప్పుకుంటేనే మా ఇంటికిరావాలి మీరు" అన్నాడు పూర్ణిమ.

రవళి తెల్లబోయి, "ఏమిటది?" అంది మెల్లగా.

"మీరు వచ్చేటప్పుడు మీవెంట మీరు రాసిన కథ ఒకటి తీసుకురావాలి. అది ఇక్కడ చదవాలి" అన్నాడు పూర్ణిమ.

రవళి మనస్సునిండా అతనిపట్ల ఏదో కృతజ్ఞతాభావం చోటుచేసుకుంది. అక్షరాభ్యాసం చేయించిన ఉపాధ్యాయునికి అయిదేళ్ళ పసిపాప మొక్కినట్టు చేతులు జోడించి, "అలాగే... ప్రయత్నిస్తాను మాస్టారూ" అంది రవళి.

* * *

రవళి రాసిన మొట్టమొదటి కథ పూర్ణిమను ఆకట్టుకోగలిగింది.

"బావుంది" అన్నాడు పూర్ణిమ.

''ఏవైనా మార్పులు, చేర్పులు..." అని ఏదో అనబోయింది రవళి.

"ఏమీ అవసరంలేదు. మీరేపత్రికకైనా పంపిస్తారా? నన్ను పంపించమంటారా?"

"మీరే పంపించండి" అంది రవళి.

వెంటనే పూర్ణిమ టేబిల్ డ్రాయర్లోంచి కవరుతీసి ఒక వారపత్రికకు ఆ కథను

పంపించాడు.

రవళి రాసిన కథల్ని పూర్ణిమ, అతని భార్య వినటం, చర్చించటం అలవాటయి పోయింది.

ఎప్పుడైనా పూర్ణిమ ఏదైనా రాస్తే రవళికి, తన భార్యకు చదివి వినిపిస్తు న్నాడు. విమర్శించడానికి రవళి మొహమాటపడినా, పూర్ణిమ శ్రీమతి మాత్రం ఏ మొహమాటం లేకుండా భర్త



రచనల్ని విమర్శిస్తుంది.

ఆ ఉత్సాహంతో నెలరోజుల్లోనే రవళి మూడు కథలు రాసింది.

వారి ముగ్గురిమధ్యా స్నేహం రోజు రోజుకీ పెరుగుతోంది. అరమరికలు లేని సన్నిహితులయ్యారు.

ఆరోజు రవళి ఒక ఉత్తరం తీసుకొని పూర్ణిమ ఇంటికొచ్చింది.

"అమ్మయ్య! మీరింట్లోనే వున్నారు. ఈ వార్త చెప్పడం మీకు ఆలస్యమవు తుందేమోనని, మీరింట్లోంచి బయటకు వెళ్ళకుండా వచ్చేయాలని తొందరగా వచ్చేశాను. నా కథ...అదే మీరు పంపిన

కథ, వచ్చేవారం పత్రికలో వస్తూందట. ఉత్తరం రాశారు'' ఎంతో ఆనందంగా చెప్పింది రవళి.

"కంగ్రాచ్యులేషన్స్. ఇహనుంచిరవళిగారి కథలు చాలా పత్రికల్లో కనబడతాయి" పూర్ణిమ అన్నాడు అభినందిస్తున్నట్టుగా.

శ్రీమతి పూర్ణిమ కూడా రవళిని అభినందించింది.

ఆ కొత్త ఉత్సాహంలో, సరదాలో రవళి విరివిగా రాయడం ప్రారంభించింది.

* * *

ఆరోజు సంక్రాంతి.

నవల రాయడం ప్రారంభించాలని టేబుల్ ముందు కూర్చుంది రవళి తెల్ల కాగితాలు ముందు పెట్టుకొని.

కథ మనస్సులోవుంది. ఎక్కడనుంచి కథ ప్రారంభించాలో ఆలోచిస్తోంది. ఇంతలో కాలింగ్‌బెల్ మోగింది.

వెళ్ళి తలుపుతీసింది.

ఎదురుగుండా తాతయ్య.

"రా తాతయ్యా!'' అంటూ లోపలకు తీసుకెళ్ళింది రవళి-ఆయన చేతిలోని బ్రీఫ్ కేసును అందుకొని.

రాఘవేంద్రరావు తాతయ్య వయస్సు అరవై దాటింది. ఎత్తయిన విగ్రహం. పచ్చటి శరీరఛాయ. వయస్సు అంతవున్నా శరీరదార్ఢ్యం తగ్గలేదు. జుట్టు తెల్లబడలేదు. కొద్దిగా చెంపలుమాత్రం నెరిశాయి. ఆయన ప్రతి కదలికలోనూ ఏదో ఠీవి, ఒకరకమైన హుందాతనం స్పష్టంగా కనబడుతున్నాయి. ఆయనచూపుల్లో తీక్షణత కొట్టొచ్చినట్టు కనబడుతోంది.

"పంతక్కా కూడా ఇంటికి రాలేదేమి టమ్మా?" అన్నాడు రాఘవేంద్రరావు.

ఆయనది కంచుకంఠం.

"రావడంలేదని ఉత్తరం రాశానుగా తాతయ్యా!" అంది రవళి మంచినీళ్ల గ్లాసు అందిస్తూ.

"ఏమో! నాకందలేదు. చూడాలని పించి నేనే వచ్చేశాను. చదువు పూర్తయి పోయాక కూడా పట్నంలో ఎందుకమ్మా మకాం... ఇంటికొచ్చేయొచ్చుగా" జతి మాలుతున్నట్టుగా అన్నాడు రాఘవేంద్ర రావు.

రవళి నవ్వింది. ఎంతో గారాబంగా తాతయ్య దగ్గరికెళ్ళింది.

"కాలేజీ చదువు అయిపోయినమాట నిజమే తాతయ్యా!కాని నేనిప్పుడు కథలూ, నవలలూ రాద్దామనుకుంటున్నాను" అంది రవళి సిగ్గుపడుతూ.

రాఘవేంద్రరావు ఆమె నెత్తి చేతితో నిమిరి "అయితే రచయిత్రివి కావాలను కుంటున్నావన్నమాట'' అన్నాడు ఆనం దంగా.

రవళికి ప్రాణం లేచివొచ్చినట్లయింది.

"ఇక్కడ రచనకు అనుకూలమైన వాతావరణం ఉంటుంది తాతయ్యా! ఏదైనా చర్చించుకొనేందుకు రచయిత లుంటారు. కావల్సిన పత్రికలన్నీ దొరుకు తాయి. లైబ్రరీలు వుంటాయి. అంచేత పట్నంలో ఉండటమే మంచిదని నాకని పిస్తోంది తాతయ్యా!" ప్రాధేయరపూర్వ కంగా చెప్పింది రవళి.

రాఘవేంద్రరావు రవళిని కన్నార్ప కుండా ఒక్కక్షణం చూసాడు.

రవళి తనముందునుంచి కదిలి అల్మారాలోవున్న కొన్నిపత్రికల్ని తెచ్చి, ఆయనముందు పెట్టింది.

''ఇది నా మొదటి కథ తాతయ్యా'' పత్రిక తెరిచి చూపించింది రాఘవేంద్ర రావుకు.

అది ఆయన పూర్తిగా చూసేలోపున




ఇంకా కొన్ని పత్రికలుతెచ్చి, తాను రాసిన కథల్ని ఆయన ముందు ఉంచింది.

ఆయన కథ పేరు కూడా పట్టించుకోకుండా అచ్చులోవున్న రవళి పేరునే ఆప్యాయంగా, తృప్తిగా చూసుకుంటున్నాడు.

''గుడ్! నాతో ఒక్కమాటైనా చెప్పకుండా చాలా కృషిచేశావు'' మనస్ఫూర్తిగా అభినందించాడు రాఘవేంద్రరావు.

''అంచేత, నేనిక్కడే వుండటం అవసరం తాతయ్యా!" అంది రవళి.

"అలాగేనమ్మా! నీ ఇష్టం. కాని ఎప్పుడూ ఒకేచోట వుండటంకూడా రచయితకు అంత మంచిదికాదు. కొంత కాలం రాసేసరికి నీకు తెల్సిన సంఘటనలు నువ్వు చూసిన సంఘటనలు అయిపోతాయి. అందుచేత రచయిత బాగాతిరగాలి· వివిధ ప్రాంతాల్లోని వింతల్ని, విశేషాల్ని తెల్సుకోవాలి.నేను తాజ్‌మహల్ చూడటం వేరు. ఒక వాస్తుశిల్పి తాజ్‌మహల్‌ను చూడటంవేరు. అలాగే నువ్వు చూసే ప్రతి విషయాన్ని రచయిత దృష్టితో చూస్తావు. అందుచేత నువ్వు ఎక్కడకు వెళ్లాలనివుంటే అక్కడికి వెళ్లమ్మా ఆడపిల్లను ఒంటరిగా ఎలా ప్రయాణం చేయను అన్నఆలోచనేవొద్దు. వెంట మన వంట మనిషిని తీసుకెళ్లు. మరోమాట. జీవితం నగరాల్లోనూ, పట్టణాల్లోనూ వుందని అనుకోకు. నగరంలోవుండేది నాగరికత. గ్రామాల్లోవుండేది సంస్కృతీ, నిరాడంబర జీవితం. దేశంలో నూటికి డెభ్భైమందిదాకా గ్రామాల్లో వుండే ప్రజలే. అందుచేత రచయితకు పల్లెటూరు కూడా ఎంతోఅవసరం. కాబట్టి మన వూరు కూడా వస్తూవుండాలి" మనవరాలికి సలహా ఇచ్చాడు రాఘవేంద్రరావు.

తాతయ్య మద్రాసులో బి.ఎ. దాకా చదువుకున్నాడని రవళికి తెలుసు. ఆయన ఎక్కువగా ఇంగ్లీషు పత్రికలు, ఇంగ్లీషు నవలలు చదవడం చూసి ఉంది. కాని ఒక రచయితకు ఇంత చక్కటి సలహా తాతయ్య ఇవ్వగలడని రవళి వూహించలేదు.

"అలాగే తాతయ్యా! నువ్వు చెప్పినట్లే చేస్తాను" అంది రవళి.

"మన ఇంట్లో కూడా మంచి లైబ్రరీ వుందికదమ్మా! అందులోంచి నీకు కావాల్సిన పుస్తకాలు ఇక్కడికి తెచ్చుకోవచ్చు. లేదా నువ్వు పెద్దపల్లి వచ్చినప్పుడు వినియోగించుకోవచ్చు. లైబ్రరీని ఎప్పుడూ కంటికి రెప్పలా చూసుకోవాలమ్మా! ఒక పెద్ద చెట్టును, ఒక మంచి లైబ్రరీని మనం అనుకున్నంత త్వరగా పెంచలేం" అన్నాడు రాఘవేంద్రరావు.

తాతయ్య చెప్పే మాటల్ని చాలా శ్రద్ధగా వింటోంది రవళి. గతంలో ఎప్పుడూ తాతయ్య ఇలాంటి విషయాలు తనతో మాట్లాడలేదు. తాను రచయిత్రిని అయ్యానని తెలిశాకే ఈ విషయాలన్నీ మాట్లాడుతున్నాడు· అంటే ఇన్నాళ్ళకు మనవరాలుగా మాత్రమే కాకుండా ఒక వ్యక్తిగా తనని గుర్తిస్తున్నాడు అనుకొంది రవళి.

ఒకటి రెండు రోజులుండి రాఘవేంద్రరావు వెళ్ళిపోయాడు. మొదలుపెట్టిన నవల రవళి ఒక నెల రోజుల్లో పూర్తి చేసింది. నవల కథావస్తువు యదార్థ జీవితమే. విని, చూసి, తెల్సినవాళ్ల చరిత్రలు కలగలిపి రాసిన నవల అది.

పూర్ణిమ నవల చదివి బావుంది అన్నాడు.

"రచయితలు తమకు తెలిసిన

విషయాల గురించి రాసినా, తెలియని విషయాలను సవివరంగా తెల్సుకొని రాసినా నవలలు బావుంటాయి" అన్నాడు పూర్ణిమ.

త్వరలోనే ఆ నవల ఓ వారపత్రికలో సీరియల్‌గా వచ్చింది. పాఠకుల ఆదరణ పొందింది. రవళికి గుర్తింపు వొచ్చింది.

అలా గుర్తింపు వచ్చేకొద్దీ ఆమె బాధ్యత పెరుగుతోంది. తాను రాసింది పాఠకులు ఆదరించేలా వుండాలని, రవి రచనల్లా చవుకబారుగా ఉండకూడదనీ, కేవలం ఆసక్తిగా చదివిస్తే చాలదనీ తగిన జాగ్రత్తలు వస్తువు ఎన్నుకోవడంలోనే చూపుతోంది. రచనా విధానంలో ప్రత్యేక శ్రద్ధతీసుకుంటోంది. ఆ రెండూ కలిస్తేనే రచనకు సార్థకం అని అర్థమయింది. రాయడంతోపాటు చదవడం కూడా కొనసాగిస్తూ ఒక్కొక్క మెట్టే సాహితీరంగంలో అధిరోహిస్తోంది. బాధ్యత తెల్సిన రచయిత్రిగా రవళి ఒక స్థానాన్ని సంపాదించుకుంది.

ఏ రచన ప్రారంభించినా ఇద్దరు వ్యక్తుల్ని ఆమె తల్చుకోకుండా ప్రారంభించదు. తనని రెచ్చగొట్టిన రవి, తనను తీర్చిదిద్దిన పూర్ణిమ. ఒకరంటే అసహ్యం, జాలి..మరొకరంటే అపారమైన గౌరవం, భక్తి.

★ ★ ★ ★

పది సంవత్సరాలు రవళి జీవితంలో ఎక్కువే. చాలా నవలలు, కథలు రాసింది పదేళ్ళలో. ఇపుడు ఆమె కథలు ప్రచురించని పత్రికలు దాదాపు లేవనే చెప్పవచ్చు. ఎన్ని రాసినా ఆమె రచనా స్థాయి తగ్గకపోవటం చాలామందికి ఆశ్చర్యంగానూ ఉంటోంది. నవలలకు వస్తువును ఎన్నుకోవడంలో వైవిధ్యాన్ని చూపించడంవలననే పాఠకులను ఆకట్టుకోగలిగింది రవళి.

అందుకే ఇంకా ఎటువంటి విషయాల మీద రవళి రచనలు సాగించబోతోందోనని పాఠకులు ఎదురుచూస్తారు. ఆమె సంబంధం జీవితంతోనేతప్ప ఎప్పుడూ నేలవిడిచి సాముచేయలేదు.

సమాజం గురించి నిశితంగా పరిశీలించి విరివిగా రచనలు సాగించింది. చెప్పదల్చుకున్న విషయాన్ని సూటిగా, బలంగా, ఆసక్తికరంగా చెప్పడం ఆమె పద్ధతి.




ఒక ఏడాది కాలేజీ వార్షికోత్సవానికి పూర్ణిమనూ, రవళినీ ఆహ్వానించారు. అది ఒకప్పుడు రవివెంట తను వెళ్ళిన కాలేజీయే. తాను పూర్ణిమ సరసనకూర్చునే స్థాయికి ఎదగగలిగినందుకు లోలోన సంతోషించింది రవళి. మరుక్షణంలోనే తానాస్థితికి రాగలగడానికి 'పూర్ణిమ' ముఖ్యకారణం అని మనస్సులోనే కృతజ్ఞతలు చెప్పుకొంది. ఆ సభలో ముందుగా పూర్ణిమ మాట్లాడాడు.

తర్వాత రవళి వంతువచ్చింది. నలుగురయిదుగురు రచయితలమధ్య కూర్చుని మాట్లాడటం, స్నేహితులతో మాట్లాడటమే తప్ప, వేదికనెక్కి మాట్లాడే అలవాటూ, అనుభవమూ రవళికి లేదు. అందుచేత

ఉపన్యాస ధోరణిలో కాకుండా సరదాగా స్నేహితులతో కల్సి మాట్లాడుకున్నట్లే మొదలుపెట్టింది ఉపన్యాసం.

విద్యార్థులకు ఆ పద్ధతి బాగా నచ్చింది. మధ్య మధ్య ఆమెకు తెలియకుండానే వాళ్ళను నవ్వించింది. ఆమె మాటాడిన దాంట్లో ముఖ్యమయిన విషయం రచనకు-ఆధారం చుట్టూ ఉన్న సామాజిక పరిస్థితులు, ప్రజాజీవితం, జీవిత సంఘర్షణలే అని. తనకు తెలిసినవి మాత్రమే రాస్తున్నది తాను. తెలియనివాటిని గురించి తెల్సుకొనేదాకా వాటి జోలికి పోదు. ఈ విషయం పెద్ద రచయితలు ఏనాడో చెప్పారు. "మీరు ఎప్పుడూ మధ్యతరగతి జీవితం గురించే కథలు రాస్తారేం?" అని ఎవరో అడిగితే, "వారి గురించే నాకు బాగా తెల్సు గనుక" అని ముక్తసరిగా సమాధానం చెప్పారొకరు. ఆ మార్గాన్నే తానూ ఎన్నుకొంది అని చెప్పింది.

ఆ తర్వాత విద్యార్థులు వేసే ప్రశ్నలకు చిరాకుపడకుండా సమాధానాలు చెప్పింది. సాహిత్యపరమైన ప్రశ్నలే కాకుండా కొందరు కొంటెవాళ్లు వ్యక్తిగతమయిన ప్రశ్నలు కూడా వేశారు.

"మీకు ముప్ఫైయేళ్లుదాటినాఇంకా పెళ్ళి చేసుకోలేదే?" ఎవరో పంపిన ప్రశ్నను ఆమె చదివి, "ఇదే ప్రశ్న ముప్ఫైయేళ్ళు దాటిన మగవార్ని ఎందుకు అడగరూ?" అని ప్రశ్నించింది. "కొన్ని ప్రశ్నలకు ప్రశ్నలే జవాబులు'' అంది నవ్వుతూ.

"మీ నవలల మీద 'రవళి' అని మాత్రమే ఉంటుంది. మీరు శ్రీమతా, కుమారా?" మరో ప్రశ్న.

"ఈ ప్రశ్న మీరు నన్నడిగారుగానీ, పూర్ణిమగార్ని అడిగివుంటే ఏం సమాధానం చెప్పివుండేవారో" అంది.

అందరూ నవ్వుకున్నారు.

సభ ఆనందంగా ముగిసింది.

ఆ సభలో రవళి చూపిన నేర్పుచూసి ఆ తర్వాత ఇతర కాలేజీలు రవళిని ఉపన్యాసకురాలుగా ఆహ్వానించడం మొదలెట్టాయి. రచయిత్రిగానే కాకుండా వక్తగాకూడామంచిపేరుతెచ్చుకుంది రవళి.

ఓసారి పెద్దపల్లికి రమ్మని తాతగారి నుంచి ఉత్తరంవచ్చిందిరవళికి.ఎందుకోనని ఆ సాయంత్రమే రవళి బయలుదేరింది.

ఊరు చేరుకొనేసరికి కాస్త పొద్దు పోయింది.

కాంపౌండులోకి కారువచ్చిన ధ్వనివిని మేడమీద గదిలోంచి, బయటకు చూశారు తాతగారు. రవళే అయివుంటుందను కున్నారు ఆయన.

పోర్టికోలో కారు ఆగింది.

నౌకరు వచ్చి కారు డోర్ తెరిచాడు. ఆ నౌకరు రవళి చిన్నతనంనుంచీ అక్కడే ఉంటున్నాడు.

"బాగున్నావా కొండయ్యా ?" పలకరించింది అతన్ని.

"బాగున్నానమ్మా!" అంటూ ఆమె వెనుక నడిచాడు కొండయ్య.

"తాతగారెక్కడ?" రవళి హాలులోకి అడుగు పెడుతూ అడిగింది.

"ఓ గంటక్రితమే భోంచేసి మేడమీది కెళ్ళారమ్మా! ఇంకా పడుకోలేదు. చదువు కుంటున్నట్టున్నారు. లైటు వెలుగుతూనే వుంది" జవాబిచ్చాడు కొండయ్య.

రవళి మేడమెట్లు ఎక్కుతూ, "డ్రయివరుకు భోజనం పెట్టు. నాకు భోజనం కాసేపయ్యాక పైకి పంపించు" అని కొండయ్యకు చెప్పి, తాతయ్య గదివేపు వెళ్లింది.

చదువుతూన్న పుస్తకాన్ని మూసివేసి,

రవళి రాకకోసం ఎదురు చూస్తున్నాడు రాఘవేంద్రరావు.

"తాతయ్యా!" అంటూ విశాలమైన గదిలోకి అడుగుపెట్టిన రవళిని మంచం మీద కూర్చున్న రాఘవేంద్రరావు "రా అమ్మా!" అంటూ సాదరంగా ఆహ్వానించాడు.

రవళి ఆయన పక్కనే కూర్చుంది. ఆయన చేతిని తన చేతుల్లోకి తీసుకొని, "ఎందుకు తాతయ్యా! నన్ను అర్జంటుగా రమ్మని ఉత్తరం రాశావు" అంది రవళి.

రాఘవేంద్రరావు "నీకు గాక ఇంక ఎవరికి రాయమంటావమ్మా! నాకింకెవరున్నారు రాయడానికి?" అన్నాడు.

ఆ మాటలు విన్న రవళి మనస్సు క్షణంపాటు విలవిల్లాడింది.

"నేనింక నీదగ్గరే వుంటానుతాతయ్యా! ఎక్కడికీ వెళ్లను" అంది రవళి.

"పిచ్చి పిల్లా!" అంటూ తల నిమిరి, "నువ్వొకతెవే నాతో వుంటే ఎలా? ఈ ఆస్తిపాస్తులూ, ఇవన్నీ చూసుకుండుకు ఓ మగదిక్కు కూడా కావాలిగా" అన్నాడాయన.

"నువ్వున్నావుగా?"

"నేను పెద్దవాణ్ని అయిపోయానుగదమ్మా!"

"పోనీ గుమస్తాను పెట్టుకుందాం"

"జీతగాడు జీతగాడేనమ్మా! ఇదంతా తన సొంతమనుకొని చక్కదిద్దుతాడా?"

"ఆఁ... నీ ఉద్దేశం నాకర్థమైంది"

"ఏమర్థమైందో చెప్పు" కొంటెగా నవ్వుతూ అడిగాడు రాఘవేంద్రరావు మనవరాల్ని.

"నేనిప్పుడు అర్జంటుగా పెళ్లి చేసుకోవాలి..అంతేగా?" అంది రవళి.

"నువ్వు 'ఊఁ!' అంటే చాలు, నేను తగినవాణ్ని తీసుకొచ్చి చేసేస్తాను పెళ్లి"

"నువ్వు అనవసరంగా శ్రమపడకు తాతయ్యా!"

"నువ్వే శ్రమపడి ఎన్నుకొన్నావా ఎవర్నయినా?"

"నీ మనవరాలు ఎప్పుడూ అలా తొందరపడదు. నీకు చెప్పకుండా ఏదీ జరగదు. ప్రస్తుతానికి నా పెళ్లి సంగతి మర్చిపో"

"అమ్మమ్మవు అయిపోయాక చేసుకుంటావా పెళ్లి?" చిరు కోపంతో అన్నాడు రాఘవేంద్రరావు.

రవళి నవ్వి "పెళ్లికానిదే అమ్మనే కానుగదా! అమ్మమ్మను ఎలా అవుతాను?" తాతయ్యను ఉడికిస్తున్నట్టు అంది.

కాసేపు ఆ ప్రసక్తి వదిలేసి పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు ఇద్దరూ.

ఆ రాత్రి భోంచేసి పడుకుంది రవళి.

నిద్ర పట్టలేదు. తాతయ్య ఒంటరితనం గురించీ, ఆ ఇంటి గురించీ, ఇతర పరిస్థితుల గురించీ, తన గురించీ ఏవేవో ఆలోచనలు నిద్ర పోనివ్వలేదు ఆమెను. చాలా పొద్దుపోయాక నిద్ర పట్టింది రవళికి.

తెల్లవారి లేచేసరికి కిటికీలోంచి ఎండ పడుతోంది ఆమె గదిలోకి.

లేచి మొహం కడుక్కొని, స్నానం చేసింది. తాతయ్యతో కల్సి కాఫీ తాగొచ్చని, ఆయన గదిలోకి వెళ్లింది.

రాఘవేంద్రరావు మంచంమీద పడుకొని ఉన్నాడు. డాక్టరు పరీక్ష చేస్తున్నాడు.

"ఏమిటి....ఒంట్లో బావుండలేదా తాతయ్యా?" ఆత్రుతగా అడుగుతూ





తాతయ్య దగ్గరకు వెళ్ళింది.

"ఏం లేదమ్మా!" అన్నాడు రాఘవేంద్రరావు. డాక్టరు రవళికి తెల్సినమనిషే.

ఏమిటన్నట్టు చూసింది డాక్టరు వైపు.

"ఏం లేదమ్మా! పెద్దవారుగదా... బ్లడ్ ప్రెజర్ వుందేమోనని టెస్ట్ చేస్తున్నా" అన్నాడు డాక్టరు.

"వుందా?" రవళి అడిగింది.

"కొద్దిగా వుంది. 'వూరగాయల్లో ఉప్పు ఎక్కువ వుంటుంది. బి. పి. కి మంచిదికాదు. తినకండి' అంటే మానరు. ఆ బి.పి. కంట్రోల్ కాదు" అని ఫిర్యాదు చేసినట్టు అన్నాడు డాక్టరు.

తాతయ్య ఆరోగ్యం బావుండలేదని గ్రహించింది రవళి. వెంటనే "ఇంక వూరగాయలు వాడరులెండి మా తాతయ్య. నేనిక్కడే వుంటాగా! జాగ్రత్తగా చూస్తాను" అంది రవళి.

తన ఆరోగ్యం సంగతి ఎలాగున్నా రవళి తన కళ్ళముందే వుంటాననడంతో ఏనుగంత బలమొచ్చింది రాఘవేంద్రరావుకు.మనవరాలు తనకళ్ళముందేవుంటే, ఏదోఒకరకంగా ఒప్పించి,ఒక ఇంటిదాన్ని చేసేయొచ్చని ఆయన ఆలోచన. చిన్నప్పట్నుంచీ తనని ఎంతో గారాబంగా చూస్తూ, పెంచి పెద్దచేసిన తాతయ్యను కంటికి రెప్పలా చూసుకుని ఆరోగ్యం బాగుపడ్డేదాకా వుండి, వెళ్లాలని రవళి ఆలోచన.

మొత్తానికి రవళి పెద్దపల్లిలో వుండిపోయింది.

పదిహేను రోజులుకో, నెలకో ఒకరోజు హైదరాబాద్ వెళ్ళినా మర్నాటికి తిరిగి పెద్దపల్లికి వచ్చేస్తుందామె. వంటమనిషిని తనవెంట తీసుకు వచ్చేసింది. తాతయ్యకు మనవరాలిలాగే కాకుండా మంచి ఓర్పు, నేర్పుగల నర్సులా సేవలుచేస్తోంది.

తీరికవేళల్లో రోజూ ఏదో ఒక పుస్తకాన్ని తాతయ్యకు చదివి వినిపిస్తోంది. మధ్యమధ్య ఇదివరలో తనెన్నడూ చదవని కావ్యాల్ని కూడా తాతయ్యకు చదివి వినిపిస్తోంది. అలా ఒక ఏడాదిలో రవళి తాతయ్య కోసం ఎన్నో కావ్యాల్ని చదివింది. తాతయ్య చర్చల ఫలితంగా వాటి గురించి ఆలోచించడం మొదలెట్టి మళ్ళీమళ్ళీ చదివింది.

ఆ కావ్యాల్లోని కథా, ఇతివృత్తం, శిల్పం, శైలి, పాత్ర వైవిధ్యం,అన్నింటికీ మించి చెప్పదల్చుకున్న విషయం,పాఠకుని హృదయానికి హత్తుకొనేలా చెప్పడానికి కవి చేసిన ప్రయత్నం చూస్తే తాను ఆ మహామహులముందు అణుప్రాయమని అనిపించిందామెకు.

ఆ ఏడాదిలో తాతయ్య లైబ్రరీ అంతా చదివేసింది రవళి. అవి చదవక ముందు తను రాసినంత వేగంగానూ, ఎక్కువగానూ ఇప్పుడు రాయలేకపోతున్నానని అర్థమయింది. ఏదైనా ఒక మంచి పుస్తకం చదివితే తాతయ్యతో చర్చిస్తోంది. ఆయన అనుభవంతో చెప్పిన మాటలు అవగాహన చేసుకుందుకు ప్రయత్నిస్తోంది.

ఏం రాద్దామన్నా అది ఆమెకు రాయదగినంత విషయంగా అనిపించడంలేదు ఇప్పుడు. రోజులు చదవడంలోనూ, ఆలోచించడంలోనూ, తాతయ్యతో చర్చించడంలోనూ గడిచిపోతున్నాయి.

రాఘవేంద్రరావుగారికి రవళి తన కళ్ళముందే అలా ఉండటం ఎంతో ఆనందంగా వుంది. కాని ఆయన అంత



వయస్సు వచ్చినా ఇంకా పెళ్ళి తలంపు కలగకపోవడం గురించి ఆయన లోలోపల మథనపడేవాడు. ఆయన ఎప్పుడు రవళితో పెళ్ళి సంగతి ఎత్తినా దాటవేసేదేగాని సూటిగా ఆయన ప్రశ్నకు సమాధానం చెప్పేదికాదు.

ఆరోజు సాయంత్రపువేళ కూడా వెనుకవైపువున్న తోటలో రాఘవేంద్ర రావూ, రవళీ కేన్ కుర్చీల్లో కూర్చుని వున్నారు. రవళి భారతాన్ని తిరగేస్తూ చటుక్కున ఆగి, "తాతయ్యా! మీరు భారతం చదివేరా?" అంది.

"ఒకసారి కాదమ్మా...! చాలాసార్లు చదివాను. ఏమీ తోచకపోతే నేను చదివే కావ్యం భారతమే" అన్నాడాయన.

"శకుంతలోపాఖ్యానం చదివారు గదా?"

"ఆఁ!"

"శకుంతల గురించి మీ అభిప్రాయ మేమిటి?"

"అంటే...?"

"ఏంలేదు.శకుంతల తల్లి మేనకగదా?"

"అవును"

"మేనక అప్సరసల్లో ఒకతె. ఇంద్ర

సభలో నర్తకి. అవసరమైనప్పుడు ఈ అప్సరసల్ని ఇంద్రుడు మునుల తపస్సుల్ని, ఏకాగ్రతను భంగం చేయడానికి వినియోగించుకునేవాడని ప్రతీతి. విశ్వామిత్రుని తపస్సు భంగం చేయడానికి ఇంద్రునిచేత మేనక నియోగించబడిందిగదా"'

''రైటేనమ్మా...ఇంతకీ నీ సందేహమేమిటి?"

"ఏం లేదు తాతయ్యా! మేనక వేశ్యలాంటిదేగదా! ఒక రాజర్షికి, ఒక వేశ్యకి కలిగిన బిడ్డ శకుంతల. ఆమెను దుష్యంతుడంతటి మహారాజు కణ్వాశ్రమంలో తొలిచూపులో వరించి, గాంధర్వవివాహం చేసుకోవడం కథా ఇతివృత్తం. ఈనాడు సమాజంలో ఒక వేశ్యకు పుట్టిన బిడ్డను ఎవరైనా పెళ్ళిచేసుకుంటే జనం చెవులు కొరుక్కోకుండా వుంటారా?" అంది రవళి.

రాఘవేంద్రరావు ఒక్క క్షణం ఆలోచించి, "శకుంతల గురించి ఇంకా నువ్వు మాట్లాడవల్సింది ఏమైనా వుందా?" అన్నాడు.

"ఆ!... వుంది. ఆ శకుంతలకీ, దుష్యంతుడికీ పుట్టిన బిడ్డ భరతుడుకదా! మనదేశానికి భారతఖండమని పేరు రావడానికి కారణం ఆ భరతుడు పాలించడం చేతనేగదా! సమాజంలో భరతుడు పొందిన గౌరవం, ఉన్నతస్థానం ఈనాడు అదే జన్మ వృత్తాంతంగల వ్యక్తికైనా లభిస్తుందా?" అంది రవళి.

రాఘవేంద్రరావు తన మనమరాలు ఏం చెప్పదల్చుకుందో గ్రహించాడు.

"చూడమ్మా! ధర్మం కాలాన్నిబట్టి మారుతూ వుంటుంది. ఆ కాలంలో క్షేత్ర ప్రాధాన్యంకంటే బీజ ప్రాధాన్యం ఎక్కువ. అంటే ఏ స్థలంలో నువ్వు విత్తు నాటినా నాటిన విత్తనాన్నిబట్టే మొక్క వస్తుందిగానీ స్థలాన్నిబట్టి కాదు. ఆనాడు స్త్రీ క్షేత్రంగా పరిగణించబడింది. పురుషుడు బీజంగా పరిగణించబడ్డాడు. అందుచేత 'మేనక ఎవరు?' అన్న ప్రసక్తి అంత ముఖ్యం కాదు. శకుంతల విశ్వామిత్రుని సంతానం. పెరిగింది కణ్వాశ్రమంలో ఆరకంగా శకుంతల దుష్యంతుని భార్య కావడానికి అర్హతను సంతరించుకుంది. ఇది ఒక వాదన. ఈనాటి సమాజపరంగా ఇదే సంఘటనను అన్వయించుకొనిచెబితే, 'రాజు తల్చుకుంటే దెబ్బలకుకొదవా' అని మనకు సామెత వుందిగా! రాజే కావాలని ఒక వేశ్య కూతుర్ని తీసుకొచ్చి పెళ్ళి చేసుకొంటే కాదనేదెవరు? ఈనాడుకూడా డబ్బూ, పరువూ గల ఒక వ్యక్తి దుష్యంతుడిలాగే ఒక వేశ్య కూతుర్ని పెళ్లిచేసుకొంటే సమాజం అతన్ని ఏమీ చేయలేదుగదా!'' అన్నాడు రాఘవేంద్రరావు.

''కాని తాతయ్యా...డబ్బూ, హోదా కంటే కూడా సమాజాన్ని ఎదిరించడానికి ధైర్యం ముఖ్యమని నా ఉద్దేశం" అంది రవళి.

"నిజమేనమ్మా! ఒక మంచి కథ వుంది. నువ్వు విన్నావో లేదో! ఒక రాజుగారికోటను విరోధులు ముట్టడించారు. ఆయన సైన్యం కోటను కాపాడటం కోసం ప్రాణాలు ఒడ్డి పోరాడుతున్నారు. చేతికి తగిలిన గాయానికి కట్టు కట్టించుకొంటున్నాడు రాజు. ధనలక్ష్మి వచ్చింది. 'విరోధులు కోటను ముట్టడించారు. నే వెళ్లిపోతాను.' అంది. సరే పొమ్మన్నాడు రాజుగారు. ఆ వెనుక రాజ్యలక్ష్మి వచ్చింది. 'విరోధులు నన్ను




చేజిక్కించుకొనేలా వున్నారు. నేను పారిపోతాను'అందిట. సరే పొమ్మన్నాడు. అలా అష్టలక్ష్మల్లో ఏడుగురు లక్ష్మలు రాజు దగ్గర అనుమతి తీసుకొని ఆయన్ను వొదిలి వెళ్లి పోయారు.చివరకు ధైర్యలక్ష్మి వొచ్చింది. 'నేనూ వెళతాను' అంది. రాజుగారు కళ్ళు ఎర్రజేసి 'నువ్వున్నావనేగదా! వాళ్ళందర్నీ పొమ్మన్నాను. నువ్వుంటే వాళ్ళందరూ నావెనకే వుంటారనిగదా. నువ్వు వెళ్ళడానికి వీల్లేదు' అన్నాడు"

ఆ కథ విని రవళి నవ్వింది.

"ధైర్యం అంత గొప్పదమ్మా! ధైర్యవంతుడికి అన్ని శక్తులూ దాసోహం చేస్తాయి" అన్నాడు రాఘవేంద్రరావు.

అలా రోజూ మనమరాలితో మాట్లాడుతూ హాయిగా కాలక్షేపం చేస్తున్నాడాయన. తాను లేకపోతే రవళి ఏమైపోతుందోనన్న భయం మొదట్లో ఉన్నా రానురాను తగ్గింది. రవళి తనంతట తాను బతికగలదని నమ్మకం కుదిరిందాయనకు. పదేపదే పెళ్లి సంగతి ఎత్తి ఆమెను ఇబ్బందిపెట్టడం మానుకున్నాడాయన. కాకపోతే రవళి తన కూతురు బిడ్డ కావడంచేత వారసురాలిగా తన తర్వాత ఏ ఇబ్బందీ రవళికి కలగకుండా ఉండటానికి జాగ్రత్తలు తీసుకున్నాడాయన. ముఖ్యంగా వారసులమంటూ ఏ మారుమూలనుంచో వూడిపడే వాళ్ళ బెడదలేకుండా ఉండటం కోసం లాయరుతో సంప్రదించి వీలునామా రాయించి వుంచాడు. ఎప్పటికప్పుడే రవళితో ఈ విషయాలన్నీ చెప్పాలనుకున్నా జాప్యం చేస్తూ వచ్చాడు. ఇవన్నీ చెబితే రవళి కంగారుపడి కంట తడిపెడుతుందేమోనని ఆయన భయం.

రవళికి తాతగారి ఆస్తిపాస్తులుగురించి, వారి వారసులు గురించి ఏమీ తెలియదు. తనకు తెలిసిందల్లా తన చిన్నతనంలో తన అమ్మా, తాతయ్యా, ఇంట్లో నౌకర్లు మాత్రమే. తాతయ్య ఎవ్వర్నీ తనకు బంధువులని పరిచయం చేయలేదు. ఎవ్వరూ బంధువులుగా వచ్చినట్లు కూడా రవళికి గుర్తులేదు. ఎప్పుడైనా వస్తే తాతయ్య స్నేహితులు, డాక్టరుగారూ, లాయరుగారూ తప్ప ఎవ్వరూ హవేలీకి రావడం రవళికి గుర్తులేదు.

* * *

శుక్రవారం ఉదయాన్నే లేచి తలంటు పోసుకుంది రవళి. తల ఆరబెట్టుకొని, వొదులుగా జడ వేసుకుంది. అద్దం ముందు నిలబడి నుదుట బొట్టు పెట్టుకుంది. తాతయ్య గదికి బయల్దేరింది.

"తాతయ్యా!" అంటూ గదిలోకి అడుగుపెట్టింది రవళి.

రాఘవేంద్రరావు ఇంకా మంచంమీదే ఉన్నాడు.

"పొద్దెక్కినా ఇంకా పడుకొనే వున్నావేం తాతయ్యా!" అంటూ వెళ్లి ఆయన పక్కలో కూర్చుంది.

రాఘవేంద్రరావు కళ్ళు తెరిచాడు. కళ్ళముందు విరబూసినముద్దమందారంలా వున్న మనమరాలిని తృప్తిగా చూసుకున్నాడు.

"లేచి మొహం కడుక్కో తాతయ్యా! టిఫిన్‌చేద్దాం" అంది రవళి బతిమిలాడుతున్నట్టుగా.

"బద్ధకంగా వుందమ్మా!" అన్నాడే కాని ఆయన లేవలేదు.

ఆ రోజునుంచి రాఘవేంద్రరావు ఆరోగ్యం అంతంతమాత్రంగానే వుంది. ఉదయాన్నే రోజూ వచ్చి చూసే డాక్టరు

రోజూ రెండుసార్లు వచ్చి చూసి వెళుతున్నాడు.

ఓరోజు సడెన్‌గా రాఘవేంద్రరావుకి ఆయాసం ఎక్కువైంది. రవళికి కంగారుగా వుంది. డాక్టరు "పట్నం తీసుకెళితే మంచిదేమో!" అన్నాడు.

రాఘవేంద్రరావు పట్నం వెళ్ళడానికి అంగీకరించలేదు.

రవళి పూర్ణిమగార్ని వెంటనే రమ్మనమని పట్నానికి కారు పంపించింది. తాతయ్య దగ్గరే కదలకుండా కూర్చుంది రవళి. మధ్యలో కాస్త సుళువు అనిపించింది ఆయనకు. ఎక్కువ మాట్లాడకుండా మనమరాలి చేతికి దిండు కిందున్న కాగితాల కట్టను తీసి ఇచ్చాడు.

"అన్నీ అందులో వున్నాయ్. తెలియనిది ఏదైనావుంటే మన లాయర్ని అడుగు. బంధువు అని వచ్చినవాణ్ని నమ్మకు. మంచి స్నేహితుణ్ని దూరం చేసుకోకు" అన్నాడాయన.

రవళి కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

రాఘవేంద్రరావు ఏడవొద్దు అన్నాడు.

రవళి కళ్లు వొత్తుకుంది.

ఆ సాయంత్రానికి పూర్ణిమ, ఆయన భార్య వచ్చారు. ఆపదలో వచ్చిన వాళ్ళిద్దరూ కొండంత అండగా అనిపించారు రవళికి.

ఆ రాత్రి రాఘవేంద్రరావుకు ఆయాసం ఎక్కువైంది. డాక్టరు ఆక్సిజన్ యాపరేటస్ పెట్టించాడు. అయినా ప్రయోజనం లేకపోయింది. తెల్లవారు ఝామున ఆయన కన్ను మూశాడు.

యధావిధిగా జరగాల్సిన కర్మకాండంతా జరిపించింది రవళి. పన్నెండో రోజున దశదానాలూ చేయించి, పూరందరికీ భోజనాలు పెట్టించింది. అంతవరకు పూర్ణిమ, ఆయన భార్యా రవళితో పాటే ఉన్నారు.

ఆ మరునాడు పూర్ణిమ భార్య "ఒకసారి హైదరాబాద్ వచ్చి నాలుగు రోజులుండి మళ్ళీ రావొచ్చుగా. కాస్త మార్పుగా వుంటుంది" అంది రవళితో.

"అవును...అలాచేయండి" అన్నాడు పూర్ణిమ.

"ఇదివరకంటే తాతయ్య ఇక్కడ వుండేవాడు. అన్నీ ఆయన చూసుకునేవాడు. ఇప్పుడు అన్ని విషయాలూ నేనే చూసుకోవాలి. అన్నీ నాకు కొత్తే. ఓ దస్తా పేజుల కట్ట చేతుల్లో పెట్టారేగాని... ఏమీ చెప్పలేదు. ఇనుపపెట్టెలో డబ్బూ, నగలూ వున్నాయి. ఏమిటో...అంతా గందరగోళంగా వుంది" అంది రవళి కంట తడి పెట్టుకొని.

"అందుకే నాలుగురోజులు మాతో వుండివద్దురుగాని రండి. లాయరుతో మాట్లాడినట్టుగా కూడా వుంటుంది" అని పూర్ణిమ రవళిని ప్రయాణం చేశాడు.




హైదరాబాద్‌లో ఇండస్ట్రియల్ ఎగ్జిబిషన్ ప్రారంభమై పదిరోజులు కావస్తోంది. రవళి పెద్దపల్లినుంచి వచ్చి నాలుగైదురోజులైంది. ఏరోజుకారోజే ఎగ్జిబిషన్‌కి వెడదామనుకుంటూనే వెళ్ళలేకపోయింది. ఒకటి రెండుసార్లు పూర్ణిమగారు, ఆయన భార్య

ఎగ్జిబిషన్‌కి వెడదాం రమ్మని పిలిచినా బద్ధకించేసింది రవళి.

పండగరోజుల్లో బావుంటుందికదాఅని పెద్ద పండుగరోజు ఎగ్జిబిషన్‌కి బయలు దేరింది. ఎగ్జిబిషన్‌లో షాపులూ, షాపు ల్లోని వస్తువులూ చూడ్డంకంటె కూడా జనాన్ని చూడటం సరదా రవళికి. ఎక్కడెక్కడినుంచో వస్తారు జనం. ఎప్పుడూ బయటకి రానివాళ్ళు కూడా వస్తారు. ఎప్పుడోకలిసిమళ్ళీ కలవడానికి అవకాశం లేని మనుషులు అనుకోకుండా ఎగ్జిబిషన్‌లో అగుపిస్తూవుంటారు. పిల్లలు అవి కొనూ,ఇవికొనూ అని తల్లులకొంగు పట్టుకొని మారాంచేస్తూవుంటారు. ఇవన్నీ చూడ్డం సరదా రవళికి. తను చదువుకొనే రోజుల్లో తన స్నేహితురాళ్ళతో కలిసి ఎగ్జిబిషన్ నడచిన నెలా పది రోజుల్లోనూ కనీసం పదిసార్లైనా వెళ్ళేది ఎగ్జిబిషన్ చూడ్డానికి.

రవళి తెలిసినవాళ్ళు ఎవరేనా కనపడతారేమోనని జనాన్ని చూస్తూ నడుస్తోంది. రైలుబండిలో ఎక్కిన జనాన్ని కూడా పరిశీలనగా చూస్తోంది. మిరపకాయ బజ్జీల షాపుదగ్గర కాసేపు ఆగింది. తినాలని పించికాదు...అక్కడ జనం చేరతారుకదా అని ఆగింది.

ఎక్కడా ఎవరూ తెలిసినవారు కనిపించలేదు రవళికి. తిరిగితిరిగి అలసిపోయింది ఆమె. ఎదురుగా అగుపించిన కాఫీ హోటల్‌కి వెళ్ళి ఓ కప్పు కాఫీ తాగింది. చేతికి తగిలించివున్న వేనిటీబేగ్ తెరచి బిల్లు చెల్లించడానికి డబ్బు తీసింది. బిల్లు చెల్లించి మిగిలిన చిల్లరతీసుకొని బయటకు వచ్చింది. పరధ్యానంగావున్న రవళి చేతి నుంచి వేనిటీబేగ్‌ని ఎవరో కుర్రాడు గెద్దలా తన్నుకుపోయాడు.

"అయ్యో బేగ్...బేగ్!దొంగ...దొంగ బేగ్" అంటూ అరచింది రవళి.

ఎవరో ఫుల్ సూట్‌లోవున్న వ్యక్తి ఆ కుర్రాణ్ని వెంబడించాడు. పట్టుకొని బేగ్ లాక్కొన్నాడు. అతను ఆ కుర్రాణ్ని పోలీసులకి అప్పగించకుండా, నెత్తిమీద ఓదెబ్బ తగిలించి పొమ్మన్నాడు హుందాగా బేగ్ తీసుకొచ్చి రవళికిఇచ్చాడు అతను.

"థాంక్సండీ" అంది రవళి.

"నోమెన్షన్" అంటూ కోటు జేబు లోంచి రుమాలుతీసి ముఖంవత్తుకున్నాడు.

ఇంతలో అయిదేళ్ళ కుర్రాణ్ని వెంట బెట్టుకొని మంజూ వచ్చింది- రవళీ, ఆ పెద్దమనిషీ నిలబడినచోటుకి.

"హల్లో మంజూ...ఎప్పుడొచ్చావు?" అంటూ రవళి పలకరించింది.

"పండక్కొచ్చాను... బాగున్నావా?" మంజూ కుశలప్రశ్న వేసింది.

"బాగానే వున్నాను!"

"నీ బాబా?"

"అవును!"

''ఒక్కడేనా? ఇంకావున్నారా?''

''ప్రస్తుతానికి ఒక్కడే''

''మీవారు ఏం చేస్తున్నారు?''

''విశాఖ షిప్‌యార్డులో ఇంజనీరు''

''గుడ్... చాలారోజుల తరువాత కలిశావు. నాతో ఇంటికిరా" రవళి ఆహ్వానించింది.

చాలారోజులతరువాత స్నేహితురాలు కలిసిందన్న ఆనందంతో అక్కడే ఇంకా నిలబడివున్న ఆ పెద్దమనిషిని పట్టించుకోలేదు రవళి.

''నాతో అన్నయ్యకూడా వచ్చాడు'' అంటూ ఎదురుగా నిలబడిన పెద్దమనిషిని పరిచయంచేసింది మంజూ రవళికి.



"మీరు మీ అన్నయ్యా!సారీ. మిమ్మల్ని పట్టించుకోనేలేదు మా మంజూ కలసిందన్న ఆనందంలో. వీరే నా బేగ్ ఎవడో ఎత్తుకుపోతే, వాణ్ని పట్టుకొని తెచ్చి ఇచ్చారు'' రవళి జరిగిందంతా చెప్పింది.

"అంతా నేను చూస్తూనేవున్నానులే'' అంది మంజూ.

''మీ అన్నయ్య పేరే అడగలేదు చూశావా- అంది రవళి మంజూని చెప్ప మన్నట్టు.

"మా అన్నయ్య పేరు ప్రసాద్. ఎం.బి.ఎ. చేసాడు స్టేట్స్‌లో. ప్రస్తుతం సొంతంగా జీడిమెట్లలో ఓ ఇండస్ట్రీ పెట్టుకొని హాయిగా వున్నాడు." అని తన అన్నయ్యగురించి చెప్పి "ఈవిడ పేరురవళి నా కాలేజ్ మేట్" మంజూ రవళి గురించి ఇంకా చెప్పబోతూవుంటే ప్రసాద్ మధ్య లోనే అందుకొని "రవళి అంటే రచయిత్రి రవళిగారు కాదుకదా" అన్నాడు.

''కాకపోవడం ఏమిటీ? ఆ రచయిత్రి కుమారి రవళిగారే ఈ రవళి. నా స్నేహితురాలు'' అంది మంజు చాలా గర్వంగా.

రచయితగా కొత్తవాళ్ళెవరేనా గుర్తిస్తే ఎంత ఆనందించాలో అంతా ఆనందించింది రవళి. కాని బయటికి తన ఆనందాన్ని కనబడనీయలేదు.

రచయిత్రి రవళిని కలిసానన్న తృప్తి ప్రసాద్ కళ్ళలో చూసింది రవళి.

''మీకు అభ్యంతరం లేకపోతే మా ఇంటికి వెడదాం రండి. నేను మళ్ళీ మిమ్మల్ని మీ ఇంటి దగ్గర ఎప్పుడు కావాలంటే అప్పుడు డ్రాప్ చేస్తాను'' ప్రసాద్ ఆహ్వానించాడు రవళిని.

''అవునోయ్...ఇంటికివెళ్ళి మాత్రం ఏం? చేస్తావ్ పనిమనిషీ, నువ్వేగా. చాలా రోజుల తర్వాత కలిసాం... మా ఇంటికి వెడదాంరా. కాసేపుపిచ్చాపాటీ మాట్లాడుకోవచ్చు" అంటూ మంజూ కూడా బలవంతపెట్టింది రవళిని.

మంజూ చెయ్యి పట్టుకొని అంతా చూస్తూ నిలబడిన మంజూ కొడుకు "లా ఆంటీ... మా ఇంటికి" అంటూ రవళి చెయ్యి పట్టుకున్నాడు.

''మీవాడికి అసలు కొత్తలేదే" అంది రవళి.

"ఇంకో నిమిషంపోతే నిన్ను ఎత్తుకోమంటాడు'' అంది మంజూ.

''పేరేమిటి బాబూ నీది ?'' రవళి అడిగింది.

"మురలీ'' అన్నాడు.

"మురళీయా. అంది రవళి నవ్వుతూ"

"ఔను" అన్నాడు మురళి.

''పదండి... ఇక బయటికి పోదాం'' అంటూ నడిచాడు ప్రసాద్. వెంట రవళీ, మంజూ, మురళీ నడిచారు. ఎగ్జిబిషన్ నుంచి బయటకొచ్చి, ప్రసాద్ కారులో ఎక్కారు అంతా. ప్రసాదే స్వయంగా కారు డ్రైవ్ చేస్తూ చివరికి ఓ బంగళా పోర్టికోలో ఆపాడు.

"ఇదేనండీ.. మా ఇల్లు. దిగండి'' అంటూ డోర్ తెరిచాడు తను దిగి.

రవళి, వెంట మంజూ, మురళీ కారు దిగి లోపలికెళ్ళారు.

డ్రాయింగ్ రూమ్‌లోకి తీసుకెళ్ళి కూర్చోబెట్టింది రవళిని మంజూ.

"అమ్మ ఇంట్లోవున్నారా?'' అడిగింది రవళి.

"ఉన్నారు..అన్నట్టు మరచేపోయాను. అమ్మ నీకుతెలుసుకదా. రా...వంటింట్లోకి వెడదాం" అని రవళిని వంటింట్లోకి తీసుకెళ్ళింది.

వంట మనిషి వంట చేస్తోన్నా,

 

మంజుల అమ్మగారు యశోదమ్మ దగ్గ రుండి పురమాయిస్తోంది.

"రవళి వచ్చిందమ్మా" అంటూ రవళిని పరిచయం చేసింది మంజూ యశోదమ్మకి.

యశోదమ్మ కుశల ప్రశ్నలడిగింది రవళిని.

ఎంతో ఆప్యాయంగా రవళిని భోజనానికి వుండమని చెప్పింది యశోదమ్మ.

"భోజనం చేయకుండా ఎక్కడికి వెడుతుంది ... ఇన్నాళ్ళ తరవాత కలిశాక" మంజూ అంది.

"నీకేమిష్టమో చెప్పు ... చేయిస్తానమ్మాయి" అన్నారావిడ రవళితో.

"భలేవారే..నాకన్నీ ఇష్టమే! నాకోసం ప్రత్యేకంగా ఏమీ అక్కరలేదు" అంది రవళి.

ప్రసాద్ బట్టలు మార్చుకొని వాళ్లు వున్న చోటికి వచ్చాడు.

"ఇక్కడున్నారా? నేను డ్రాయింగు రూమ్‌లోకి వెళ్లాను మీకోసం" అన్నాడు అతను.

"రా రవళీ....హాల్లో కూర్చుందాం" అంటూ రవళిని తీసుకుని డ్రాయింగు రూమ్‌లోకి నడిచింది మంజూ.

"మీ ఇల్లు చాలాబాగుందోయ్" అంది రవళి మంజూతో.

"మా ఇల్లు అనకు. ఇది మా అన్నయ్య ఇల్లు. అంటే నా పుట్టిల్లు" అంది మంజూ నవ్వుతూ.

"మీ అన్నయ్యగారు మంచి టేస్ట్ గలవారిలా వున్నారు" అంది రవళి ఇల్లంతా పరికిస్తూ. గోడలకి చెక్క పెయింటింగ్స్, గది మూలల్లో ముక్కాలు బల్లలమీద మనీప్లేంట్స్, అల్మారాలో పుస్తకాలు, కింద మెత్తటి కాశ్మీర్ తివాసీ..చూడ్డానికి గదీ, మొత్తంఇల్లుకూడా ఎంతోఅందంగావుంది.

రవళి పుస్తకాల బీరువాలవైపు నడిచింది. ఓ బీరువానిండా ఇంగ్లీషు పుస్తకాలు పొయిట్రీ, నవలలు, డ్రామాలు వున్నాయి. మరో బీరువాలో బిజినెస్‌కి, ఎకనామిక్స్‌కీ, పొలిటిక్స్‌కి సంబంధించిన పుస్తకాలు వున్నాయి.

మరో బీరువానిండా తెలుగు పుస్తకాలూ, నిఘంటువులూ వున్నాయి. అదే బీరువాలో ఒక అరనిండా రవళి పుస్తకాలే అగుపించాయి.

"నా రచనలన్నీ నువ్వు కొని పెట్టావా ఈ బీరువాలో?" అంది రవళి మంజూతో.

"లేదమ్మా... అవన్నీ అన్నయ్య కలెక్షనే" అంది మంజు.

రవళికళ్ళు ప్రసాద్ కోసం వెతికాయి. సోఫాలో కూర్చుని వీక్లీ తిరగేస్తున్నాడు.

రవళి కూడా వచ్చి ప్రసాద్‌కి ఎదురుగా, మంజూ పక్కనే కూర్చుంది.

'నా రచనలన్నీ చదివారా?' అని అడగాలనుకుంది రవళి. కాని అలా అడగటం బాగోదనిపించి "మీరు మంచి పుస్తకాలు కలెక్ట్ చేశారు. గుడ్ లైబ్రరీ" అభినందించింది రవళి ప్రసాద్‌ను.

ప్రసాద్ నవ్వి వూరుకున్నాడు.

"నా నవలల్లో మీకు బాగా నచ్చింది ఏది?" అని అడిగి ప్రసాద్ సమాధానం చెప్పేలోపునే, "అసలు ఏదీ నచ్చలేదా?" అంది రవళి.

"మీరు నన్ను అవన్నీ చదివేనో లేదో పరీక్షిస్తున్నారా?" అన్నాడు నవ్వుతూ ప్రసాద్.

"అబ్బే..అదేంకాదు. నా రచనలన్నీ మీ దగ్గరుంటే అడగాలనిపించి అడిగాను" అంది రవళి.

"పుస్తకాలు అలంకరణగా కొంత

మంది ఇంట్లో పెట్టుకోవచ్చు. నేను మాత్రం చదవాలనిపించే పుస్తకమే కొంటాను. కొన్న పుస్తకం చదువుతాను. చదివిన పుస్తకాన్నే అలమారులో పెట్టుకుంటాను. డిక్షనరీ, నిఘంటువు, ఎన్సైక్లోపీడియా మినహా" అన్నాడు ప్రసాద్.

రవళి నవ్వింది.



"రిఫరెన్స్‌కోసం ఆ పుస్తకాలూ తిర గేస్తావుగా" అంది మంజు.

"అఫ్‌కోర్స్..ప్రతిపేజీ చదవంకదా" ప్రసాద్ అన్నాడు.

"నా ప్రశ్నకి సమాధానం చెప్పావు కాదు" రవళి అడిగింది ప్రసాద్‌ను.

"మీ నవలల్లో నాకు బాగా ఏది



నచ్చిందని మీరడిగావు కదూ" అంటూ ఒక్క క్షణం ఆలోచించి "ప్రతి నవల లోనూ ఓ ప్రత్యేకతవుంది. నవలకీ నవలకీ మధ్య విషయంలో వైవిధ్యంవుంది. అందుకని ఫలానా నవలే చాలా గొప్పగా వుంది అని కానీ, ఫలానా నవలే నాకు బాగా నచ్చిందనికానీ ఖచ్చితంగా చెప్ప లేకపోతున్నాను. ఒకవిధంగా చెప్పా లంటే నాకన్నీ బాగానే వున్నాయి. మనం

సావకాశంగా కూర్చుంటే ప్రతి నవల లోని పాత్రల గురించీ కూడా మీతో నేను చర్చించగలను?" అన్నాడు ప్రసాద్.

ప్రసాద్ బాగా చదువుకున్న వాడిలా అనిపించాడు రవళికి.

"అమ్మాయీ... భోజనాలకి లేవండి. కావాలంటే భోజనాలు అయ్యాక తీరిగ్గా మాట్లాడుకోవచ్చు" పిలిచింది యశోదమ్మ వంటింటి గుమ్మంలోంచి.

"అలాగేనమ్మా" అంటూ మంజూ వెంట రవళీ, ప్రసాద్ లేచారు. అప్పటికే డైనింగ్ టేబుల్ దగ్గరకు చేరాడు మంజు కొడుకు మురళి.

యశోదమ్మ కొసరి కొసరి వడ్డిస్తోంటే ప్రసాద్, మంజూ, రవళి ఆ మాటా ఈ మాటా మాట్లాడుకుంటూ భోజనాలు చేస్తు న్నారు. డైనింగ్ టేబిల్ దగ్గర చాలావరకు మంజుల, రవళే వాళ్ళ కాలేజీ లైఫ్ గురించి, క్లాస్‌మేట్స్ గురించి ఎక్కువ మాట్లాడుకున్నారు. ప్రసాద్ వాళ్ళ మాటల మధ్యకు చొరబడలేదు.

ప్రసాద్ ముప్పై అయిదేళ్ళవాడు. ఇంకా పెళ్ళి కాలేదు. బిజినెస్‌లో బాగా సంపాదించాడు. ఇంకా సంపాదించాలన్న కోరికకంటే జీవితాన్ని హాయిగా గడపా లని ఆశపడే మనిషి. కాలేజీ డేస్‌నుంచీ కూడా కల్చరల్ ఏక్టివిటీస్ అంటే ఇష్టపడేవాడు. ఇప్పటికీ ఆ అభిరుచి అలాగే వుంది. మూడేళ్ళపాటు అమెరికాలో వుండివచ్చినా అతనేం అంతగా మార లేదు. కవులన్నా, కళాకారులన్నా అభిమానం. ప్రసాద్‌కి, రవళి మంజుల కాలేజ్ మేట్ అని ముందు తెలీదు. ఆవిడ పుస్తకం ఏదో ఓసారి కొని చది వాడు..నచ్చింది. అప్పటినుంచీ మార్కెట్ లోకి రవళి పుస్తకం వస్తే కొనడం ప్రారంభించాడు. అలా ఆమె రాసిన ప్రతి పుస్తకాన్ని తెచ్చి క్షుణ్ణంగా చదివాడు.

భోజనాలు పూర్తయ్యాయి. మళ్ళీ అంతా డ్రాయింగురూమ్‌లోకి వచ్చారు. మురళి మంజూ వళ్ళో పడుకున్నాడు. ప్రసాద్ వక్కపొడి తెచ్చి రవళికి,మంజూకి ఇచ్చాడు. తానూ నోట్లో వేసుకున్నాడు. సోఫాలో కూర్చున్నాడు.

"నేటి తెలుగు సాహిత్యం మీద -- ముఖ్యంగా తెలుగు నవలా సాహిత్యం మీద నాకు కొన్ని అభిప్రాయాలు వున్నాయి. మీరు ఏదీ పెర్సనల్‌గా తీసుకోనంటే చెబుతాను'' అన్నాడు ప్రసాద్.

రవళికి అలా మాట్లాడేవాళ్ళంటే ఇష్టం. ముఖ్యంగా సాహిత్యం గురించి సహేతు కంగా విమర్శించే వ్యక్తులంటే ఆమెకు గౌరవం. సరైన విమర్శ తెలుగు సాహిత్యానికి తీరనిలోటని నమ్మే వాళ్ళలో రవళి మొదటిది. అందుకే "మీ ఇష్టం వచ్చినట్లు నిర్మొహమాటంగా మాట్లాడండి. విమర్శ రచయితకి టార్చిలైటు లాంటిది" అంది రవళి -- ప్రసాద్‌ను మాట్లాడమని ప్రోత్సహిస్తూ.

"నేటి నవలా సాహిత్యం ప్రమాణాలు అంతగా బాగోలేవు. ఎలా రాస్తే పాఠకులు మెచ్చుకుంటారు. పాఠకుల బలహీనతల మీద ఎలా ఆడుకోవచ్చు అనే ఆలోచనతో ఎక్కువ రచనలు వస్తున్నాయి ఈనాడు. పత్రికలు బాగా పెరిగాయి. ప్రచురించడా నికి మేటర్ కావాలి.వచ్చేమేటర్ పాఠకులని ఆకట్టుకొనేదిగా వుండాలి -- అది పత్రికా సంపాదకుల ఆరాటం.అందుచేత రచయిత ఎలా రాయాలి అన్నదీ, రచన ఎలా వుండాలీ అన్నదీ పత్రికలే నిర్ణయిస్తున్నా




యేమో అనిపిస్తుంది నాకు. ఇంక రచయితలు సొంతంగా ఆలోచించి, పరిశీలించి రాసే వ్యవధిలేక, ఇంగ్లీషు నవలల ఆధారంతో పేజీలునింపుతున్నారు. ఇదొకరకం పోటీ – రేట్ రేస్–గాతయారౌతోంది. 'ఇది ఒరిజినల్ నవల' అని ఖచ్చితంగా చెప్పడానికి ఒక్క నవల దొరకడం కష్టంగా వుంది. తెలుగు సినీమా లాగే తెలుగు నవల కూడా చౌకబారు కిక్ ఇవ్వడానికి తాపత్రయపడుతోందేమో అనిపిస్తుంది'' అని ఆగాడు ప్రసాద్.

"మిమ్మల్ని బోరుకొట్టడం లేదుకదా!"

''లేదు. ఇంటరెస్టింగా వుంది కూడా. మీరు చెప్పినవాటిల్లో చాలా నిజాలున్నాయి'' అంది రవళి.

మంజుకి తన అన్న చదువుతాడని తెలుసు. కాని ఇంత చక్కగా మాట్లాడ గలడని తెలీదు. అందుకని మంజూకూడా శ్రద్ధగా వింటోంది అన్నగారి మాటల్ని.

''బాధ్యతగల రచయిత పాఠకుల్ని వూహలలో విహరింపజేసేటట్లు రచనలు సాగించడం సమాజానికి శ్రేయస్సుకాదు. వాస్తవానికి దగ్గరగా వుండాలి. ఆలోచింప చేసేవిగా వుండాలి. ప్రబోధాత్మకంగా వుండాలి. ఈనాడు మన సాహిత్యాన్ని పోషించేది ఎక్కువమంది మధ్యతరగతి కుటుంబాల్లోని స్త్రీలు. ఏడు ఎనిమిది తరగతులు దాకా చదువుకున్నవాళ్ళు, విద్యార్థులూ ఎక్కువగానే చదువుతున్నారు. ఆఫీసుల్లో పనిచేసే స్త్రీలు కూడా బాగా చదువుతున్నారు. సరే... సినీమావాళ్ళు ఏదైనా పాయింటు దొరుకుతుందేమోనని చదువుతూ వుంటారనుకోండి. నేను ముఖ్యంగా–చెప్పేదేమిటంటే రచన మనిషిని నేలమీద నిలబెట్టి ఆలోచింపజేసేదిలా వుండాలి. వినోదంతో పాటు ఎడ్యుకేటివ్‌గా కూడా వుండటం అవసరం. ప్రేమ గొప్పదే. కాని, రాసేవాళ్ళకి ప్రేమకీ, సెక్స్‌కీ తేడా తెలియాలి. తెలిసి కూడా కొంతమంది సెక్స్ ఎలిమెంటుకి రీడర్స్‌ని ఆకర్షించడంకోసం, ప్రాధాన్యత ఇస్తున్నారు. ప్రేమ జీవితంలో ఓ భాగం. అంతేగాని జీవితమే ప్రేమ కాదుకదా! జీవితంలో ఎన్నో సమస్యలున్నాయి. వాటన్నిటి గురించీ రాయాలంటే జీవితాన్ని స్టడీ చెయ్యాలి.

"ఒకో ఇంగ్లీషు రచయిత ఓ నవల రాయాలంటే ఎంతో స్టడీ చేస్తాడు. కొన్ని నెలలపాటు ఆ విషయాన్ని పరిశీలిస్తాడు. ఆ స్థలానికి వెడతాడు. అక్కడి జనంతో మాట్లాడతాడు. విషయసేకరణచేస్తాడు. ఆ తర్వాత నవల రాస్తాడు. కాని మన రచయితలు చాలామంది అంత శ్రమ తీసుకోరు. ఉదాహరణకి–మీరు ఓసారి బొగ్గుగనులలో పనిచేసే కార్మికుల గురించి రాసారు. మీ ప్రయత్నం ప్రశంసనీయమైనదే. కాని నవల చదివితే ఏదో కొంత లోపం కనిపిస్తోంది'' అన్నాడు ప్రసాద్.

"నేను వారం రోజులపాటు అక్కడ వుండి, గనిలోకి వెళ్ళి, కార్మికులతో మాట్లాడి, ఆఫీసర్లతో మాట్లాడి, వాళ్ళ కుటుంబాలతో మాట్లాడి, ఆ తరువాత రాసాను'' అంది రవళి.

"నిజమేకావచ్చు.వాళ్ళమధ్య జీవించిన వ్యక్తి రాసినంత బలంగా ఒక్క వారం వాళ్ళని పరిశీలించి రాయలేం కదా. నేను చెప్పేది ఏమిటంటే - ఓ విషయం గురించి రచయిత రాస్తే ఇంక అది అథారిటీగా వుండాలి. రాస్తే అలాగే రాయాలి.అలా రాయగలిగే దాకా ఆగాలి" అన్నాడు ప్రసాద్ ఎంతో ఆవేశంగా.

అతని మాటల్లో తెలుగు సాహిత్యం

పట్ల అసంతృప్తి, బాధ కొట్టొచ్చినట్టు అగుపించాయి రవళికి.

"నేను ఎప్పుడేనా కలవాలనుకుంటే ఎక్కడ దొరుకుతారు మీరు?" అంది రవళి.

ప్రసాద్ విజిటింగ్ కార్డు ఇచ్చాడు.

తన పెద్దపల్లి అడ్రసూ, హైదరాబాదు అడ్రసూ, ఫోన్ నెంబర్లు గల విజిటింగ్ కార్డు తీసి అతనికి ఇచ్చింది రవళి.

"పొద్దుపోయింది.ఇక నేను వెడతాను" అంది రవళి.

"రండి...నేను డ్రాప్‌చేసి వస్తాను" అంటూ లేచాడు ప్రసాద్.

"మంజూ నువ్వూవస్తావా?వచ్చేటప్పుడు మీ అన్నయ్యగారికి జతగా వుంటావు" అంది రవళి– మంజూని తనతోబాటు రమ్మన్న ఉద్దేశం వ్యక్తంచేస్తూ. మంజూ కూడా మురళిని చంకనేసుకొని రవళి వెంట బయలుదేరింది.

* * *

"సాయంకాలం నువ్వు త్వరగా వస్తావా అన్నయ్యా?" అంది మంజు.

"ఏం?"

"ఏంలేదు. నువ్వు త్వరగా వస్తే ఓసారి రవళి వాళ్ల ఇంటికెళదామని?"

"ఎందుకు?"

"మళ్లీ నేను ఎల్లుండి వైజాగ్ వెళ్లి పోతున్నాను గదా!"

"సరే! సాయంత్రం అయిదు గంటల కొస్తే చాలా?"

"ఆఁ... చాలు. నువ్వు తప్పకుండా వస్తానంటే రవళి ఫోను చేస్తాను. ఫోన్ చేయకుండా వెళితే ఆమె ఇంటి దగ్గర లేకపోతే మనం వెళ్లడం వేస్టు గదా!" అంది మంజు.

"ఫోన్‌చేయ్. తప్పకుండా వెళ్దాం" అని ప్రసాద్ కారు స్టార్ట్ చేశాడు.

నాలుగు రోజుల క్రితం మొదటి సారిగా రవళిని కలిశాడు అతను. ఈవేళ మంజు సాయంత్రం రవళి వాళ్ల ఇంటికి వెళదామన్న తర్వాత తన ఆలోచనల్ని రవళి వైపు మళ్లించాడు... రవళి చాలా మందికంటే బాగానే రాస్తోంది. మనిషి కూడా చూడ్డానికి నాజూగ్గా, అందంగా వుంటుంది. మాట పొందిగ్గా, వినసొంపుగా వుంటుంది. పిచ్చి పిచ్చి ఫ్యాషన్లు అలంకరణలు లేకుండా చాలా సింపుల్‌గా వుంటుంది. ఒక్కరోజు మాట్లాడితేనే మనిషి మనస్తత్వం తెల్సుకోవడం కష్టమే గానీ, చూడ్డానికి సౌమ్యురాలే అనిపిస్తోంది... అలా ఆలోచించుకొంటూ కారు డ్రైవ్ చేస్తున్నాడు ప్రసాద్.

స్పీడ్ బ్రేకర్ అడ్డు రావడంతో కారు 'స్లో' చేశాడు. ఆలోచనలకు కూడా బ్రేక్ పడింది. రవళిని గురించి తాను ఇంతగా ఎందుకాలోచిస్తున్నాడో అనుకున్నాడు. తనకు తెలియకుండానే తనను ఆమె ఆకర్షించిందా అనిపించింది. ఏదియేమైనా సాయంకాలం రవళి ఇంటి కెళ్లినప్పుడు రవళిని గురించి ఇంకా తెల్సుకోవచ్చు అనుకున్నాడు. ఆమె కుమారి రవళి కాబట్టి ఇంకా పెళ్లి కాలేదని మాత్రం స్పష్టమవుతోంది. ఎందుకింకా పెళ్లి చేసుకోలేదో! ఆమెను అడగటం బావుండదు కాబట్టి, ఆమె వాళ్ల ఇంటికొచ్చి వెళ్లిన మర్నాడు మంజునుఅడిగి తెల్సుకోవాలనుకున్నాడు. నోటిదాకా వచ్చి ఇలాంటి, వివరాలు అడిగితే మంజు ఆటపట్టిస్తుందేమోనని ఆ ప్రయత్నంనుంచి విరమించుకున్నాడు. ఇంకా ఒకటి రెండు సార్లు ఆమెను కల్సిన తర్వాత ఆమెను గురించి పూర్తి వివరాలు తెల్సుకోవచ్చులే అనుకున్నాడు.




ఏదియేమైనా మంజు ఉండగా రవళిని గురించి ఎక్కువ మాట్లాడకూడదని నిర్ణయించుకున్నాడు.

కారు ఫ్యాక్టరీ చేరుకుంది.

ఆరోజు ఏపనిమీదా అతను మనస్సును కేంద్రీకరించలేకపోయాడు. ముఖ్యమైన పనుల్ని చూసుకున్నాడు. నాలుగు గంటలకే ఇంటికి బయలు దేరాడు. ఇల్లు చేరుకొనేసరికి మంజు, మురళీ తయారై వున్నారు.

అయిదు నిముషాల్లో ప్రసాద్ కూడా తయారయ్యాడు.

ముగ్గురూ కల్సి రవళి ఇంటికి బయల్దేరారు కారులో.

"ఆమెకు ఫోన్ చేశావా?" అన్నాడు ప్రసాద్.

"ఆఁ... ఇంటిదగ్గరే వుంటానంది"

"నేనుకూడా వస్తున్నానని చెప్పావా?"

"నువ్వు వస్తున్నావని చెప్పలేదుగానీ, 'సాయంత్రం మేం మీ ఇంటి కొస్తున్నాం' అని చెప్పాను. ఆ మాటమీద రవళే అడిగింది"

"ఏమనీ?"

"'నువ్వూ నీ కొడుకేనా, మీ అన్నయ్య కూడా వస్తున్నారా' అని" అంది మంజు.

తను వస్తున్నాడో లేదో రవళి కనుక్కున్నందుకు మనస్సులోనే తృప్తి పడ్డాడు ప్రసాద్.

రవళి ఇంటిముందు కారు ఆగింది.

రవళి ఉంటూన్న ఇల్లు రోడ్డుపక్కనే ఉండటంతో కారు ఆగిన శబ్దం వినగానే రవళి తలుపు తెర్చుకొని, కారు దిగుతూన్న మంజూను, ప్రసాద్‌ను "రండి" అంటూ సాదరంగా ఆహ్వానించింది.

ఎదురు వెళ్ళి మురళిని ఎత్తుకొని తీసుకొచ్చింది ఇంట్లోకి.

ఇల్లంతా కలయజూశాడు ప్రసాద్. రవళి లాగే ఇల్లు కూడా చాలా నిరాడంబరంగా ఉంది. అవసరానికి మించిన వస్తువులేమీ కనిపించలేదు. షెల్ఫులో కొన్ని పుస్తకాలు తప్ప ఒక పేరు మోసిన రచయిత్రి దగ్గర వుండాల్సినన్ని పుస్తకాలు ప్రసాద్‌కు కనిపించలేదు.

"నిలబడే వున్నారేమిటి? కూర్చోండి" అంది రవళి ప్రసాద్‌తో.

ప్రసాద్ కుర్చీలో కూర్చున్నాడు.

పనిమనిషి ట్రేలో కాఫీ తెచ్చింది.

రవళి కాఫీ కప్పులు తీసుకొని ప్రసాద్‌కు, మంజూకు అందించింది.

"బాబుకు పాలు తీసుకురా!" పని మనిషిని పురమాయించింది రవళి, మురళి కోసం.

"ఇంట్లో మీరూ, పనిమనిషేనావుండేది?" అడిగాడు ప్రసాద్ రవళిని.

"అవునండీ"

"ఇంక పెద్దవాళ్ళెవరూ..."

"లేరు... మొన్నటిదాకా తాతగారు ఉండేవారు. ఆయనా పోయారు. నాకు 'నా' అనేవాళ్ళు ఎవ్వరూ లేరు ఇప్పుడు" అంది రవళి.

ఆమె అలా అంటే ఆమె ఒంటరి తనాన్ని చూసి ప్రసాద్‌కు జాలేసింది.

"మీరు పెద్దగా లైబ్రరీ కూడా డెవలప్‌చేయలేదే!" ప్రసాద్ సంభాషణను పొడిగించాడు.

"అది మా ఊళ్ళో ఉందండీ! ఇది నేను స్టూడెంట్ లైఫ్‌నుంచి వుంటూన్న ఇల్లు. మా అసలు ఇల్లు పెద్దపల్లిలో వుంది. లైబ్రరీ అంతా అక్కడుంది. ఇక్కడకు తోచనప్పుడు వచ్చిపోతూ వుంటాను" అని సమాధానం చెప్పింది రవళి.

మంజూ అందుకుంది...

"పెద్దపల్లిలో వీళ్ళది పెద్ద హవేలీ అన్నయ్యా! వీళ్ళ తాతగారు చాలా దర్జాగా వుండేవారు. మేం చదువుకొనేటప్పుడు చూశాం"

"అదేం లేదులెండి. పురాతనకాలంనాటి పెద్ద లోగిలి. బాగా పాతపడిపోయింది కూడా" అంది రవళి.

'అదా సంగతి! హవేలీలో పెరిగిన అమ్మాయి కనుకనే ఇంత హుందాగా ఉందన్నమాట' అనుకున్నాడు ప్రసాద్.

ఆ రాత్రి భోజనాలు కూడా అక్కడే ఏర్పాటుచేసింది రవళి.

భోజనాలు దగ్గర ముగ్గురూ కూర్చుని ఎవరికి కావల్సినవి వాచు వడ్డించుకు తింటున్నారు. పనిమనిషి ఏమైనా కావల్సి వస్తే అందివ్వడానికి డైనింగ్ టేబుల్‌కు కాస్త ఎడంగా నిలబడి వుంది.

మురళిని రవళి తనకి,మంజూకు మధ్య కూర్చోబెట్టుకుని కావాలన్నవి కలిపి పెడుతోంది.

"పిల్లలంటే ఇంత సర్దావున్నప్పుడు త్వరగా పెళ్ళి చేసుకోకూడదూ!" అంది మంజు.

ప్రసాద్ రవళి సమాధానం కోసం ఆమె మొహంలోకి చూశాడు.

"పెళ్ళి పిల్లల కోసమే అంటావా?" అంది రవళి.

"అనను...కాని పెళ్ళికానిదే పిల్లలు పుట్టరు గదా!"

"పుట్టకపోవచ్చు. పెళ్ళి చేసుకోవడం పిల్లల్ని కనడంకంటే, పిల్లలే కావాలనుకొంటే ఎవర్నయినా పెంచుకోవచ్చుగా"

ఆ సమాధానం ప్రసాద్‌కు నచ్చలేదు.

"పెంచినవాళ్ళు కన్నవాళ్ళు అవుతారంటారా?" అన్నాడు ప్రసాద్.

"అలా అనకండి... ఒక్కొక్కసారి కడుపున పుట్టినవాళ్ళకంటే పెంచినవాళ్ళే బావుంటారు. కష్టంలో ఆదుకుంటారు" అంది రవళి.

"నిజమే అనుకో. పిల్లలు పుట్టనప్పుడు పెంచుకోవడం సహజమే అనుకో. కాని స్త్రీ తల్లి కావడంలో వున్న అనుభూతి, ఆనందం అది అనుభవించినవాళ్ళకుగానీ తెలియదు రవళీ. మనం కనిపించకపోతే ఏడ్చే పిల్లాడు, చేరదీసి బుజ్జగిస్తే మెడ చుట్టూ చేతులు చుట్టేసి హృదయానికి హత్తుకుపోయే పసివాడు.. నిజంగా అదో థ్రిల్. నేను నీకు విడమర్చి చెప్పలేను. నేను నీలా రచయిత్రిని కానుగా" అంది మంజు ఆవేశపూరితమయిన మాతృమూర్తిలా.

రవళి మంజూ ఆవేశాన్ని అర్థంచేసుకుంది. నిజమే అనిపించింది ఆమెకు.

"రవళికి వెనుక పెద్దవాళ్ళెవరూ లేరు అన్నయ్యా! ఉన్న ఒక్క ముసలాయనా పోయారు. ఇంట్లో అమ్మో, అమ్మమ్మో ఉంటే పోరి ఈపాటికి ఏదో సంబంధం చూసి రవళి మెళ్ళో కూడా మూడుముళ్లు వేయించి వుండేవారు. పాపం తనింటికి తానే పెద్ద, తానే చిన్న. అందుకని ముప్ఫయిదాటినా ఇంకా రవళి కుమారిగానే వుండిపోయింది" అంది మంజు సానుభూతిని వ్యక్తంచేస్తూ.

"ఇంకో వారంరోజులు నువ్వు విశాఖపట్నం వెళ్ళకుండా హైదరాబాద్‌లోనే వుంటే సంబంధంచూసి నాకు పెళ్ళిచేసి మరీ వెళ్ళేలా వున్నావు. సరేగానీ, ఆ టాపిక్ మానేసి, భోంచేయి" అంది రవళి.

"మీకు పెళ్ళంటే ఇష్టంలేదా? లేక మీకు నచ్చిన సంబంధం ఇంకా దొరకలేదా?" అన్నాడు ప్రసాద్.

రవళి సమాధానం చెప్పకుండానే




సూటిగా అతని కళ్ళల్లోకి చూసింది.

"నా ఉద్దేశం మీకు పెళ్లిచేసుకొనే ఆలోచన వుంటే..."

"ఏదో ఒక సంబంధం చూసి పెడతా నంటారు... థాంక్యూ. అవసరమైనప్పుడు తప్పకుండా మీకే చెబుతాను" అంది రవళి ఇంకా ఆ విషయాన్ని పొడిగించవద్దన్న ధోరణిలో.

ఆ మర్నాడు మంజూ విశాఖపట్నం వెళ్లిపోయింది.

ప్రసాద్ ఫాక్టరీలో వుండగా రవళి ఫోన్‌చేసింది.

ప్రసాద్ రిసీవర్ ఎత్తాడు.

"ఎవరండీ?" అడిగాడు.

"నేను.. రవళిని మాట్లాడుతున్నాను!"

"ఓ.. మీరా? చెప్పండి. వాట్ కెన్ ఆయ్ డూ ఫర్ యు?"

"పెళ్లి సంబంధం చూడక్కరలేదు. సాయంత్రం వీలయితే మా ఇంటికి రండి. మీతో ఓ ముఖ్యమైన సబ్జెక్టు డిస్కస్ చేయాలి. భోజనం మా ఇంట్లోనే"

"ఓకే... తప్పకుండా వస్తా. ఆరోజు చనువు తీసుకుని మీ పెళ్లిగురించి మాట్లాడాను. మిమ్మల్ని నొప్పిస్తే క్షమించండి"

"నోనో. తప్పేముంది? ఆత్మీయులుగా మాట్లాడారు తప్ప, ఎత్తిపొడుపుగా మాటాడలేదే. సరదాగా జోక్‌చేశాను. అంతే! మీకోసం ఎదురుచూస్తూ వుంటా"

"ఆరు గంటలకల్లా మీ ఇంటి దగ్గరుంటా"

* * *

ప్రసాద్, రవళి ఎదురెదురుగా కూర్చున్నారు. తనకెదురయిన పరిస్థితుల్ని ఎదుర్కోలేక ఆత్మహత్య చేసుకున్న ఒక అమ్మాయి నిజమయిన కథను ప్రసాద్‌కు వినిపించింది రవళి. అలా వినిపించడానికి కారణం ప్రసాద్‌పట్ల తనకు ఏర్పడిన సద్భావమే. అతను మంచి విమర్శకుడని ఆమె నమ్మకం.

"చూడండి రవళిగారూ! చావు సమస్యలకు ముగింపేగాని పరిష్కారం కాదు. సరిగ్గా చెప్పాలంటే ఆత్మహత్య సమస్యల నుంచి పారిపోవడం. రచయిత్రిగా మీరు ఆలోచించి ఆ అమ్మాయి ఎదుర్కొన్న సమస్యలకు తెలివిగా సరయిన పరిష్కారాన్ని సూచించాలి. అలా చేయగలిగితే మరో అమ్మాయికి అటువంటి సమస్యలే ఎదురయినప్పుడు మీ రచన శ్రీరామరక్ష అవుతుంది. ఆత్మహత్యకు పాల్పడనీయకుండా చేస్తుంది. మంచి రచయితా, మంచి రచనా లోకకల్యాణానికి తోడ్పడాలి. ఇవన్నీ ఎందుకు? మీతో నేనింకా చాలా చర్చించాలనుకుంటున్నాను" అన్నాడు ఆవేశంగా ప్రసాద్.

"నేను మీకు ఫోన్‌చేసింది కూడా అందుకోసమే" అంది రవళి.

"సరే....అయితే ముందు మీరే మాట్లాడండి"

"నాకెందుకో ప్రయోజనకరమయిన రచనలే చేయాలి అనిపిస్తోంది. ఇంతవరకూ చేసిన రచనల్ని పత్రికలు ప్రచురించవచ్చు...పాఠకులు మెచ్చుకోవచ్చు. కాని ఒక రచన ఎంత గొప్పదో నిర్ణయించాల్సింది కాలం. రచయిత మరణించినా బతికివుండే రచన గొప్పది. మంచి రచన మరణించిన రచయితను బతికిస్తుంది. అలాంటి రచన నా రచనల్లో వుందా? ఏమో...నాకే అనుమానం. ఎవ్వరూ చెప్పని విషయాన్ని చెప్పినట్టు అనిపించటంలేదు. ఏదో కొత్తగా చెప్పాలని, వాస్తవాన్ని చెప్పాలని తపన" రవళి ఆగింది.

"నైస్! రచయిత ఎదగటానికి ఇటువంటి ఆలోచన రావడమే ప్రారంభం. మీ శక్తిసామర్థ్యాల్ని, మీ నేర్పరితనాన్ని కూడగట్టుకొని, బాగా విషయ పరిశీలన చేసి క్రోడీకరించి ఒక మంచి పుస్తకాన్ని రాయండి. పదికాలాలపాటు నిలుస్తుంది! మీకింకా మంచి పేరు వస్తుంది. మీరు ఎంత ఎత్తు ఎదిగితే అంత సంతోషించే మనిషిని నేను. మీరు దిగజారిపోతోంటే హెచ్చరించడానికి జంకని వాణ్ని" అన్నాడు ప్రసాద్.

'అలా ఎంతకాలం నా గురించి మీరు



పట్టించుకుంటారు?' అని అడగాలనుకుంది రవళి. కాని మనస్సు ఒప్పలేదు.

"అందుకే నేనో పనిచేయదల్చాను"

"ఏమిటది?" ప్రసాద్ అడిగాడు.

"ఒకసారి ఆటవీ ప్రాంతాలకు వెళదామని వుంది"

"వెళ్లి ఏం చేస్తారు ?"

"వారి ఉద్యమాలు అక్కడినుంచే ఎందుకు ప్రారంభమయాయో తెల్సుకోవాలని ఉంది"

"అంతమాత్రం చేత నవల అవుతుందా?"

''ఆ ఉద్యమంలో ముఖ్యుల్ని కలుసుకుంటాం గదా''

''ఆ తర్వాత''

"ఏం చేయాలో మీరే చెప్పండి"

"సామాజిక లక్ష్యంగల ఉద్యమానికీ, స్వార్థమే లక్ష్యంగా గల ఉద్యమానికీ గల తేడాను విపులంగా చెప్పగలగాలి. మంచి రచయితకు ఆలోచనలో స్పష్టత చాలా ముఖ్యం'' వింటోంది రవళి.

ప్రసాద్ మళ్ళీ మొదలెట్టాడు...

"అదిలాబాద్ జిల్లాలో గోండ్స్ వున్నారు. ఆమధ్య అడవుల్లోంచి వాళ్లు వూళ్ళోకొచ్చారు ఓ పండగ సందర్భంగా. అడవుల్లో వున్నప్పుడు క్రూరమృగాల నుంచి తమ్ముతాము రక్షించుకొనేందుకు సాయుధులై జాగ్రత్తగానే వుంటారు. వూళ్ళోకి జనం మధ్యకు వస్తున్నాం గదా అని నిరాయుధులై వచ్చారేమో. గొడవ ఏదైనా కావచ్చు. ఆ గోండ్స్‌ను నాగరికులే కాల్చి చంపారు. పేపర్లో చూసేవుంటారు. వాళ్ళకు నాగరీకులంటే అసహ్యం పుడితే అందుకు బాధ్యులెవరు?"

"ఆలోచించాల్సిందే. చనువు తీసుకొని అడుగుతున్నందుకు ఏమనుకోకండి. నా కోసం అక్కడికోసారి నాతో రావడానికి మీకేం అభ్యంతరం లేదుగా" అడిగింది రవళి.

''నేను సిద్ధమే. వాళ్ళను చూడాలని చాలా ఉంది నాకు'' అన్నాడు ప్రసాద్.

''థాంక్యూ'' అంది రవళి.

అనుకొన్న ప్రకారం రెండు వారాల తర్వాత ఇద్దరూ ప్రసాద్ కారులో బయల్దేరారు. అక్కడ ప్రసాద్‌కు తెల్సిన జాయింట్ కలెక్టరు ఒకాయన ఉన్నాడు. ఆయన దగ్గరకు రవళిని తీసుకెళ్ళి పరిచయంచేశాడు. ఆయన ఎంతో సంస్కారంగల వ్యక్తి. ప్రసాద్‌కు బాగా తెల్సినవాడు. గెస్టుహౌస్ ఏర్పాటుచేశాడు. ఒక జీప్‌నూ, గైడ్‌నూ కూడా ఏర్పాటు చేశాడు. ఆ అడవుల్లో రవళీ, ప్రసాదూ నాలుగురోజులపాటు తిరిగారు. అక్కడి వాళ్ళు తినే తిండే తిన్నారు. వాళ్ళ ఆదాయం, వృత్తి, ఖర్చు, అలవాట్లు, ఆచారాలు..మొత్తం మీద వాళ్ళ బతుకుల్ని పరిశీలించింది రవళి. తాము వినని మాటలు వాళ్ళ నోటివెంట విన్నా నోట్ చేసుకునేది. వాళ్లు వాడుతున్న వస్తువుల పేర్లను కూడా రాసిపెట్టుకునేది. అలాగే ప్రభుత్వం ఆ కొండజాతివారికి సమకూరుస్తున్న సౌకర్యాల్ని గురించీ, సంక్షేమ కార్యక్రమాల్ని గురించీ కూడా అధికారుల ద్వారా తెలుసుకొనేది. వాళ్ళ పిల్లలకు ప్రభుత్వం ఏర్పాటుచేసిన హాస్టల్స్‌ను కూడా చూసింది.లక్కీగా ఆ ప్రాంతంలో తిరుగుతున్నప్పుడు ఒక పెళ్ళి కూడా జరగడంతో అది కూడా చూసే అవకాశం కలిగింది.

అట్లా నాలుగైదురోజులు ఆ జనం మధ్యన తిరుగుతూ, రాత్రికి గెస్టుహౌస్ చేరుకుంటూ గడిపారు వాళ్ళిద్దరూ.

ఇద్దరూ తిరిగి హైదరాబాద్‌కు బయల్దేరారు. బయల్దేరబోయేముందు జాయింట్ కలెక్టరు రవళినీ, ప్రసాద్‌నూ టీకి పిల్చాడు.

"ఈమె మీకు బంధువా?" అన్నాడు జాయింట్ కలెక్టరు టీ తీసుకొంటూ.

"కాదండీ...అంతకంటె ఎక్కువ" జవాబు ఇచ్చాడు ప్రసాద్ ముక్తసరిగా.

ప్రసాద్ అన్న మాటలు రవళికి నచ్చాయి.

నిజమే. ప్రసాద్ తనకూ అంతే.





బంధువుకంటే ఎక్కువే. ఎంత ఎక్కువో తాను చెప్పలేదు.

ఇద్దరూ హైదరాబాద్ చేరుకున్నారు. రవళిని వాళ్లింటిదగ్గర డ్రాప్‌చేసి, ప్రసాద్ కారు స్టార్ట్ చేస్తున్నాడు.

కారు దిగి గుమ్మందాకా వెళ్లిన రవళి, "మళ్లీ ఎప్పుడు కనబడతారు మీరు?" అంది వెనక్కు తిరిగి.

"అంటే ఇప్పుడు వెళ్లిపొమ్మనా?" నవ్వుతూ అన్నాడు ప్రసాద్.

"లేదు...లోపలకు రండి. కాఫీ తీసుకు వెళుదుగాని" అని ఆహ్వానించింది రవళి.

"లేదు లెండి. ఒకసారి ఇంటికెళ్ళి ఫ్యాక్టరీ చూసుకొని, సాయంత్రం వస్తాను" అని కారు స్టార్ట్ చేసి, వెళ్లిపోయాడు.

నాలుగైదు రోజులు వాళ్లిద్దరూ అలా కల్సి ఉండటంతో, ఇద్దరి మధ్యా పరిచయం బాగా పెరిగింది. ఒకరిపట్ల మరొకరికి గౌరవాభిమానాలు పెరిగాయి. ఫలితంగా ఏరోజు రాసింది ఆరోజే ప్రసాద్‌కు చదివి వినిపిస్తోంది రవళి. ఒక్క మంచి వాక్యం వింటే పరవశించిపోతాడు ప్రసాద్. తనకి నచ్చని విషయం ఏదైనా వుంటే మృదువుగా చెప్పి వొప్పిస్తాడు రవళిని. అలా పూర్తయింది ఓ నవల.

అంత శ్రమపడి, రవళికి తోడుగా వుండి విషయసేకరణ చేసి మరో నవలను కూడా పూర్తిచేయించాడు రవళిచేత. ఆ రెండు నవలలూ రవళికి మంచిపేరు తెచ్చి పెట్టడం సంగతలా ఉంచి రవళికి గతంలో ఎన్నడూ లేనంత తృప్తినిచ్చాయి.

ఆ రెండు నవలలూ పుస్తకాలుగా వచ్చాక రెండు పుస్తకాల్లోనూ తనముందు కూర్చున్న ప్రసాద్‌కు ఏదో రాసి ఇచ్చింది రవళి.

"ప్రతి గొప్పవ్యక్తి వెనుకా ఒక స్త్రీ వుంటుందంటారు. నా వెనుక మాత్రం మీరే వున్నారు" అని రాసి సంతకం చేసింది రవళి.

ప్రసాద్ మళ్లీ మళ్లీ చదువుకున్నాడు.

"మీరు...మీరు నిజంగా రచయిత్రే" అంటూ ఆమె కుడిచేతిని తీసుకుని విస్సంకోచంగా ముద్దుపెట్టుకున్నాడు ప్రసాద్.




"మీరలా అనకూడదు. మీ రచన లేకపోతే ఏమిటో మా పత్రికే అసంపూర్ణమనిపిస్తుంది నాకు. మీరు ఏదో ఒకటి రాసివ్వాలి నాకు" అంటూ మొహమాటపెట్టసాగాడు ఆ సంపాదకుడు.

"'పురాణాల్లో స్త్రీలు' అని నవల కాదనుకోండి. వ్యాసాల్లాంటివిరాస్తున్నాను. అవి మీకు ఎంతవరకు పనికొస్తాయో మరి" అంది రవళి.

"అమ్మా! జనానికి పనికొచ్చేవే రవళి గారు రాస్తారని పేరు. పనికి రావాల్సింది నాకు కాదు...జనానికి. 'పురాణాల్లో స్త్రీలు' అంటే ప్రతి స్త్రీ చదివి తీరుతుంది. ఆ శీర్షికతో మీరు రాశారంటే తప్పకుండా స్త్రీజాతికి ఉపయోగపడేదే అయివుంటుంది. మీరు నాకు మాటర్ ఇప్పిస్తే, వచ్చేవారం నుంచే ప్రచురిస్తాను. దయచేసి నా మాట కాదనకండి" అంటూ ప్రాధేయపడ్డాడు

అతను.

ఆ సంపాదకుడు చెప్పిన ప్రకారమే వారపత్రికలో రవళి కలం నుంచి వెలువడిన ఆ రచన వారం వారం ప్రచురించబడసాగింది. స్త్రీలను ఎంతగానో ఆకర్షిస్తున్నాయి ఆ వ్యాసాలు. మేధావులు దగ్గర్నుంచి కూడా అభినందనల్ని అందుకుంటోంది రవళి.

సాహితీవేత్తలు కొందరు పెదవి విరుస్తున్నా, కొందరు కనుబొమలు ఎగరవేస్తున్నా, మొత్తంమీద రవళి పేరు మారుమోగుతోంది.

ఆ పత్రికలో ప్రచురణ పూర్తయిన నెలరోజులు తిరక్కుండానే పుస్తకం కూడా వచ్చింది. మరుసటి సంవత్సరం ఆ పుస్తకానికి అకాడమీ బహుమతి కూడా లభించింది.

పట్టుమని ముప్పయ్‌రెండేళ్ళయినా నిండని కుమారి రవళికి అకాడమీ బహుమతి లభించినవార్తవిని అందరికంటే పూర్ణిమ ఆయన భార్య ఎంతగానో ఆనందించారు. ప్రసాద్ సంగతి సరేసరి.

ఢిల్లీకి వెళ్ళి బహుమతి తీసుకోవడానికి ముందు రవళి పూర్ణిమ ఇంటికొచ్చింది. పూర్ణిమకూ, ఆయనభార్యకూ తానుతెచ్చిన కొత్త బట్టల్ని ఇచ్చి, నమస్కరించింది.

"ఏమిటిదంతా?" అన్నాడు పూర్ణిమ.

"నన్ను రచయిత్రిని చేసినందుకు నా చిరుకానుక" అంది రవళి.

"ఇది మొదటిమెట్టే, ఇంకా ఎన్నో మెట్లు ఎక్కాలి" అన్నాడు పూర్ణిమ.

వాళ్ళముగ్గురి కళ్ళల్లోనూ ఆప్యాయతా ఆనందం కన్నీరై స్రవించింది.

* * *

సభ మూర్తీభవించిన సరస్వతిలా కళకళలాడుతోంది.

రవళి వచ్చిందని తెల్సి ఢిల్లీలో ఉన్న అనేకమంది అభిమానులు సభకు హాజరయ్యారు. ఢిల్లీ ఆంధ్ర సంఘంవారు రవళికి మరునాడు సాయంత్రం అభినందన సభ ఏర్పాటు చేశారు.

సభాకార్యక్రమం ప్రారంభమైంది. నివేదికలు, ఉపన్యాసాలు అయ్యాక బహుమతిప్రదానం ప్రారంభమైంది. ఒక్కొక్క బహుమతిగ్రహీత గురించి క్లుప్తంగా వివరించి తామ్రపత్రాన్ని,చెక్కునూబహుమతి గ్రహీతను వేదికమీదకు ఆహ్వానించి అందజేస్తున్నారు. ప్రతి బహుమతిగ్రహీత వేదిక మీదకు వెళ్ళినప్పుడు సభలోని ప్రేక్షకులు చప్పట్లతో గౌరవిస్తున్నారు.

అకాడమి బహుమతి గ్రహీతలలో అందరికంటే చిన్నవయస్సుగలది రవళి. ఆమె బహుమతి అందుకొనేందుకు వేదిక మీదకు రాగానే తక్కిన బహుమతి గ్రహీతలు వచ్చినప్పుడుకంటే ఎక్కువ కెమెరా ఫ్లాష్ లైట్లు కళ్ళు మిరుమిట్లుగొలిపేలా జిగేల్ జిగేల్‌మన్నాయి. బహుమతి గ్రహీతల్లో ఏకైక స్త్రీ రవళి కావడంచేత సభకు హాజరైన స్త్రీలంతా రవళిని తమ ప్రతినిధిగా భావించారు. అందానికిఅందం, వయస్సుకు వయస్సు కూడా గల రచయిత్రి కావడంతో మొత్తం సభను ఆకర్షించగలిగింది రవళి.

రవళి వేదికమీదకు వచ్చినప్పుడు ప్రెస్‌కోసం కేటాయించిన సీటల్లో కూర్చున్న రేడియో రిపోర్టర్‌గా వచ్చిన న్యూస్ ఎడిటర్ చాలా పరిశీలనగా చూశాడు. ఎక్కడో ఎప్పుడో చూసినట్టు గుర్తు అతనికి. గతాన్ని బాగా మననం చేసుకున్న తర్వాత ఈ రవళి ఆ రవళేనని స్ఫురించిందతనికి. రవళి పేరు తరుచూ అతను పత్రికల్లో చూస్తున్నా ఒకనాడు

తనకు ఉత్తరాలు రాసి ,తన వెంటబడిన ఆ రవళే ఈరవళని గుర్తించలేదు అతను.

సభ ముగిసింతర్వాత రవళి కారు దగ్గరకు వస్తోంది. వెంట ఆమెను అభిమానించే తెలుగువారు ఆడా మగా కొంద రున్నారు. రవి జనాన్ని తప్పించుకొని, ఆమె పక్కకు చేరాడు.

''నమస్తే!'' అన్నాడు రవి.

రవళి అతనివైపు చూసింది. చెంపలు మెరిశాయి. కొత్తగా కళ్లజోడు వచ్చింది. మొహంలో కొద్దిగా ముడతలు కనిపిస్తున్నాయి. మనిషి కాస్త లావెక్కాడు. అతనివైపు చూసిన మరుక్షణంలోనే గతానికీ, ప్రస్తుతానికీ రూపంలో చాలా మార్పువున్నా అతను రవి అని గుర్తించి ప్రతినమస్కారం చేసింది.

"నన్ను గుర్తుపట్టారా?" రవి అడిగాడు రవళిని.

"మిమ్మల్ని గుర్తుపట్టకుండా ఎలా వుంటాను? అసలు మర్చిపోతేగదా గుర్తు పట్టడమన్న సమస్య" అంది రవళి నవ్వుతూ.

ఆ మాటకు రవి కూడా నవ్వాడు.

అలా మాట్లాడుకుంటూ కారు దగ్గరకు రాగానే, రవి డోరు తెరిచాడు.

"ఎ క్క డ ది గా రు ?" కారులో కూర్చున్న రవళిని అడిగాడు.

"హోటల్‌లో" బదులుచెప్పింది రవళి.

"వెంట ఎవరున్నారు?"

"సామాను. అంటే సూట్‌కేస్, వాటర్ బాటిల్‌లాంటివి"

"మీరు చాలా చమత్కారంగా మాట్లాడుతున్నారు" అన్నాడు రవి నవ్వుతూ.

నిజానికి లోలోన అతనికి మంటగానే వుంది. దాదాపు పదిహేనేళ్ల క్రితం తన వెంటబడి ఉత్తరాలు రాసి తనే కావాలని కోరుకున్న ఒక కాలేజీ అమ్మాయి ఇంత ఎదిగిపోవడం, తనకు లభించని అకాడమి అవార్డు పొందడం, తాను రచయితగా మరుగుపడ్డాక ఈవిడ ఇలా వెలుగులోకి వచ్చి దేదీప్యమానంగా వెలిగిపోవడం– ఇవన్నీ మంటగానే వున్నాయతనికి. కాక పోతే ఒకే ఒక్క ఆశ – ఆ మంటమీద నీళ్లు చల్లి అతన్ని రవళి ముందు నిల బెట్టింది. ఆ ఆశ రవళి పేరు ముందున్న 'కుమారి'.

"ఇంకా ఎన్నాళ్లుంటారు?" రవి అడిగాడు.

"రోడ్డు మీద ఈ మాటలన్నీ ఎందుకు? రూమ్‌కు రండి" ఆహ్వానించింది రవళి.

రవి ఆశ బలపడింది. ప్రాణం లేచి వచ్చినట్లయింది. తననింకా రవళి మర్చి పోలేదని అనుకున్నాడు.

"రూమ్ నంబరెంత?" అన్నాడు రవి.

"ఇక్కడ ఇంకా మీకు పనుందా?" రూమ్ నంబరు చెప్పకుండా ఎదురుప్రశ్న వేసింది రవళి.

"అబ్బే...ఏం పనిలేదు!"

"అయితే కారెక్కండి" అంది రవళి.

మారుమాటాడకుండా రవి ఫ్రంట్ సీట్లో కూర్చోబోయాడు.

"మీరు వెనక్కి రండి. ముందు సీట్లో మురళిగారు కూర్చుంటారు"

పసిపిల్లాడిలా వెనకసీట్లోకి వచ్చి ఆమె పక్కన కూర్చున్నాడు. మురళి ముందు సీట్లోకి వెళ్లాడు. అతను అక్కడి ఆంధ్ర సంఘం కార్యదర్శి.

కారు కదిలింది.

"ఢిల్లీలోనే వుంటున్నారా?" రవి

వైపు మొహం తిప్పకుండా కారు ముందు గ్లాసులోంచి రోడ్డును చూస్తూ ప్రశ్నించింది.

"అవును"

"ఏంచేస్తున్నారు?"

"రేడియోలో న్యూస్ ఎడిటర్ను"

"ఫంక్షన్‌కు వచ్చారా?"

"కవరేజికి వచ్చాను. నా కూడా మా స్టాఫ్ కూడా వచ్చారు"

"అయితే మిమ్మల్ని ఇబ్బందిపెట్టానేమో!"

"దేనికి?"

"మీరు నా వెంట వస్తున్నారు గదా... పాపం మీ స్టాఫ్ మీ గురించి చూస్తారేమో!"

"వాళ్లకు నేను చెప్పేశాను. ఆఫీసు కారులో వాళ్లు వెళ్లిపోతారు"

ఆ తర్వాత రవళి ఏం మాట్లాడ లేదు.

ఏం మాట్లాడాలో తోచక రవి మాట్లాడ లేదు. ఆమె ఎదురుగా వున్న రోడ్డునే చూస్తోంది. రవి మాత్రం ఆమెనే చూస్తున్నాడు. ఎదురుగా కార్లు వచ్చినప్పుడు ఆమె మొహం మీద వెలుగు పడితే, ఆమె మొహం క్షణంపాటు స్పష్టంగా కనబడుతోంది అతనికి. ఆ కారు వెలుతురు పోగానే తిరిగి ఆమె మొహం క్రీనీడ మాటుకు వెళ్లిపోతోంది. అలా రవి వెలుగు నీడల దోబూచులాటలో రవళి మొహాన్ని చూస్తూ ఎత్తయిన హిమాలయ పర్వతం పాదాల దగ్గర కూర్చున్న పసివాడిలా ఫీలయ్యాడు.

ఆమె తనకంటే, ఎంతో ఎత్తు ఎదిగిపోయిందనిపించిందతనికి. ఆనాడు తాను దిగిన హోటల్ గదికి వచ్చి, వొద్దికగా కూర్చున్న కాలేజీ గరల్‌లా లేదు ఈ రవళి. ఆమె మొహంలో ఏదో పరిపూర్ణత, హుందాతనం అన్నింటినీమించి ఏ ప్రలోభానికి లొంగని మనోనిగ్రహం కనిపిస్తున్నాయి. ధైర్యం చేసి చనువు తీసుకోలేకపోతున్నాడతను. ఒకప్పుడు రవళి తనకెంతో చనువిచ్చింది. అది గుర్తుచేయడానిక్కూడా ధైర్యం చాలడంలేదు.

మూడోమనిషి ఉండటం చేత అలా ముభావంగా ఉంటోందిగాని, గతంలో తనమీదున్న మోజు ఇంకా చచ్చివుండదు. ఆ మోజు ఇంకా బతికివుండకపోతే తనని ఆమె వెంట కారులో హోటల్‌కు ఎందుకు తీసుకెళుతుంది? రూమ్‌కు చేరుకున్నాక ఆమె చనువు తీసుకొని అన్ని విషయాలూ మాట్లాడుతుంది. తన మీద ఏదో ఇదిని పెంచుకోకపోతే, ఇంతకాలం 'కుమారి'గా ఉండిపోవాల్సిన అవసరం లేదే!–ఇలాంటి ఆలోచనల్తో రవి మనస్సు ఉక్కిరిబిక్కిరి అవుతూంటే కారు హోటల్ పోర్టికోలో ఆగింది.

మురళి కౌంటర్ నుంచి రూమ్'కీ' తీసుకొని, రూమ్‌వైపు నడిచాడు. కారులోంచి తెచ్చిన తామ్రపత్రాన్నీ, పూలదండనూ టేబుల్‌మీద ఉంచాడు మురళి.

"నేను రేపు మార్నింగ్ వస్తాను మేడమ్'' అన్నాడు మురళి.

''ఫోంచేసి వెళ్ళొచ్చుగా!'' రవళి మర్యాదగా అంది.

"భలేవారే. మీరు మావూరొచ్చారు. మిమ్మల్ని మా గెస్టుగా తీసుకెళ్లాలిగాని, మీకు గెస్టుగా వుండటం మర్యాదకాదు. రేప్పొద్దున్నే మళ్ళీ కారు తీసుకువస్తాను. చూడవల్సినవి ఏవైనాఉంటే చూద్దురుగాని. సాయంకాలం మా మీటింగ్ అయ్యాక మీ ప్రయాణం సంగతి ఆలోచించవచ్చు''

"ఆలోచనేం లేదండీ! ఎల్లుండి ఫ్లైట్‌కు

వెళ్ళిపోవడమే" అంది రవళి.

"ఓకే... అల్లాగే వస్తాను" అని మురళి వెళ్లిపోయాడు.

రూమ్‌లో రవళి, రవి మిగిలారు.

రవి స్వేచ్ఛగా గాలి పీల్చుకున్నాడు.

"ఏంతీసుకుంటారు?" రవళి అడిగింది.

"కాఫీ"

"ఈవేళప్పుడు కాఫీయా? డ్రింక్స్ మానేశారా?"

ఉలిక్కిపడ్డాడు రవి.

'ఎంతమారిపోయింది ఈఅమ్మాయి?' అనుకున్నాడు అతను.

"మానేయలేదు. మీకేమైనా...."

"నాకేం అభ్యంతరం లేదు. మీకు కావాల్సిన డ్రింక్ మీరు తీసుకోవచ్చు"

"అంటే మీరుకూడా..."

"తీసుకోకూడదా?"

"వెల్‌కం. మీరుకూడా తీసుకుంటే.."

"తీసుకుంటే?"

"కంపెనీ బావుంటుంది"

"లేకపోతే నా కంపెనీ మీకు నచ్చదా?"

"నో నో...మీ కంపెనీ ఎప్పుడూ నాకానందమే"

ఇంతలో బేరర్ వచ్చాడు.

"చెప్పండి" అంది రవళి రవితో.

"త్రీపెగ్స్ జానీవాకర్ బ్లాక్ లేబుల్, మూడు సోడాలు. కాజూ. ముందు అవి తీసుకురా"

"ఓ ఫ్రూట్ జ్యూస్‌కూడా" అంది రవళి.

"డిన్నర్ తర్వాత" అన్నాడు రవి.

బేరర్ వెళ్ళిపోయాడు.

రచయితగా తాను ఎన్నడో మరుగున పడినా రవళికి తనపట్ల అభిమానం తగ్గలేదు అనిపిస్తోంది రవికి. ఆమె చేస్తున్న మర్యాదలే దానికి కారణం. ఆనాడు తను ఆమెను తిరస్కరించినందుకు పగబట్టిన నాగులా ప్రవర్తిస్తుందేమో అనుకున్నాడు. కాని తనపట్ల ఆమె ప్రవర్తన తాను వూహించినదానికి విరుద్ధంగా వుంది.

బేరర్ విస్కీ తెచ్చాడు.

సోడా ఓపెన్‌చేసి విస్కీ గ్లాసులో పోశాడు బేరర్.

"అలావుంచు. నేను కలుపుకుంటాన్లే" అన్నాడు రవి.

బేరర్ వెళ్లిపోయాడు.

"చీర్స్" అంటూ గ్లాసు తీసుకున్నాడు రవి.

ఫ్రూట్ జ్యూస్ గ్లాస్ ఎత్తి, "చీర్స్" చెప్పింది రవళి.

విస్కీ సిప్‌చేసి, గ్లాసు టేబుల్‌మీద పెడుతూ "ఇంత పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొని, ఇంతపెద్ద రచయిత్రిగా ఎదిగి, ఇంతవరకు మీరు టేస్టు చేయలేదంటే"

"నమ్మలేకపోతున్నారా?" సూటిగా అడిగింది రవళి.

ఆ ప్రశ్న రవిని ఇబ్బందిపెట్టింది.

"అబ్బే...అదికాదు" అన్నాడు.

"తాగకపోతే నాగరీకులకింద లెక్క కాదా?" మళ్ళీ అడిగింది రవళి.

"నేనేదో కాజువల్‌గా అన్నాను. అసలు విషయానికొద్దాం"

"చెప్పండి"

మనసులో వున్న మాట పైకి అనలేకపోయాడు రవి.

"ఇంకా కొత్త రచనల్ని ఏం చేయబోతున్నారు?" అడిగాడు రవి.

"అసలు మీరు అడగదల్చుకున్న విషయం అదేనా?" రవళి అతని కళ్లలోకి కొంటెగా చూస్తూ అడిగింది.

"అయితే మీరు సైకాలజీ కూడా స్టడీ



చేశారన్న మాట. నిజంగా నేను అడగ దల్చుకున్న విషయం అది కాదు"

"ఆ విషయం మీ ముఖంచూసి నేను ఎప్పుడో గ్రహించాను" అంది రవళి నవ్వుతూ.

ఆమె అలా నవ్వుతూ మాట్లాడటం

వల్ల కొంత ధైర్యమొచ్చింది అతనికి. రెండు గుక్కలు విస్కీ మింగి మరింత ధైర్యాన్ని కూడగట్టుకొని మొదలుపెట్టాడు–

సరిగ్గా పదిహేనేళ్ళ క్రితం అనుకుంటాను... మనం హైదరాబాద్‌లో నా హోటల్ రూంలో కల్సాం. ఆరోజు నన్ను



ఓ కోరిక కోరారు మీరు. నేను ధైర్యంగా వెంటనే 'అవును' అనలేకపోయాను. మీరంటే ఇష్టంలేక కాదు. మీరు నాకు అక్కర్లేక కాదు. ఆనాడు మిమ్మల్ని నాదాన్ని చేసుకొని, మీరు నా మనిషి అని ధైర్యంగా తలెత్తుకుని సమాజానికి చెప్పే అవకాశం నాకు లేదు. అప్పటికే నాకు వివాహం నిశ్చయమయింది. కట్నం అడ్వాన్స్ కూడా తీసుకున్నారు మా ఫాదర్. ఒకవేళ మీ కోర్కెను నేను అంగీకరిస్తే ఇంట్లో తుఫాను చెలరేగడం ఖాయం. దాంతో మనశ్శాంతి పోతుంది. ఇదంతా ఆనాటి పరిస్థితి, ఇప్పటి పరిస్థితి వేరు. మా ఆవిడ పోయింది. ఒక్కగానొక్క

కొడుకుహాస్టల్లోఉండిచదువుకుంటున్నాడు ప్రస్తుతం నేనెవరికీ అక్కర్లేదు. అందరూ వున్నా, 'నా' అన్నవాళ్లు నాకెవరూ లేనట్టే! రాయాలనివున్నా నాచేత రాయించే ప్రేరణ లేదు. ఇప్పుడు నేను మీ ముందున్నాను. మీరింకా 'కుమారి'గానే వున్నారుగాబట్టి మీకభ్యంతరం లేకపోతే నన్ను మీ మనిషిని చేసుకోండి. జీవితాంతం మీ వాడిగా వుండిపోతాను" గ్లాసులోవున్న విస్కీని రెండు గుక్కల్లో తాగేశాడు రవి.

రవళి బరువుగా నిట్టూర్చింది.

"ఎల్లుండి మీరు నాతోమావూరు రండి. నా సమాధానం అక్కడ చెబుతాను" అంది రవళి.

"హైదరాబాదేగా!"

"కాదు... పెద్దపల్లి"

"సరే...మీ వెంటే వస్తున్నాను"




ఢిల్లీ నుంచి వచ్చిన ఎయిర్‌బస్ బేగంపేట విమానాశ్రయంలో దిగింది. దాంట్లోంచి రవళీ, రవి దిగారు.

ఎయిర్‌పోర్టునుంచి బయటికి వచ్చారు. గేటువద్ద సిద్ధంగావున్న రవళి కారు డ్రైవరు కార్డులు అందుకుని లగేజీ తీసుకు రావడానికి వెళ్లాడు.

లగేజితెచ్చినతర్వాత రవళీ, రవి కారెక్కారు. డ్రైవర్ కారు స్టార్ట్ చేశాడు.

"తిన్నగా పెద్దపల్లికే పోనివ్వు" రవళి డ్రైవర్ని ఆదేశించింది.

"అట్లాగేనమ్మా!" అన్నాడు డ్రైవరు.

"కారు కొన్నారా?" రవి అడిగాడు.

"లేదు... పాతదే"

'అయితే రవళికి ఎప్పట్నించో కారు వుందన్నమాట' అనుకున్నాడు రవి.

రవళి అంత ఎక్కువగా ఏమీ మాట్లాడకపోయినా, రవి కల్పించుకొని పిచ్చాపాటీ మాట్లాడుతున్నాడు.

రవళి పొడి మాటల్తో సమాధానం చెబుతోంది.

మధ్యాహ్నానికి కారు పెద్దపల్లిలోని హవేలీ చేరుకుంది.

రవళి కారు దిగింది. ఆమె వెనకే రవి దిగాడు.

ఇద్దరు నౌకర్లు వచ్చి చేతులు కట్టుకొని రవళిముందు నిలబడ్డారు.

డ్రైవరు డిక్కీ తెరిచాడు. నౌకర్లిద్దరూ సామాన్లు తీసుకున్నారు.

"వారిని గెస్టురూంలోకి తీసుకెళ్లు" నౌకర్ని పురమాయించింది రవళి.

అంతవరకూ పురాతనమైన మేడను చూస్తోన్న రవి రవళి మాటలువిని ఆమె వైపు తిరిగాడు.

"గెస్టురూంకెళ్లి రెస్టు తీసుకోండి. లంచ్ అక్కడికేతీసుకొస్తాడు నౌకరు" అని చెప్పి మేడమీదకు వెళ్లిపోయింది రవళి.

ఆమె వెళ్లినవైపే చూస్తూ నిలబడిపోయాడు రవి.

"రండి బాబుగారూ!" అన్న నౌకరు మాటలతో తేరుకుని ఆ నౌకరు వెంటవెళ్లి గెస్టురూంకు చేరుకున్నాడు.

గెస్టురూం చూడటానికి చాలాఅందంగా వుంది. ముందుగదిలో సోఫాసెట్టు, ఆతర్వాత గదిలో డబుల్‌కాట్, అటాచ్‌డ్

బాత్, డ్రసింగ్ టేబుల్ అన్నీ అధు నాతన సౌకర్యాలతో చూడముచ్చటగా వుంది.

నౌకరు వెళ్ళిపోయాక తన సూట్ కేసు తెచ్చి లుంగీతీసుకొని, బట్టలు మార్చు కున్నాడు. బాత్ రూంకెళ్లి మొహం కడు క్కొని వచ్చి, బెడ్ మీద నడుంవాల్చాడు.

ఢిల్లీలో హోటల్ రూంలో ఉన్నంత చనువుగా రవళి ఆతర్వాత తనతో ఉండటం లేదనిపించింది రవికి. బహుశా డ్రైవరు ముందు, నౌకరముందు తనకి చనువు ఇవ్వడం ఇష్టంలేక బెట్టుగావుందేమో! ఈ హవేలీ ఈమెదా, లేక ఇంకెవరిదై నానా? అన్న ప్రశ్న తనకితనే వేసుకు న్నాడు. పదిహేనేళ్లక్రితం తనని మొట్ట మొదటిసారిగా కల్సిన రవళి ఇంత పెద్దింటి అమ్మాయని తనకు తెలియదు. అలా ఏవేవో ఆలోచించుకుంటూ నిద్దట్లోకి జారుకున్నాడు రవి.

అరగంట తర్వాత నౌకరు భోజనం తెచ్చి లేపాడు రవిని.

మొహం కడిగి భోంచేశాడు. భోజనం చాలా బావుందనుకున్నాడు. అతను భోం చేస్తూన్నంతసేపూ నౌకరు కావాల్సినవి వడ్డిస్తూ పక్కనే నిలబడివున్నాడు.

"అమ్మగారు భోంచేశారా?" అని అడగబోయి ఎందుకో మానేశాడు. నౌకరుకూడా అడిగిన పదార్థాలు వడ్డిం చడమేతప్ప అనవసరంగా ఒక్కమాట కూడా మాట్లాడలేదు.

నౌకరు వెళ్లిపోయాక చేసేపనిలేక ఏదో పుస్తకం తిరగేస్తూ మళ్లీ నిద్రపో యాడు రవి.

సరిగ్గా సాయంత్రం నాలుగు గంట లకు నౌకరు టీ తీసుకొని గదిలోకి అడుగుపెట్టినప్పుడు రవికి మెలకువ వచ్చింది.

నౌకరు టీ కలిపి ఇచ్చాడు.

టీ తాగుతూ వుండగా, రవళి గదిలోకి వస్తూ, "బాగా నిద్రపోయినట్టున్నారే?" అంది.

"అవును! వాతావరణం ప్రశాంతంగా ఉందిగదా!" అన్నాడు రవి.

రవి టీ తీసుకున్న తర్వాత నౌకరు కప్పులుతీసుకొని వెళ్లిపోయాడు.

"రండి... మా ఇల్లు చూపిస్తాను" అంటూ లేచింది రవళి.

రవి చెప్పులు తొడుక్కొనిలేస్తూ "ఇల్లా! ఇదో చిన్న కోటలావుంది" అన్నాడు నవ్వుతూ.

"నిజమే. ఊళ్లో జనమంతా హవేలీ అంటారు" అంటూ రవళి బయటకు నడిచింది.

వెనకనే రవి నడిచాడు.

రవళి మొట్టమొదట అతన్ని తన లైబ్రరీరూమ్‌కు తీసుకెళ్లింది. ఆమె తాత గారి పుస్తకాలే కాకుండా ఈ మధ్య ప్రచురితమైన చదవదగ్గ పుస్తకాలు అన్నీ వున్నాయి. తెలుగు, ఇంగ్లీషే కాకుండా హిందీ సాహిత్య గ్రంథాలుకూడా అగు పించాయి రవికి.

"హిందీ కూడా నేర్చుకున్నారా?" అడిగాడు.

"అవును. విశారద వరకూ చదివాను. సమకాలిక సాహిత్యం తీరుతెన్నులు తెల్సుకోవాలంటే హిందీ కూడా తెల్సు కోవడం అవసరమనిపించింది" అంది రవళి.

"మీ లైబ్రరీలో వున్న పుస్తకాలన్నీ చదివేశారా?"

"కొన్ని రెండుసార్లు.కొన్ని ఒక్కసారి. అలంకారంగా ఒక్క పుస్తకమూ పెట్టు

కోలేదు ఈ లైబ్రరీలో" నవ్వుతూ అంది రవళి.

"బావుంది..చాలానేర్చుకొనివుంటారు"

అతని మాటకు బదులు చెప్పలేదు రవళి.

'చాలా చక్కటి లైబ్రరీ' అనుకున్నాడు రవి తనలో తనే.

"రండి'' అంటూ లైబ్రరీ గదినుంచే ఒక డోర్ తెరిచిబెడ్‌రూంలోకి తీసుకెళ్లింది రవళి.

విశాలమైన బెడ్‌మీద ఇటూ అటూ పుస్తకాలు పడివున్నాయి.

"మీ బెడ్‌రూం, రీడింగ్‌రూమ్ కూడా అన్నమాట"

రవళి మాట్లాడలేదు. పుస్తకాలు చిందరవందరగా పడివున్నా గది చాలా అధునాతనంగా అలంకరించబడి వుంది. గోడలకు నాలుగు చక్కటి ఆయిల్ పెయింటింగ్స్ తగిలించి వున్నాయి. కిటికీలోంచి బయటి పూలతోట కనపడు తోంది.

''ఈ బీరువాలోవి కూడా పుస్తకాలేనా?" అన్నాడు రవి పెద్ద బీరువాను చూపిస్తూ.

రవళి ఆ బీరువా తెరిచింది. దాంట్లో చీరలు హేంగర్స్‌కు తగిలించి వున్నాయి. మూడు అరల్లో దజన్లకొద్దీ చీరలు వున్నాయి. మధ్య అరలో వేలాడుతున్న చీరలను చేత్తో ఆ చివరనుంచి ఈ చివర దాకా కదిపింది రవళి. ఆ చీరల వెనుక పదిహేనేళ్ళ క్రితం రవళికి పంపిన తన ఫొటో ఫ్రేంలో అమర్చి అగుపించింది రవికి. ఆ ఫొటోను చూడగానే రవి కళ్లు మిగేలమన్నాయి. 'నేనింకా రవళి మనసు లోంచి తొలగిపోలేదు. నన్ను మర్చిపోతే నా ఫొటో అంత పదిలంగా దాచుకొని వుండేదికాదు' అనుకున్నాడు రవి.

కాని రవళి ఆ ఫొటో గురించి ఏం మాట్లాడలేదు. ఫొటో చూశాక రవి ముఖంలో వచ్చిన మార్పును క్రీగంట చూసింది రవళి.

"రండి" అంటూ మేడమీదకునడిచింది.

తాతగారి గదిలోకి తీసుకువెళ్లింది.

"ఇది మా తాతగారి గది. అది మా తాతగారి ఫొటో. పేరు రాఘవేంద్రరావు ఆ పక్కనే వున్నది మా అమ్మమ్మగారి ఫొటో''

"అయితేమీతల్లితండ్రిగారి హవేలీయా ఇది?'' అన్నాడు రవి. అలా అనడంలో 'మీ తండ్రిగారు ఇంత ఆస్తిపరులు అయి వుండరు' అన్న ఎత్తిపొడుపు రవళికి వినిపించింది.

"రండి.... మా అమ్మ గారి గది చూపిస్తాను'' అంటూ నడిచింది రవళి.

"మీఅమ్మగారు వూళ్ళోనేవున్నారా?" వెంట నడుస్తూ అడిగాడు రవి.

''ఈ లోకంలోనేలేదు" అంటూ తన తల్లి గదిలోకి తీసుకెళ్ళింది రవళి.

"ఇది మా అమ్మగారి ఫొటో"

ఫొటో వంకే చూస్తూ నిలబడింది రవళి

"మీ అమ్మగారు చాలా అందంగా వున్నారు. బహుశా వారు పాతికేళ్ళ వయస్సులో వున్నప్పటి ఫొటోలావుంది"

"అవును. ఆవిడ బతికిందే ఇరవైఆరు సంవత్సరాలు"

ఆశ్చర్యంగా చూశాడు రవి.

"మా తాతగారికి మా అమ్మగారు ఒక్కతే. అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూ ఎవరూ లేరు. అప్పట్లో ఈ హవేలీలో మేమేవున్నా మాతాతగారు చదువుకున్న వారు కావడంచేత మా అమ్మను హైదరాబాద్‌లో పెట్టి చదివించారాయన. బి. ఎ. చదువుతూండగా మా అమ్మ తన క్లాస్

 

ఫ్రెండ్‌ను ప్రేమించింది. అతనికోసం ఎం.ఎ కూడా చదివింది. ఇద్దరి మధ్యనా ప్రేమ పెరిగింది. పెళ్ళి సంగతి ఆలోచించకుండా ఆరు మాసాలపాటు వాళ్ళిద్దరూ భార్యాభర్తల్లాగే వున్నారట. ఆ ఫలితమే నేను. కాని ఆయన కారు యాక్సిడెంట్‌లో పోయారు. పెళ్ళికాకుండానే మాఅమ్మ తల్లి అయింది మా తాతగారు మా అమ్మను పల్లెత్తుమాట అనలేదుట. మాఅమ్మ నిర్భయంగా నన్ను కని, తనకి పెళ్ళికాకపోయినా ఆయనే తన భర్తని నుదుట కుంకుమ దిద్దుకోకుండా నేనుపుట్టిననెలరోజులకే కన్నుమూసిందట. అప్పట్నుంచీ నాకు అమ్మా, నాన్నా మా తాతగారే. మా అమ్మకు స్వేచ్ఛ ఇవ్వడం మూలంగా ఈ అనర్థం జరిగిందని మా తాతగారు నాకు స్వేచ్ఛ ఇవ్వడం మానలేదు. 'తప్పు స్వేచ్ఛదికాదు, దాన్ని దుర్వినియోగం చేసుకొన్నవాళ్ళది' అనేవారు. అలా ఆయనంత స్వేచ్ఛ నాకివ్వబట్టే పదిహేనేళ్ళక్రితం మీ హోటల్‌రూంకు రాగలిగాను. ఇంత ఎదగగలిగాను. ఇప్పటికీ 'కుమారి'గా ఉండగలిగాను" అంది రవళి.

"నేను చిన్నప్పుడు ఆడుకొనే గది చూపిస్తాను...రండి'' అంటూ మేడమీద నుంచి కిందకు తీసుకెళ్ళింది రవిని.

ఓ గది తలుపులు తెరిచి లోపలకు నడిచింది.

"ఈ ఉయ్యాల చూశారా! దీంట్లో పడుకోబెట్టి వూపితేనే నిద్రపోయేదాన్నట. మెలకువగా ఉన్నంతసేపు పైన కట్టిన పాలపెల్లి తిరుగుతూ వుండాలట. అది నా వయస్సు ఏడాదప్పుడులెండి. రెండేళ్ళ వచ్చాక ఈ కొయ్యగుర్రంమీద కూర్చోబెట్టి వూపుతుంటేనే అన్నం తినేదాన్నట. నాలుగోఏట ఈ మూడు చక్రాల సైకిల్ని క్షణం వదిలేదాన్ని కాదట. ఈ బొమ్మ చూశారా? ఈ బొమ్మను పక్కలో పెట్టుకుని పడుకొనేదాన్నట. కాని ఇప్పుడు ఇవేమీ నాకక్కరలేదు.వీటి మొహంచూసి ఇరవైఏళ్ళవుతుంది.మీకుచూపించాలిగదా అని ఈ గదిలో అడుగు పెట్టాను. మనిషి ఎదగనప్పుడు కొన్ని వస్తువులకు విలువనిస్తాడు. ఎదిగాక వాటి సంగతే పట్టించుకోకపోవచ్చు.వాటి అవసరం లేకపోవచ్చు. మీరు ఫోన్లో నన్ను అడిగిన ప్రశ్నకు ఇప్పుడుసమాధానం చెప్పాననుకుంటాను" అంది రవళి గదిలోంచి బయటకు వస్తూ.

ఆమె వెనకనే నడుస్తున్న రవి నెత్తిన పిడుగుపడ్డట్టయింది – ఆమె సమాధానం విన్నాక.

'పదిహేనేళ్ళక్రితం నువ్వు ఎదగనప్పుడు నేను కావాలి. ఈవేళ నువ్వు ఎదిగాక నాతో అవసరం లేదు. నేను అక్కరలేదు' అనుకున్నాడు రవి.

"నేను సాయంత్రం బయల్దేరతాను" అన్నాడు – ఇహ అక్కడ ఉండలేనని తెలుసుకొని.

"మీరు ఎప్పుడు వెళ్ళినా కారు, ఫ్లైట్‌కి ఓ ప్లేన్ టిక్కెట్టు రెడీగా వున్నాయి'' అంది రవళి.

ఇంతలో నౌకరు వచ్చి చేతులు కట్టుకు నిలబడ్డాడు.

'ఏమిటన్నట్లు' చూసింది రవళి.

"ప్రసాదు బాబుగారూ,పూర్ణిమగారూ, ఆయన భార్యా వచ్చారమ్మా! డ్రాయింగ్ రూమ్‌లో కూచోబెట్టాను'' అన్నాడతను.

సందేహంగా ఆమెకేసి చూశాడు రవి.

"సమయానికే వచ్చారు! రండి రవిగారూ! నా గురువునూ, గురుపత్నినీ, నా కాబోయే శ్రీవారినీ పరిచయంచేస్తాను'' అంటూ ముందడుగు వేసింది రవళి. ★

# చతుర ఫీచర్

1811లో సయామ్‌లో భుజాల నుంచి నడుమువరకూ ఏకశరీరంగా కలిసిపోయి జన్మించిన చాంగ్, ఎంగ్‌లు 'సయామీ కవలలు'గా ప్రసిద్ధిపొందారు. అనేకసార్లు యూరప్, అమెరికా సంయుక్త రాష్ట్రాలలో పర్యటించి లక్షలాది ప్రజలముందు ప్రదర్శనలిచ్చారు. వాళ్ళకు లభించిన గుర్తింపు ఎంతటిదంటే, ఆ తర్వాత అతుక్కుపోయిన శరీరాలతో పుట్టిన కవలల్ని 'సయామీ కవలలు' అనే వ్యవహరించసాగారు. ఆకర్షణీయంగా వుండేది. ఆమెకు కాన్పు తేలికగానే అయింది. కవలలు ఒకేసారి ఈ ప్రపంచంలోకి వచ్చారు.

ఈ విధంగా శరీరాలు అతుక్కుని పుట్టిన కవలలు సాధారణంగా ఒకే పోలికలు కలిగివుంటారు. ఒక అండం ఒక వీర్యకణంతో ఫలదీకరణం చెందాక, అది రెండుగా విడిపోతే ఒకే విధంగా వుండే మగ లేక ఆడ కవలలు పుడతారు. అండం వీర్యకణంతో ఫలదీకరణం చెందాక రెండుగా విడిపోయే క్రియ మధ్యలో ఆగిపోతే, ఇలా శరీరాలు అతుక్కుని వుండే 'సయామీ కవలలు' జన్మిస్తారు.

# సయామీ కవలలు

అయితే సయామీ కవలలు నిజానికి సయాందేశస్తులు కాదు. వాళ్లు చైనీయులు. వారి తండ్రి చైనాకు చెందిన జాలరి: తల్లి చైనా, మలయాలకు చెందిన దంపతులకు పుట్టింది. సయామీ కవలల తల్లిదండ్రులు సయాంకి వచ్చి స్థిరపడ్డారు. వారు 'చైనీయులు'గానే అందరికీ తెలుసు.

నేడు థాయ్‌లాండ్‌గా ఉన్న ఆనాటి సయాం రాజధాని బాంగ్‌కాక్‌కి 60మైళ్ళ దూరంలోని ఓ చిన్న జాలరుల గ్రామం 'మెక్‌లాంగ్'లో 1811 మే11న సయామీ కవలలు పుట్టారు. ఆ తల్లిదండ్రులకు వారికంటే ముందు పుట్టిన నలుగురు పిల్లలూ మామూలుగానే వున్నారు. ఆ కవలలు చాంగ్, ఎంగ్‌ల తల్లి35ఏళ్ళ వయసులోకూడా చక్కటి ఆకారంతో,

అండం రెండుగా విడటం ఎప్పుడు ఆగిపోతుందో, దానిపై ఇద్దరి శరీరాలు అతుక్కుపోవడం ఆధారపడి వుంటుంది. అందువల్లే కొందరు కవలలు వీపువద్దగానీ, కడుపువద్దగానీ లేదా ఛాతీ, తల దగ్గిర గానీ అతుక్కుపోయి పుడతారు. కొందరు ఎక్కడో ఒకచోట అతుక్కుని వుంటే, కొందరు ఒకే అంగం, అవయవాలతో కూడా పుట్టవచ్చు. కాని, ఈ రకమైన కవలలు ఎక్కువగా పుట్టేసరికే చనిపోయి ఉంటారు. లేదా పుట్టిన వెంటనే మరణం చవడం జరుగుతుంటుంది.

అలాంటిది చాంగ్, ఎంగ్‌లు దీర్ఘకాలం జీవించడం ఓ అద్భుతమే: అతుక్కుని వుండటంవల్ల వారికి ఒక్క క్షణమైనా ఒంటరిగా గడిపేందుకు అవకాశమే లేదు. దాంతో వారిద్దరిమధ్యా రహస్యాలన్నవి లేవు. తినడం, నిద్రించడం, పనిచేయడం,

పెళ్లిచేసుకోవడం - అంతా కలిసి చేయాల్సిందే. ఆఖరికి మరణంకూడా ఇద్దరికీ ఒకేసారి సంభవించింది.

సయాం వెనుకబడిన దేశం కాబట్టి, చాంగ్‌ఎంగ్‌ల జననం మామూలుగానే ఓ వింతగా బహుళ ప్రచారం పొందింది. కొందరు పల్లెప్రజలు 'ప్రపంచం త్వరలో అంతం కాబోతోందనడానికి శకునమే సయామీః కవలల జననం' అని భయపడ్డారు కూడా! ఈ వార్త అప్పటి సయాం దేశపు రాజు చెవులవరకూ వెళ్లింది. ఈ పుకార్లు విని ఆయన మొదట వాళ్ళిద్దరినీ చంపించాలని ఆలోచించినా, తర్వాత వారికి ఏ హానీ తలపెట్టకుండా వూరుకున్నాడు.

సయామీ కవలలు తమ జన్మస్థలమైన 'మెక్‌లాంగ్'కి పెద్ద ప్రచారం తెచ్చిపెట్టారు. వారిని చూసేందుకు దేశంలోని అనేక ప్రాంతాలనుంచి జనం వస్తుండేవారు. కొందరు డాక్టర్లు చాంగ్, ఎంగ్‌లని విడదీస్తే వేర్వేరు జీవితాలను గడపగలరని వారి తల్లి దండ్రులకి సలహాలిచ్చేవారు. కాని, వారి తల్లి అందుకు భయపడి, చాంగ్, ఎంగ్‌లని విడదీసి ప్రాణంతీసేకంటే, కలిసి బతకనివ్వడమే మేలంటూ డాక్టర్ల సలహాలను సైతం తోసిపుచ్చింది.

చాంగ్, ఎంగ్‌ల కుటుంబం నదిలో తేలియాడుతూవుండే ఓపడవలాంటి ఇంట్లో నివసించేది. నెలలు గడిచేకొద్దీ వాళ్లు పాకడం మొదలెట్టి, నడక అలవాటుచేసుకున్నారు. ఒకరినొకరు అంటుకుని వుండటంవల్ల మొదట్లో వారికి ఏమాత్రం కదలాలన్నా పెద్ద సమస్యగానే వుండేది. వాళ్లు పుట్టడం ఎదురెదురుగా అతుక్కుపోయి పుట్టారు. అందువల్ల వాళ్లు కదలాలంటే ఇద్దరూ ఒకేసారి ఒకరు వెనక్కి, మరొకరు ముందుకి కదలాలి. బిడ్డల అవస్థను గమనించిన తల్లి ఆ ఇద్దరి శరీరం బాగా సాగితే వాళ్లు స్వేచ్ఛగా తిరగగలుతారని తెల్సుకుంది. ఒకరికొకరు వీలైనంత ఎడంగా జరగడానికి ప్రయత్నించేట్టు వారికి అలవాటు చేసిందామె. అలా ఎంతోకాలం ప్రయత్నించిన మీదట వారిద్దరూ ఒకరిపక్కనొకరు నిలబడగలిగేలా వారిని కలిపివుంచిన శరీరం సాగిపోయింది.

చూడ్డానికి ఒకే పోలికల్తో కనబడినా వయసు పెరిగేకొద్దీ ఆ ఇద్దరి స్వభావాల్లో ఎవరి ప్రత్యేకత వారికున్నట్లు వెల్లడైంది. వాళ్లు ఒకేసారి కదలవలసివస్తే ఆజ్ఞాపించడం ఒకరివంతు అయితే అనుసరించడం మరొకరివంతు అయింది. చురుకుదనం, పౌరుష అధికంగాగల చాంగ్ ఏం చెబితే అలా నడుచుకోవడం ఎంగ్‌కి అలవాటైంది. వారిమధ్య ఏదైనా వివాదంవస్తే చివరకి చాంగ్‌దే పైచేయి అయ్యేది. వారిమధ్య అప్పుడప్పుడూ పోట్లాటలు వస్తుండేవి. ఒకసారి బాగా తన్నుకున్నారు కూడా. కాని, ఎక్కువగా ఒకరిపట్ల ఒకరు మమకారంతోనే మసలుకునేవారు. చాంగ్, ఎంగ్‌లు కదలికల్లో ఒకరినొకరు అనుసరించడం చూస్తే, ఎన్నో ఏళ్లుగా కలిసి నృత్యంచేయడం అలవాటైన జంట నృత్యకారుల్లా తోచేది చూసేవారికి. దీర్ఘకాలం కలిసివుండటంవల్ల వారిలో ఓ రకమైన సిక్స్త్‌సెన్స్ ఏర్పడింది. ఎవరికివారు రెండవవారి తదుపరి కదలికను ముందుగానే గ్రహించి ఏమాత్రం తేడా లేకుండా దానికనుగుణంగా ప్రవర్తించడం అలవాటయింది. చూసేవారికి అది ఒకరు రెండవవారి మనసు చదివి ప్రవర్తిస్తున్నట్టుగా కనబడేది.

సయామీ కవలల్లో చూపరులకు ఎక్కువ ఆసక్తిని కలిగించేది వారిని బంధించివుంచిన శరీరమే. ఎవరైనా ఆ శరీరాన్ని ఖచ్చితంగా మధ్యలో తాకితే ఆ స్పర్శ ఇద్దరికీ తెలిసేది. అలాకాక ఎవరో ఒకరివైపున తాకితే, వాళ్లుమాత్రమే ఆ స్పర్శను గ్రహించేవారు.

నదిపై నివసించడంవల్ల చాంగ్, ఎంగ్‌లు రోజంతా నీటిపైనే గడపాల్సి వచ్చేది. వాళ్లు ఓ చిన్న పడవను నడపడమే కాక నదిలో లోతుకు వెళ్లడం, ఈదడం, చేపలుపట్టడం నేర్చుకున్నారు. తామిద్దరూ అలా అతుక్కుని వున్నా వాళ్ల తోటి పిల్లలు చేసే పనులన్నీ చేస్తూ, వారితో సమానంగా ఆడుకునేవారు.

1819 నాటికి సయామీ కవలల కుటుంబంలో పిల్లలు పదిమంది అయ్యారు. ఆ ఏడాదే వారితండ్రి మరణించాడుఅప్పుడు చాంగ్,ఎంగ్‌లకి8ఏళ్లు. ఆవయసులోనేవాళ్లు కుటుంబపోషణకు శ్రమించవలసివచ్చింది. మొదట వాళ్లు కొంతకాలం కొబ్బరినూనె తయారుచేసి అమ్మారు. నదిలో తేలియాడే పడవల మార్కెట్‌లో తిరుగుతూ నూనె అమ్మేవారు. అటుపైన బాతులను పెంచి గుడ్లు అమ్మడం మొదలుపెట్టారు.

వారి జీవితంలో 1824 ఓ మహత్తరమైన సంవత్సరం. ఆ ఏడు కొత్తగా సింహాసనాన్ని అధిష్టించిన రాజు వారి గురించివిని, రాజభవనానికి వారిని తీసుకురమ్మని తన మనుషుల్ని పంపాడు. ఆ రోజుల్లో రాజునుంచి అలా కబురు రావడం ఓ ఘనతే! ఆ కవలలు రాజు కొలువులో ఏవిధంగా ప్రవర్తించాలో జాగ్రత్తగా నేర్చుకుని రాజు దగ్గరికి బైలుదేరారు.

రాజభవనంలో చాంగ్, ఎంగ్‌లు గొప్పగా అలంకరించిన ఓ పెద్ద మందిరంలో ప్రవేశించారు. అక్కడ రాజు ఓ ఉన్నతాసనంపై కూర్చుని వున్నాడు. కవలలు ఒకేసారి కిందకు వాలి రాజుకి సాష్టాంగనమస్కారం చేశారు. రాజు వారి గురించి, కుటుంబం గురించి, వారి బతుకుతెరువు గురించి అడిగి తెలుసుకున్నాడు. తర్వాత కవలలకి రాజభవనమంతా చూపారు. రాజుగారి భార్యలు ఏడువందలమందీ వారిని ఎంతో ఆసక్తితో చూసి బహుమతులిచ్చి సాగనంపారు. దాంతో చాంగ్, ఎంగ్‌లకి సయాం జాతీయ ఆస్తుల్లో ఓ భాగంగా గుర్తింపు లభించింది.

1824లో రాబర్ట్ హంటర్ అనే వర్తకుని కంటపడ్డారు సయామీ కవలలు. హంటర్ పడవలో నది దాటుతుండగా, కొద్దిదూరంలో సయామీయుల అద్భుత జానపద గాథల్లోని విపరీతాకారపు జంతువులా కన్పిస్తున్నప్రాణి ఒకటి నీటిలో ఈదుతుండటం చూశాడు. రెండు తలలూ, సాధారణంగా వుండేవాటికన్నా ఎక్కువ సంఖ్యలో అవయవాలు కల్గిన ఆ విచిత్ర ప్రాణి నీటిలోంచి బైటకు రాగానే హంటర్ అత్యంతాశ్చర్యానికి లోనయాడు. నిజానికి అతను అంతవరకూ చూసింది జంతువునుకాదు– నీటిలో ఈదుతున్న సయామీ కవలల్ని!

తర్వాత హంటర్ ఆ ఇద్దరినీ కలుసుకున్నాడు. వారు అతనితో స్నేహపూర్వకంగా మాట్లాడి, తమ గురించి చెప్పాక ఉన్న అవకరాన్ని లెక్కచేయకుండా సంతోషంగా బతుకుతున్నవారిని చూసి హంటర్ ముగ్ధుడయాడు.

తర్వాత హంటర్ వారి తల్లిని కలిశాడు. వ్యాపారంలో మంచి అనుభవజ్ఞుడైన హంటర్ ఆకవలల ద్వారా బాగావ్యాపారం

చేయవచ్చని గ్రహించాడు. వారికి వివిధ దేశాల గురించి వర్ణించి చెబుతూ వారిలో ఆసక్తిని ప్రేరేపించాడు. ఆ బాలురిద్దరినీ యూరప్ తీసుకెళ్ళేందుకు సయాం ప్రభుత్వ అనుమతికోసం కూడా ప్రయత్నించాడు గానీ, అది ఫలించలేదు. అయినా కార్య

సయామీ రాజుతో 'ఈ కవలలు అందుకు దోహదపడగల'రనిచెప్పి వారి పర్యటనకు అనుమతి సంపాదించాడు. ఆ విధంగా హంటర్, కాఫిన్‌లు 1829 ఏప్రిల్‌లో చాంగ్, ఎంగ్‌లతో సముద్రయానం ప్రారంభించారు.



సయామీ కవలలు : ఎంగ్, చాంగ్‌లు

దీక్షగల హంటర్ నిరాశపడకుండా సమయంచూసి తిరిగి ప్రయత్నించాలను కున్నాడు.

1829లో ఆ నిరీక్షణ ఫలించింది. మరో భాగస్వామి కాఫిన్‌తో కలసి వచ్చి చాంగ్, ఎంగ్‌ల తల్లిని కలిశాడు. ఆకవలల్ని తమతో పంపితే కొంత డబ్బిస్తామనీ, వారిని జాగ్రత్తగా చూసి కొన్నేళ్ళ తర్వాత తిరిగిఅప్పగిస్తామని చెప్పి ఆమెను ఒప్పించారు.

సయాం అప్పట్లో పాశ్చాత్యదేశాలతో సంబంధాలను మెరుగుపరుచుకోవాలని భావిస్తోంది. అది గ్రహించిన హంటర్,

వారి గమ్యస్థానమైన బోస్టన్ చేరు కోవడానికి పట్టిన 4 నెలల కాలంలో చాంగ్, ఎంగ్‌లు పట్టుదలతోఆంగ్లం మాట్లాడటం నేర్చుకున్నారు.

1829 ఆగస్టులో బోస్టన్ చేరుకుని అక్కడ వేలాదిమంది ప్రేక్షకులు పట్టే పెద్ద గుడారాన్ని అద్దెకు తీసుకుని కవలల గురించి ప్రచారం మొదలుపెట్టారు. ఆశించినట్టే ప్రదర్శనకి ప్రేక్షకులు విపరీతంగా వచ్చేవారు. ప్రతి ప్రదర్శనకీ

గుడారంలో కిక్కిరిసిపోయిన ప్రేక్షకులకి చాంగ్, ఎంగ్‌లు దర్శనమిచ్చేవారు. వారిని చూడ్డానికి 2 నుంచి 6 డాలర్లకు టికెట్ పెట్టారు.

వారిని చూసేందుకు సామాన్యులేకాక వైద్యవృత్తిలో పేరెన్నికగన్న డాక్టర్లు కూడా ఎంతో కుతూహలపడ్డారు. ఓ వైద్య కళాశాలలో ప్రొఫెసరైన జె.సి. వారెన్ వారిద్దరినీ పరీక్షించి, చాంగ్, ఎంగ్‌లని అతికించివున్న శరీరంలో నరాలు, ధమనులు, సిరలు వున్నట్టు చెప్పాడు. వారిలో ఒకరు చనిపోతే ఆ బంధంవల్ల రెండవ వారుకూడా త్వరలో మరణిస్తారని హెచ్చరించాడు.

తర్వాత చాంగ్, ఎంగ్‌లు ప్రొవిడెన్స్, ఫిలడెల్ఫియా మొదలగు నగరాలకు పయనించారు. అంతవరకూ జరిగిన ప్రదర్శనలలో చాంగ్, ఎంగ్‌లని వేదికపై నిలబెట్టి వారి గురించి వ్యాఖ్యాతలు ప్రేక్షకులకి చెబుతుండేవారు. కాని అలా వూరికే నిలబడి వుండటంచాంగ్, ఎంగ్‌లకివిసుగెత్తేది. దాంతో వాళ్లు కొన్ని విన్యాసాలను అభ్యసించి, వేదికపై చేయనారంభించారు. తమ శరీరాల్ని ఎటుపడితే అటు వంచడం, పిల్లిమొగ్గలు వేయడమేకాక, ప్రేక్షకుల్లోంచి ఓ స్థూలకాయుడిని పిలిచి, ఎలాంటి ప్రయాసలేకుండా వందడుగుల దూరం వరకూ మోసేవారు.

అక్టోబర్‌లో న్యూయార్క్ నుంచి నౌకలో ఇంగ్లండ్‌కి ప్రయాణమయ్యారు. లండన్‌లో 'ఈజిప్షియన్ హాల్' అనే ప్రసిద్ధ సభా మండపాన్ని అద్దెకుతీసుకుని చాంగ్, ఎంగ్‌ల ప్రదర్శనను మొదలుపెట్టారు. సయామీ కవలలు అతుక్కుని వుండటం వట్టి బూటకమని అక్కడ కొందరు ఆరోపించారు. వారి సందేహం తీర్చేందుకు నిర్వాహకులు, ప్రముఖ రచయితలు, శాస్త్రవేత్తలు, సర్జన్లు కొందరిని ఆహ్వానించారు. వారంతా విచిత్రంగా అతుక్కునివున్న కవలల్ని చూసి అబ్బురపడ్డారు.

30 మంది ప్రముఖులు సయామీ కవలల్లో ఎలాంటి బూటకం లేదని ఆతర్వాత సాక్ష్యమిచ్చారు. ఫలితంగా రాచకుటుంబానికి చెందినవారు కూడా ఈ కవలలను చూడ్డానికి వస్తూపోతుండేవాళ్లు.

లండన్‌లోని తేమ, పొగమంచుతో కూడిన వాతావరణానికి, అలవాటులేని విదేశీయులు ఏదో ఒకఅనారోగ్యం పాలవడం మామూలే. సయాం కవలలు అక్కడే మొదటిసారిగా మంచును చూశారు. ఆ వాతావరణం పడక వాళ్లు తీవ్రమైన జలుబు, గొంతునొప్పి, ఛాతీనొప్పులకు గురవగా జి.బి. బోల్టన్ అనే ప్రముఖ వైద్యుడిని కవలలకి 'పర్సనల్ డాక్టర్'గా నియమించారు. వైద్యసలహా ప్రకారం తోలు వెయిస్ట్ కోట్లు ధరించి, నిద్రించేటప్పుడు కప్పుకునేందుకు తోలు దుప్పట్లను వాడి కవలలు అనారోగ్యం నుంచి కోలుకున్నారు.

అప్పుడే డాక్టర్లకి సయాం కవలలపై పరీక్షలు జరిపే అవకాశం లభించింది. ఒకరోజంతా ఆ ఇద్దరికీ తినేందుకు వేర్వేరు ఆహారపదార్థాలను పెట్టి, వారి మలమూత్రాలను పరీక్షించారు. దాన్ని బట్టి కవలలిద్దరికీ జీర్ణావయవాలు విడివిడిగానే వున్నట్టు గ్రహించారు.

అప్పట్లో ఎక్స్‌రేని ఇంకా కనుక్కోలేదు. అయినా డాక్టర్లు కవలల్ని అతికించివుంచిన శరీరాన్ని కొలిచి,ఎంతగానో

 

పరిశీలించారు. కాని దాంట్లో ఖచ్చితంగా ఏమున్నదీ ఎవరూ చెప్పలేకపోయారు. సోదరులిద్దరినీ వేరుచేసేందుకు ఆ శరీరాన్ని విడదీయడంమాత్రం అతి ప్రమాదకర మని తేలింది.

ఓ నివేదిక ప్రకారం కవలలు అయిదడుగుల రెండంగుళాల పొడుగుతో (చాంగ్ ఒక అంగుళం పొట్టి) ఇద్దరూ కలిసి 180 పౌనుల బరువున్నారు. వారు అలా కలిసివున్నా తక్కిన దేహనిర్మాణం సక్రమంగా వున్నట్టు, సున్నితమైన, పరిశుభ్రమైన అలవాట్లతో వాళ్లు పరస్పరం సహకరించుకుంటున్నట్టు, తెలివితేటల్లో అధికమనీ, సంగీతమంటే ప్రాణంపెడతా రనీ పేర్కొన్నారు.

లండన్‌లో చాలాకాలం ప్రదర్శన లిచ్చిన మీదట కవలలు బ్రిటిష్ దీవులకి వెళ్లారు. అక్కడ 'స్వతఃసిద్ధంగా, పుట్టుక నుంచే కలిసివున్న 18ఏళ్ల విచిత్రమైన, అసాధారణమైన సయామీ కుర్రవాళ్లు'అని పేర్కొంటూ, 'వారి ప్రదర్శనను ఇంగ్లండ్ రాణి, రాచకుటుంబంలోని అనే కులు, యువరాజు, 10వ ఛార్లెస్, మరి అనేకమంది ప్రముఖులు చూసి తమ సంతృప్తిని వెల్లడించారు' అని ప్రకటనలు గుప్పించి ప్రచారం చేశారు.

బ్రిటన్‌లో 25 వందల మైళ్లు విస్తృతంగా పర్యటించాక చాంగ్, ఎంగ్‌లని ఫ్రాన్స్‌కి తీసుకెళ్లదలచారు. కాని, గర్భిణీ స్త్రీ ఏదైనా అసహ్యకరమైన దృశ్యాన్ని చూస్తే ఆ ప్రభావం గర్భంలోని శిశువుపై పడి, బిడ్డ ఏదో అవకరంతో జన్మిస్తుందని ఫ్రెంచివారి నమ్మకం. ఆ భయంతో కవలలకి ప్రవేశాన్ని నిరాకరించింది ఫ్రెంచి ప్రభుత్వం.

ఫ్రాన్స్‌లో ప్రవేశం లభించక పోయినా మిగిలిన యూరప్ ఖండమంతా కవలలకి ఘనస్వాగతం ఇచ్చింది. వాళ్లు అక్కడి పెద్దపెద్ద నగరాలన్నింటినీ పర్యటించారు. వారి ప్రదర్శన జరిగిన ప్రతిచోటా థియేటర్లు ప్రేక్షకులతో కిక్కిరిసిపోయేవి.

హంటర్ తన స్వంత వ్యాపార వ్యవహారాల్ని స్వయంగా నిర్వహించుకోవడానికని కెప్టెన్ కాఫిన్ నుంచి తనకు లాభదాయకమైన మొత్తాన్ని తీసుకుని, చాంగ్, ఎంగ్‌లని అతనికి వదిలిపెట్టేశాడు.

1831-32లో కాఫిన్‌తో పాటు కవలలు అమెరికాకు తిరిగొచ్చి ఆ దేశంలో విస్తృతంగా పర్యటించారు. ఫలితంగా కవలల పేర్లు యూరప్,అమెరికా ఖండాల్లో ఇంటింటా మార్మోగిపోయాయి.

చాంగ్, ఎంగ్‌లు చూడ్డానికి వినమ్రంగా కనబడినా పరిస్థితుల్ని బట్టి దురుసుగా కూడా వ్యవహరించేవారు. ఒకసారి అమెరికాలోని 'అలబామా' అనే చోట వారి ప్రదర్శన జరుగుతుండగా ఓ డాక్టరు వారిని కలిపివుంచిన శరీరాన్ని పరీక్షించాలన్నాడు. ప్రేక్షకులందరి ఎదుటా శరీరంపై ఆచ్ఛాదన లేకుండా నిలబడటం ఇష్టంలేని చాంగ్, ఎంగ్‌లు దానికి నిరాకరించారు. డాక్టరుకు కోపం వచ్చి,వాళ్లు అతుక్కుని వుండటం బూటకమనేశాడు. ఆ అసత్యారోపణకి కోపంతో మండిపడ్డ కవలలు డాక్టర్‌ని కొట్టి, నేలకరిపించారు. అందుకుగాను అరెస్ట్ అయి, ఇంకెప్పుడూ అలా చేయమన్న హామీతో, 350 డాలర్ల ధరావతు కట్టి విడుదలయారు.

మరో సంఘటనలో, ఫిలడెల్ఫియాలో చాంగ్, ఎంగ్‌లతో కరచాలనం చేస్తూ ఓ

వ్యక్తి చాంగ్ చేతిని గట్టిగా నొక్కేశాడు. అది భరించలేక బదులుగా చాంగ్ కోపంతో అతని చేయి మెలిపెట్టాడు. దాని కతను తనపై దౌర్జన్యం చేసినందుకు చాంగ్‌ని అరెస్ట్ చేయాలని మెజిస్ట్రేట్‌కి ఫిర్యాదు చేశాడు. కాని, "ఎంగ్‌ని కూడా కస్టడీలోకి తీసుకోకుండా చాంగ్‌ని ఒక్కడినే అరెస్ట్ చేయడం సాధ్యంకాదు గనుక నిర్దోషి అయిన ఎంగ్‌ని కూడా అరెస్టు చేస్తే అతనా తప్పుడుచర్యకి కేసు పెట్టగలడు'' అని మెజిస్ట్రేట్ అందుకు నిరాకరించాడు.

వేదికపై లేని సమయంలో తమకేసి ఎవరైనా పరిశీలనగా చూడటం చాంగ్, ఎంగ్‌లకి నచ్చేది కాదు. ఇతరులతోపాటు డిన్నర్ ఆరగిస్తుండగా, తాము తినే పద్ధతిని ఎవరైనా గమనిస్తున్నట్టు గుర్తిస్తే, తినడం మధ్యలోనే ఆపేస్తారు. తమను చూసేవారిని నిరుత్సాహపరచేందుకు, తమ చేతుల్లోని కత్తులు, ఫోర్కులను కిందపెట్టేసి మెదలకుండా కూర్చుంటారు. దాన్నిబట్టి ఆ వ్యక్తి తన తప్పును గ్రహించి దృష్టి మరల్చుకుంటాడు.

కవలలు వికలాంగుల్ని దయతో చూసేవారు. వాళ్లు ఓ ప్రదర్శన ఇస్తున్నప్పుడు, ప్రేక్షకుల్లో కాళ్లూ, చేతులూ లేని ఓ వ్యక్తి కూర్చుని వుండటం గమనించారు. అతనికంటే తామెంత అదృష్టవంతులో గ్రహించి, సానుభూతిగా అతనికో బహుమతి ఇచ్చి పంపారు. మరోసారి, తమ ప్రేక్షకుల్లో ఒక ఒంటికంటి వ్యక్తిని చూసి ఆ థియేటర్ మేనేజరుని పిలిచి, అతను ఒకే కంటితో చూస్తున్నందువల్ల అతనికి టిక్కెట్టు డబ్బులు సగం వాపసుచేయమని కోరారు.

చాంగ్, ఎంగ్‌లు అప్పుడప్పుడూ కొందరిని తమాషా చేసి వినోదిస్తుండేవారు కూడా. ఒకసారి వాళ్లు రైలు ప్రయాణం చేసేటప్పుడు చాంగ్ ఒక్కడే టికెట్ తీసుకున్నాడు. వారిద్దరూ రైల్లో కూర్చుని తమను అతికించివున్న శరీరం కనబడకుండా ఓ వస్త్రం కప్పుకున్నారు.

చెకింగ్‌కి కండక్టర్ వచ్చినప్పుడు చాంగ్ తను కొన్న టికెట్ చూపాడు. ఎంగ్ టికెట్ కొనలేదని చెప్పాడు. టికెట్ డబ్బు చెల్లించమని లేదా రైలు దిగమని చెప్పాడు కండక్టర్.

"నేను డబ్బులివ్వను. నా సోదరుడు రైలు దిగితే నేనూ దిగిపోతాను'' అని వాదించాడు ఎంగ్. దానికి చాంగ్ ఒప్పుకోకుండా, "నా దగ్గిర టిక్కెట్ వుంది గనుక నేను దిగను" అన్నాడు.

ఎంగ్‌ని బలవంతంగా రైలుదింపేందుకు కండక్టర్ ఓ రైల్వే ఉద్యోగిని పిలిచాడు. అతను చాంగ్, ఎంగ్‌ల దగ్గరికొచ్చి నోరు తెరిచేలోగానే వాళ్లు తాము కప్పుకున్న వస్త్రాన్ని తొలగించారు. దాంతో, అంతవరకూ తమాషా చేసింది ప్రపంచ ప్రఖ్యాతమైన సయామీ కవలలని రైల్వే ఉద్యోగులకి, ఇతర ప్రయాణీకులకి తెలిసి నవ్వుకున్నారు. అప్పుడు ఎంగ్ తన టిక్కెట్ డబ్బు చెల్లించేశాడు!

కెప్టెన్ కాఫిన్ అప్పటిదాకా ప్రదర్శనలో వసూలైన మొత్తంలో చాంగ్, ఎంగ్‌ల భాగమెంతో స్పష్టం చేయలేదు. వారి ద్వారా ఆర్జించిన ధనంలో అధిక శాతం అతనే కైంకర్యం చేసేవాడు. చాంగ్, ఎంగ్‌లు అది గ్రహించి, తమకింకా రాబట్టుకునే హక్కు వుందని తెల్సుకున్నారు.




1832 మేనాటికి చాంగ్, ఎంగ్‌లకి 21 ఏళ్లు వచ్చాయి. చట్టప్రకారం వాళ్లు మేజర్లుగా పరిగణింపబడతారు. దాంతో వాళ్లు కాఫిన్‌తో 'తమ మధ్య ఒప్పందం ముగిసే సమయం వచ్చిందని, తామిద్దరూ స్వతంత్రంగా బతకాలని వాంఛిస్తున్నామని' చెప్పారు.

కాని, కాఫిన్ అందుకు సమ్మతించలేదు. అతను 'వాళ్లు ఏడేళ్లపాటు తనతో పర్యటించేందుకు సయాం ప్రభుత్వంతో ఒప్పందం కుదుర్చుకున్నట్టు. వారి తల్లి భయంతో అడ్డు చెప్పగలదని పర్యటన రెండున్నర ఏళ్ళేనని ఆమెతో చెప్పినట్టు' తెలియజేశాడు. ఇది కవలలకు నచ్చలేదు. ఇదంతా హంటర్‌కి లేఖ రాసి, సయాం వెళ్లిపోయేందుకు ప్రయత్నం మీద ప్రయత్నం చేయసాగారు. కాని, కాఫిన్‌వల్ల వారి ప్రయత్నాలేవీ ఫలించక అమెరికాలో చాలాకాలం గడపవలసి వచ్చింది.

ఆ తర్వాత చాంగ్, ఎంగ్‌లు 1835లో పి. టి. బార్నంతో కలిసి ప్రదర్శనలిచ్చారు. సయామీ కవలల్లా ప్రత్యేకమైన దేహ నిర్మాణం కలిగిన అనేకమందితో ప్రదర్శనలు నిర్వహించినవాడిగా పి. టి. బార్నం ప్రసిద్ధికెక్కాడు. సయామీ కవలలు పి. టి. బార్నంతో కల్సివున్నది తక్కువ కాలమే!

తర్వాత వాళ్లు స్వంతంగా ప్రదర్శనలివ్వడం మొదలుపెట్టారు. ఓ గుర్రాన్నీ, బగ్గీనీ కొని ఆ గుర్రపు బగ్గిలో దేశంలోని అనేక ప్రదేశాలకి తిరుగుతూ ప్రదర్శనలిచ్చేవారు. వారి ప్రదర్శనలకి టిక్కెట్ వెల 50 సెంట్లు. ఇదేకాక, కవలల జీవిత వివరాలు, సాహసాలు, వారిని పరీక్షించిన ప్రముఖ డాక్టర్ల



భార్యలతో ఎంగ్, చాంగ్‌లు : వారి 22 మంది సంతానంలో ఇద్దరు పిల్లలు

వారిలో కనుగొన్న విశేషాలన్నింటినీ ప్రచురించిన చిన్న పుస్తకం అమ్మకాల వల్ల మరికొంత ఆదాయం వస్తుండేది.

1836లో సయామీ కవలలు తిరిగి యూరప్‌కి చేరుకున్నారు. అక్కడ ఒక నగరం నుంచి మరో నగరానికి తిరుగుతూ ప్రదర్శనలివ్వసాగారు. ఆ విధంగా జీవించడం ఎంతో లాభదాయకమే అయినా ప్రయాసపూరితంగా కూడా వుండేది.

1839 నాటికి చాంగ్, ఎంగ్‌లకి 28 ఏళ్లు నిండాయి. అప్పటికి 10 ఏళ్లుగా ప్రదర్శనలిస్తున్న వాళ్లు 60 వేల డాలర్లు కూడబెట్టారు. ప్రదర్శనలతో విసిగిపోయిన వారిలో ఏదో ఒకచోట ప్రశాంతంగా స్థిరపడాలనే కోరిక పెరిగి ఉత్తరకెరోలినా రాష్ట్రంలోని 'వైక్స్‌బోరో' అనే చిన్న పట్టణంలో స్థిరపడేందుకు నిర్ణయించుకున్నారు. అక్కడ చెక్కలతో నిర్మించిన చిన్న ఇంట్లో ఉంటూ, వ్యవసాయం చేస్తూ జీవించసాగారు. ఆ జీవన విధానం వారికి నచ్చింది. ఒక సంవత్సరం తిరిగేసరికి వాళ్లా దగ్గిరలోని 'ట్రాప్ హిల్' అనే చోట 110 ఎకరాల భూమి కొనడమే కాక ఇంటిని కూడా నిర్మించుకున్నారు.

ఉత్తరకెరోలినా రాష్ట్రంలో స్థిరపడ్డాక చాంగ్, ఎంగ్‌ల వేషభాషలు మారిపోయి వాళ్లు అమెరికన్లలానే కనబడసాగారు. 'వైక్స్ బోరో'లో నివసించడం మొదలు పెట్టిన కొద్దికాలానికే, అక్టోబరులో అమెరికన్ పౌరులుగా మారేందుకు 'వైక్స్ సుపీరియర్ కోర్ట్'కి అర్జీ పెట్టుకున్నారు. వారికి వెంటనే ఆ దేశ పౌరసత్వం లభించింది.అయితే వారికి ఇంటిపేరు లేదు. కనుక రిజిస్టర్‌లో 'సయామీ కవలలైన చాంగ్, ఎంగ్' అని పేర్కొన్నారు.

చాంగ్, ఎంగ్‌ల ఇంటికి కొద్దిదూరంలో డేవిడ్ యేట్స్ అనే రైతు నివసించేవాడు. అతనికి 9 మంది కుమార్తెలు. వారిలో అడిలాయిడ్, సారాఎన్‌లతో చాంగ్,ఎంగ్‌లకి పరిచయం పెరిగింది. అప్పటికి కవలల వయసు 30 దాటింది. ఆ యువతుల వయసు పంతొమ్మిది, ఇరవయి ఏళ్ళు.

1843 ఏప్రిల్‌లో చాంగ్‌కి అడిలాయిడ్‌తోనూ, ఎంగ్‌కి సారాఎన్‌తోనూ వివాహం జరిగింది. పెళ్ళికి ముందు చాంగ్, ఎంగ్‌లు ఆపరేషన్‌ద్వారా విడిపోవాలనుకున్నారు. కాని, డాక్టర్లు అది ప్రాణానికే ప్రమాదమని హెచ్చరించడంతో ఆపరేషన్ జరగలేదు. పెళ్ళయ్యాక రెండు జంటలూ కవలల ఇంట్లో జీవితంలో స్థిరపడ్డారు. అందరిలానే వారి వైవాహిక జీవితాలు ఫలప్రదమయినాయి.

చాంగ్‌కి ఏడుగురు కూతుళ్ళు, ముగ్గురు కొడుకులు, ఎంగ్‌కి అయిదుగురు కూతుళ్లు, ఏడుగురు కొడుకులూ కలిగారు. 22మంది పిల్లలూ మామూలుగానే పుట్టారు. కాని, చాంగ్ కూతురు, కొడుకుల్లో ఇద్దరు మూగ చెవిటివాళ్ళు. 1850లో చాంగ్, ఎంగ్‌లు తమపిల్లల్ని బాగా చదివించడానికి డబ్బు చాలా అవసరమని గుర్తించి, తిరిగి ప్రదర్శనలివ్వసాగారు.

ఏళ్లు గడిచేకొద్దీ, ఒకే ఇంట్లో అంత పెద్ద కుటుంబం వుండటం అసౌకర్యమవుతుందని కవలలు గుర్తించారు. ఒక మైలు దూరంలో వున్న రెండుచోట్ల స్థలాలు కొని, రెండు ఇళ్లు కట్టించారు. చాంగ్, ఎంగ్‌లు ఒక్కొక్క ఇంట్లోనూ 3రోజుల చొప్పున వుండేవారు. అనారోగ్యంపాలైనా ఈ నియమం మారేదికాదు. కవలలు ఎంగ్ ఇంట్లో వున్నప్పుడు చాంగ్ అతనికి బద్ధుడై వుండేవాడు. చాంగ్ ఇంట్లో వుంటే చాంగ్

యజమానిలా వ్యవహరించేవాడు.

చాంగ్, ఎంగ్‌లు పెద్దవైన తమ కుటుం బాలను పోషించడానికయి మళ్ళీ కొంత కాలం పి.టి.బార్నంతో కలిసి ప్రదర్శన లిచ్చారు. ఈసారి బ్రిటన్‌లోని ప్రధాన మయిన నగరాలలో వారి ప్రదర్శనలు జరిగాయి. ఓ సంవత్సరకాలంపాటు ఆ ప్రదర్శనలు సాగాయి.

లండన్‌లో చాంగ్, ఎంగ్‌లు 'రాయల్ కాలేజీ ఆఫ్ సర్జన్స్'కి చెందిన సర్ విలియమ్ ఫెర్గూసన్‌ని కలిసి శస్త్రచికిత్స ద్వారా విడిపోవాలనే తమ కోరికను వెలి బుచ్చారు. అప్పటికి చాంగ్, ఎంగ్‌ల వయసు 55 ఏళ్లు దాటింది. కనుక వాళ్ళు ఆ వయసులో విడిపోవడం మంచిదికాదని సర్ విలియం సలహా ఇచ్చాడు.

1874 జనవరిలో కవలలు చాంగ్ ఇంట్లోవున్నప్పుడు, చాంగ్‌కి 'బ్రాంకైటిస్' తీవ్రంగా వచ్చింది. వారి డాక్టరయిన 'హోలింగ్స్‌వర్త్' వైద్యంతో చాంగ్ కొంచెం కోలుకున్నట్టు కనబడ్డాడు. అంతలో ఎంగ్ ఇంటికి వెళ్ళాల్సిన రోజు వచ్చింది. ఎంగ్‌కి ఆ పరిస్థితుల్లో ఇల్లు మారడం ఇష్టంలేక వాదించినా చాంగ్ అతన్ని బలవంత పెట్టాడు. శీతాకాలం కాబట్టి వాతావరణం చెమ్మగా వుంది. అయినా వాళ్ళు మామూలుగానే పైన కప్పులేని గుర్రపు బగ్గీలో ప్రయాణించి ఎంగ్ ఇంటికి చేరు కున్నారు.

1874 జనవరి 17 రోజు రాత్రి కవలలు పడుకున్న కొంతసేపటికి చాంగ్ లేచిపోయి ఎంగ్‌ని లేపి, తనకు శ్వాస కష్ట మవుతోందని చెప్పాడు. ఇద్దరూలేచి, చలి తగ్గడానికి మంట వేసుకున్నారు. కొన్ని గంటలపాటు మంటదగ్గిరే కూర్చున్నారు. ఎంగ్‌కి క్రమంగా నిద్ర ఆవహించడంతో అతనితోపాటు చాంగ్ కూడా వెళ్ళి పడు కున్నాడు.

ఎంగ్ అర్థరాత్రి నిద్రలో హఠాత్తుగా ఉలికిపడుతూ లేచాడు. మామూలుగా చాంగ్ గురక వినబడలేదు. అతన్ని కదప బోతే కదలలేదు.

ఎంగ్‌కేమీ అర్థంకాక భయంతో కేకలు పెట్టాడు. కేకలు విని అక్కడికొచ్చిన ఎంగ్ కొడుకు చాంగ్‌ని పరీక్షించి, అతను చనిపోయినట్టు తెలిపాడు. ఎంగ్ భయ విహ్వలంగా తనకూ మరణం సమీ పించిందన్నాడు. ఆ గొడవకి కుటుంబం లోని అందరూ మేలుకున్నారు.

ఎంగ్ కొడుకుల్లో ఒకరు వెంటనే అక్కడికి మూడుమైళ్ళ దూరంలో వుంటున్న డాక్టర్ హోలింగ్స్‌వర్త్ కోసం వెళ్ళాడు. కాని, అతను డాక్టరుతో తిరిగి వచ్చేటప్పటికి ఎంగ్ ప్రాణాలు కోల్పోయాడు.

రెండువారాల తర్వాత కవలల మృత దేహాలు ఫిలడెల్ఫియాలోని జెఫర్‌సన్ వైద్య కళాశాలకి పంపబడ్డాయి. చరిత్ర ప్రసిద్ధు లయిన సయామీ కవలలపై మరణానంతర పరీక్ష జరిపేందుకు అక్కడి డాక్టర్లు ఎంతో ఉత్సుకతతో ఎదురుచూస్తున్నారు. వారి మరణానికి కారణమేమిటనేదేకాక వాళ్ళు ఎంత దగ్గరగా అతుక్కుని వున్నా రనేది తెలుసుకోవడం కూడా డాక్టర్ల కోరిక.

కవలలపై మరణానంతర పరీక్ష జర పడం వారి కుటుంబ సభ్యులకి ఇష్టంలేక పోయినా డాక్టర్లు కష్టపడి వారిని ఒప్పిం చారు. మెదడులో గడ్డ కట్టుకోవడంవల్ల చాంగ్ మరణించినట్టు డాక్టర్లు నిర్ణ యించారు. ఎంగ్ మరణానికి కారణం తెలుసుకోవడం కష్టమైంది. 'అతను ఎంతో కలవరపాటుకు లోనయి ఆ భయంవల్ల మరణించా'డని చివరికి నిర్ధారించారు.



# చతుర 


## భీమ బలుడు




**35** ఏళ్ల బ్రహ్మచారి జయంత్‌ని భీమ బలుడని చెప్పుకోవచ్చు. 115 కిలోల బరువుగల అతను 500 కిలోల బరువైన రాయిని తన ఛాతీతో పగలగొట్టగలడు. 28 హార్స్ పవర్‌గల రెండు ఎంబాసిడర్ కార్లను ఒక్క చేతితో ఆపగలడు. పెద్ద ఇనుప దూలాలను వంచగలడు. ఇత్తడి పళ్లాలను విరిచి, గ్లాసులను చేత్తో నుగ్గు నుగ్గు చేయగలడు. నమ్మశక్యంకాని విధంగా తన ఛాతీపైనుంచి జీపును నడిపించుకోగలడు.

జయంత్ వందకు పైగా మల్లయుద్ధ పోటీలలో పాల్గొన్నాడు. అతనా పోటీలలో ప్రముఖ మల్లయుద్ధయోధులైన పంజాబ్ కేసరి, టైగర్ సబూ సింగ్, టైగర్ అజాద్‌లను ఓడించాడు. గురుకుల మహా విద్యాలయకు చెందిన ప్రొఫెసర్ వేద ప్రకాష్ శాస్త్రి అతను ఈ వృత్తిలోకి వచ్చేందుకు ప్రోత్సహించాడు.

ఉత్తర ప్రదేశ్‌లోని షాజహాన్‌పూర్‌లో జరిగిన ఓ ఎగ్జిబిషన్‌లో జయంత్ జీవితంలో మర్చిపోలేని ఓ దుర్ఘటన సంభవించింది. ఎగ్జిబిషన్‌లో తన ఛాతీపై ట్రాక్టర్‌ను నడిపించుకునే ప్రదర్శన ఇస్తుండగా డ్రైవర్ కొత్తవాడు కావటంతో జయంత్ ఛాతీమీదకు ట్రాక్టర్‌ని నడిపించినప్పుడు అతని ముఖం బాగా ఎర్రబడటం చూసి, అతను చనిపోయాడని భయపడ్డాడు. దాంతో డ్రైవర్ ట్రాక్టర్ అలాగే ఆపేసిపారిపోయాడు. ఆ కొద్దినిముషాలలో జయంత్ చావుబతుకుల మధ్య వేలాడాడు.

డ్రైవర్ ట్రాక్టర్‌ని వదిలేసి పారిపోయాడని గుర్తించిన తక్షణమే జయంత్ బలమంతా ఉపయోగించి ఆ ట్రాక్టర్‌ని పక్కకు తోసేశాడు. ఇదంతా చూస్తున్న వెయ్యిమంది ప్రేక్షకులకి అతనలా చేసే వరకూ దిక్కుతోచలేదు.

భారతదేశంలోని అనేక నగరాల్లో

ప్రదర్శనలివ్వడమే కాక నేపాల్‌లో కూడా జయంత్ ప్రదర్శనలిచ్చాడు. 1968లో ఉత్తరప్రదేశ్‌లోని శుక్రతాల్‌లో మల్లయుద్ధ పోటీలో గెలిచిన జయంత్‌ని 'ఆధునిక భీముడు' అనే బిరుదుతో రాష్ట్రపతి సత్కరించారు.

ప్రస్తుతం జయంత్ 'కలాల్‌ఘటి' అనేచోట 'గురుకుల మహావిద్యాలయం' అనే ఆశ్రమ పాఠశాలను స్థాపించి నడుపుతున్నాడు. అక్కడ 6 నుంచి 25 ఏళ్ళ మధ్య వయసుగల 75 మంది విద్యార్థులకి పూర్వకాలపు 'గురుకులం' పద్ధతిలో విద్యాబోధన జరుగుతుంది. జయంత్ తన ప్రదర్శనలపై వచ్చే ఆదాయంతో ఆ గురుకులాన్ని నడిపిస్తున్నాడే తప్ప ప్రభుత్వం నుంచి ఏవిధమైన గ్రాంటూ పొందడం లేదు.

## కన్నీళ్ల ఔషధం!

ఏదైనా తీవ్రమైన మానసిక, శారీరక బాధలకు గురైనప్పుడు ఎవరికైనా ఏడుపు రావడం సహజమే! ఏడుపు రోగ నివారణ చేయకపోవచ్చు. కాని, ఆయా బాధల నుంచి ఉపశమనం లభించేట్టు చేస్తుంది.




ఏడుపు అనేక రకాల మనోరుగ్మతలను నయంచేసిన దృష్టాంతాలున్నాయి. అదే విధంగా కన్నీళ్ళను అణచుకుంటే అది అనేక మానసిక రుగ్మతలకు కారణమైన సందర్భాలూ వున్నాయి.

చాలామంది పురుషులు ఏడుపు మగవారికి తగదు, పెద్దమనిషి తరహా కాదు, అనాగరీకం, చిన్నతనమనే అభిప్రాయాలతో కన్నీళ్ళను నిగ్రహించుకుంటారు. కాని, ఆవిధంగా కన్నీళ్లను ఆపడం ద్వారా భవిష్యత్తులో తాము అతి తీవ్రమైన మనో రుగ్మతలకు గురికానున్నట్టు గుర్తించరు. ప్రియమైన వ్యక్తుల మరణం లాంటి సందర్భాలు ఎవరికైనా కన్నీళ్లు రప్పిస్తాయి. అప్పుడు వెంటనే ఏడ్చేయడం చాలా మంచిది. బలవంతంగా ఆపుకుంటే నాడీ మండలం పనిచేయకపోవడం లాంటి ప్రమాదాలు జరగవచ్చు.

అనేకమంది ప్రపంచ ప్రఖ్యాతి చెందిన నాయకులు, గొప్పవాళ్లు కూడా తీవ్రమైన బాధను ఎదుర్కొన్నప్పుడు విపరీతంగా కన్నీరు కార్చిన సందర్భాలు ఉన్నాయి. ప్రముఖ తత్వవేత్త, రచయిత థామస్ కార్లయిల్ తన భార్య మరణించినప్పుడు వలవలా ఏడ్చాడు!

విన్‌స్టన్ చర్చిల్‌కి 'రాతి గుండె మనిషి' అనే పేరుంది. అలాంటివాడే యుద్ధం వల్ల జరిగిన జననష్టాన్ని, వినాశనాన్ని చూసి పసిపిల్లాడిలా ఏడ్చాడు. యుద్ధం జరుగుతున్న సమయంలో ఆయనకో మనవడు కలిగాడు.

ఆ బిడ్డను చూసి, "నువ్వు ఈ దరిద్రపు యుద్ధం మధ్యలోనే పుట్టాలా?" అని బాధపడ్డాడట.

కన్నీళ్లు కార్చినప్పుడు ఆ వ్యక్తి శరీరంలో వారికి మంచి చేసే అనేక మార్పులు జరుగుతాయి. ఏడుపు శరీరం లోని సున్నితమైన నరాలకు ఉపశమనం కలుగజేస్తుంది. శరీరానికి అవసరమైన దానికంటే ఎక్కువగా ఆక్సిజన్‌ని అందించి, ఊపిరితిత్తులకు సంబంధించిన పలు వ్యాధులను నయంచేస్తుంది. జీర్ణ శక్తిని మెరుగుపర్చి, శరీరంలో విష సంబంధమైన పదార్థాలేమన్నా వుంటే వెలికి పోయేట్టు చేస్తుంది.

ఆందోళన, దుఃఖాల వల్ల రక్తపోటు వస్తుంది. దీని ప్రభావం మనిషి మెదడు, శరీరాలపై పడుతుంది. రక్తపోటు పెరిగితే గుండెజబ్బు లొచ్చే అవకాశముంది. ఏడుపు వల్ల వీటినుంచి కొంతవరకూ తప్పించుకోవచ్చు. పైగా ఏడుపు శరీరం లోని కొలెస్టరాల్ శాతాన్ని తగ్గించేందుకు దోహదం చేస్తుంది.

మనసు ఆందోళనలో చిక్కుకున్న మనిషి ఏం చేయాలో తెలీక సిగరెట్లు, మాదక ద్రవ్యాలకు అలవాటుపడతాడు. ఒక్కొక్కప్పుడు పరిస్థితుల్ని ఎదుర్కోలేక నిద్ర మాత్రలతో విశ్రాంతి లోకి జారుకునేందుకు ప్రయత్నించవచ్చు. కొందరైతే ఆందోళనను భరించలేక వేశ్యల దగ్గరికి కూడా వెళుతుంటారు. వీటివల్ల ఆరోగ్య నాశనం, ధన నష్టమే తప్ప మరేమీ జరగదు. వాటి బదులు ఆందోళన నుంచి విముక్తి పొందేందుకు వీలైనంత ఏడ్వటమే మంచి పద్ధతి.

ఏడుపు కళ్లకు మంచి ఎక్సర్‌సైజు లాంటిది. ఏడుపుతో కల్మషమంతా కొట్టుకుపోయి కళ్లలోకి మెరుపు వస్తుంది. ఏడుపు అల్సర్, రక్తపోటు, హృదయ సంబంధమైన రోగాల్ని నివారిస్తున్నట్టు కూడా శాస్త్రవేత్తలు నిరూపించారు!

## 'ఆమా' మహిళలు



సముద్ర అంతర్భాగంలోంచి ముత్యాలన సేకరించడం ఏమంత తేలికైనపనికాదు అది బలిష్టంగావుండే పురుషులకికూడా సులభసాధ్యంకాని కార్యం. భయంకర మైన షార్కు చేపలు, పదునైన మొనలు తేలివుండే రాళ్లగుట్టలు, విషపూరితమైన పాములు, పాకుడురాళ్లు, వృక్షకోటితో అడుగడుగునా అపాయాలతో కూడిన సముద్రంలో ముత్యాల సేకరణ చేయాలి. ముత్యంవుండే ఓ రకపు నత్తను గుర్తించే నేర్పువుండాలి. ఈ కష్టాలను అధిగమించి కొందరు జపానీయ మహిళలు తరతరా లుగా ఈ ముత్యాల సేకరణ వృత్తిలో కాకలుతీరివున్నారు. వారిని సరదాగా

'జలగంధర్వులు' అంటారు. జపాన్‌లో వారికి 'ఆమా'లనేపేరు వాడుకలోవుంది. 'ఆమా'లకు ముత్యాల సేకరణ వంశ పారంపర్యంగా వచ్చిన వృత్తి. వారు ముత్యాల సేకరణేకాక 'అబాలెన్' అనే రకపు చేపల్ని, సముద్ర అగాథాల్లో దొరికే ఇతర చేపల్ని కూడా పడుతుంటారు.

ముత్యాల సేకరణ స్వల్పకాలంలో నేర్చుకునే విద్యకాదు. ఆ వృత్తిని దృఢ దీక్ష, ఓర్మిలతో కొన్నేళ్లపాటు నేర్వవలసి వుంటుంది. 'ఆమా' ఆడపిల్లలు 10ఏళ్ల లేతవయసులో శిక్షణపొందడం ప్రారంభించి 19 ఏళ్ల వయసుకి ముత్యాల సేకరణలో నిపుణులైపోతారు.వాళ్లుసముద్రంలో 25 అడుగుల లోతుకి మునిగి సేకరణానంతరం పైకి వస్తారు. నిశ్చల సముద్రంలోనూ, తుఫాను సమయంలోనూ పనిలో ఒకే రీతిలో వుండగలిగేట్టుగా వారికి శిక్షణ ఇస్తారు.

ముత్యాల సేకరణ ఒక తరంనుంచి మరో తరానికి వంశపారంపర్యంగా సంక్రమిస్తుంది. సాధారణంగా తల్లి తన కుమార్తెలకు ఈ వృత్తిలో శిక్షణ ఇస్తుంది. వారికి ఆదాయం తెచ్చిపెట్టే మార్గం ఇదొక్కటే! 'ఆమా' మహిళలు గర్భిణీగా వున్నకాలంలో మాత్రం ముత్యాల సేకరణకి వెళ్ళకుండా విశ్రాంతి తీసుకుంటారు. కాన్పు అయ్యాక వారు ఇనుమడించిన వుత్సాహంతో తిరిగి ముత్యాలు సేకరిస్తారు. 'ఆమా' మహిళలలో ఎక్కువమంది 50 ఏళ్ళు పైబడ్డవాళ్ళే అయినా, ఎంతో చురుకుగా వుంటారు. వాళ్ళ వయసు ఎంత ఎక్కువైతే గిరాకీ అంత ఎక్కువ. సముద్రపులోతుపాతుల్ని బాగా అర్థంచేసుకునేందుకు వారికి అనుభవం తోడ్పడుతుంది. కనుక అనుభవం ఎక్కువగల 'ఆమా' మహిళలకి ఎప్పుడూ గిరాకీ వుంటుంది.

'ఆమా' మహిళల శరీరాకృతి కూడా ఈ వృత్తికి అనుగుణంగా వుంటుంది. సంవత్సరాల తరబడి సముద్ర వాతావరణానికి అలవాటుపడటం వల్ల వారి శరీరం దృఢంగా రూపొందుతుంది. వారి ఊపిరితిత్తులు విశాలంగా ఉంటాయి. కాళ్ళు, భుజాలు అతి బలిష్టంగా వుంటాయి. జపానీయ పురుషులెవరూ ముత్యాల సేకరణకి సాహసించరు. ఎందుకంటే జపానీయ మహిళలే ఈ వృత్తికి తగ్గట్టు వుంటారు. వారి శరీరంలో ఉండే మంద పాటి కొవ్వు పొర వంట్లో వేడి బైటకు పోకుండా ఆపుతుంది.

'ఆమా' స్త్రీలు సముద్ర లోతుల్లోకి వెళ్ళేటపుడు వాడే దుస్తులు సాంప్రదాయ బద్ధంగా వుంటాయి. అవి శతాబ్దాల అనుభవంతో ఆవిధంగా రూపొందించినవి. కంఠాన్ని పూర్తిగా కప్పేసే పొడుగు చేతుల చొక్కాలను, మినీ స్కర్టులను ధరిస్తారు. దానికోసం విధిగా తెల్లటి బట్టలనే కుట్టిస్తారు. తెలుపు రంగండే గిట్టని, హానికరమైన షార్క్ చేపల వంటివి తెల్లటి దుస్తుల్లోవున్న 'ఆమా' మహిళలకు దూరంగా వుంటాయి. వాళ్ళు ముక్కును కూడా కప్పేసేంత పెద్ద గాగుల్స్ పెట్టుకుంటారు. దానివల్ల నీళ్ళలో స్పష్టంగా చూడగలుగుతారు.

'ఆమా' మహిళల్లో రెండు వర్గాలు వున్నాయి. అందులో 'కచిదో' అనే వర్గం వాళ్ళు ఎవరికివారే విడివిడిగా ముత్యాల సేకరణ చేస్తారు. 'ఫ్యూనదో' వర్గానికి చెందినవాళ్ళు గుంపులుగా పడవలలో సముద్రంలోకి వెళతారు.

ఒంటరిగా సముద్రంలో మునిగే

'కచిడో' యువతి నడుముకి కట్టుకున్న పొడుగాటి తాడుకి కట్టిన ఒక చెక్కతొట్టె నీటిపై తేలుతుంటుంది. ముత్యాలు గల నత్తలను పైకి తెచ్చి ఆ తొట్టెలో వేస్తారు. అవసరమైనప్పుడు విశ్రాంతి తీసుకునేందుకు కూడా ఆ తొట్టె వుపయోగిస్తుంది. అది పొరపాటునైనా నీటిలో మునగని విధంగా వుంటుంది. కచిడో యువతుల దగ్గర నత్తలను కోసేందుకు, అబాలెన్ చేపలను వేటాడేందుకు ఓ కొక్కెపు ఆకారంలోని కత్తి వుంటుంది. సముద్రంలో 20 నుంచి 25 అడుగుల లోతుకి వెళతారు.

'ఫ్యూనడో' మహిళలతోపాటు వారి భర్తలు కూడా సముద్రంలోకి వెళతారు. ఈ మహిళలు డైవింగ్‌లో అత్యంత నిపుణులు. తమ భర్త నడిపే నాటుపడవలో వెళ్ళి సముద్రంలోకి డైవ్‌చేస్తారు. ఆమె తుంటిభాగానికి ఓ వైరు బుట్టను కట్టుకుని తను సేకరించినవాటిని అందులో నింపుతుంది. బుట్టతోపాటు గట్టి పొడుగాటి తాడునుకూడా కట్టుకుంటుంది. తాడు రెండవచివర పడవకి బంధించి వుంటుంది. ఫ్యూనడో మహిళలు 40 అడుగుల లోతు వరకూ వెళతారు. అవసరమైనన్ని నత్తగుల్లలు, చేపల్ని సంపాదించాక వాళ్ళు తాడును పట్టి గుంజుతారు. దాన్ని వారి భర్తలు అర్థంచేసుకుని తాడును పైకి లాగుతారు.

'ఫ్యూనడో' మహిళలు వెళ్ళినంత సముద్ర లోతుల్లోకి 'కచిడో' మహిళలు వెళ్ళరు. ఒక పడవలో 20 నుంచి 25 మంది కచిడో మహిళలు బయలుదేరినా పడవ నడిపేవాడు ఒక్కడే వుంటాడు. కాని,ఫ్యూనడోమహిళకుతోడుగాసదా ఆమె భర్త వెంటవుంటాడు-పడవ నడిపేవాడుగా! ఫ్యూనడో మహిళ జీవితమంతా డైవింగ్ వృత్తిలోనే వుంటుంది కాబట్టి తనకు తోడుగా వుండేందుకు సరయిన భర్తను ఆమె చాలా జాగ్రత్తగా ఎన్నుకుంటుంది.

సముద్రపు నీటిలో ఆమా మహిళ శ్వాసించేటపుడు ఈలవంటి ధ్వని వెలువడుతుంది. నీటిలో వుండగా ఆమె ముక్కుతో ఉచ్ఛ్వాసనిశ్వాసాలు జరపదు. తన వూపిరితిత్తులు శక్తివంతంగా రూపొందేందుకు నోటిద్వారానే శ్వాసిస్తుంది.

ఆమా మహిళలు సముద్రంలో ఏకబిగిన రెండుగంటలపాటు ముత్యాలు సేకరించాక,సముద్రపొడ్డున అరగంటసేపు విశ్రాంతి తీసుకుంటారు. అక్కడవారికి వేడినందించేందుకు ఎప్పుడూ ఒక మంట వెలుగుతూ వుంటుంది. ఆ విశ్రాంతి కాలంలో ఆమా మహిళలు తమ తడి దుస్తులను విప్పి, మళ్ళీ సముద్రంలోకి వెళ్ళేందుకై పొడి దుస్తులు ధరిస్తారు. తిరిగి వాళ్ళు రెండుగంటల తర్వాత బయటికొచ్చేటప్పటికి ఒడ్డున వదిలిన బట్టలు ఆరి వుంటాయి. అవి ధరించి ఈ విరామంలో అబాలెన్ చేపలను వేపుకుని తింటారు.

ఏప్రిల్, సెప్టెంబరు నెలలమధ్యలో అబాలెన్ చేపలు విరివిగా దొరుకుతాయి. ఆ కాలంలో ఆమా మహిళలు రోజుకి 6నుంచి 7గంటలపాటు 'డైవ్' చేస్తారు. వాళ్ళు నెలకి 20 రోజులు పనిచేస్తారు. ఆ పనివేళలు వాతావరణంపై ఆధారపడి వుంటాయి. ముత్యాల వేట జూన్, సెప్టెంబరు మాసాలమధ్య సాగుతుంది.

సముద్రపు నీటిలో పురుషుడి టెంపరేచర్ 40 క్షణాలకి 2 డిగ్రీలవరకూ తగ్గిపోతే, ఆమా మహిళలకు 1 డిగ్రీ మాత్రమే తగ్గుతుంది. ఇందువల్లే పురుషుల కంటే స్త్రీలకే ఈ వృత్తి అనుగుణంగా వుంటుంది.

 

నేడు ముత్యాల ఎగుమతిలో జపాన్ అగ్రస్థానంలో వుండటానికి కారణం ఆమా మహిళలే! ముత్యాలద్వారా జపాన్ ఎంతో విదేశీ మారకద్రవ్యం ఆర్జిస్తోంది!

# కొత్తరకపు ఫోన్



ఫోన్ చేసేవారికి డయల్ చేసే శ్రమను తగ్గించి, మరికొన్ని ఇతర సౌకర్యాలను కల్పించే డి.టి.ఎమ్.ఎఫ్.బి.పి. అనే కొత్తరకం టెలిఫోన్ వచ్చింది. ఆ టెలిఫోన్‌కి మీరు అధికంగా ఫోన్ చేయాల్సిన అవసరం వున్న 20 టెలిఫోన్ నెంబర్లు కలపబడి వుంటాయి. ఆ నెంబర్లకి 1 నుంచి 20 వరకూ వరస నెంబర్లు ఇస్తారు. ఏ నంబరు కావాలో తెలియజేయడానికి ఆ వరస నంబర్లు డయల్ చేస్తే చాలు... మీకు అవసరమైన నెంబరుకి కనెక్షన్ లభిస్తుంది. ఆ 20 నెంబర్లు కాక వేరే నెంబరుకి ఫోన్ చేయాల్సివస్తే మామూలుగానే డయల్ చేయకతప్పదు.

ఈ కొత్తరకపు ఫోన్‌కి 'హాట్-లైన్' సౌకర్యం కూడా వుంది. అంటే ఫోనులో మాట్లాడుతున్నంతసేపూ రిసీవర్‌ని పట్టుకోనక్కర్లేదు. రిసీవర్ తీసి పక్కన పెట్టి కూర్చుని మాట్లాడుకోవచ్చు.

ఒక్కొక్కప్పుడు మీరు ఆఫీసులో వుండగా మీ ఇంటి నెంబరుకు ఫోన్లు వస్తే మిస్సయిపోవడం జరుగుతుంది. ఈ టెలిఫోన్‌కి ముందుగా అవసరమైన సూచనలిస్తే ఇంటికొచ్చిన ఫోను యాంత్రికంగా ఆఫీసు టెలిఫోను నెంబరుకి మారేటట్టు చేస్తుంది.

కొత్తరకపు ఫోనులో అతి ఉపయోగకరమైన మరో సౌకర్యముంది. మామూలు ఫోనులో మీరు ఒకరితో మాట్లాడుతున్నపుడు మరొకరు మీ నెంబరుకి డయిల్ చేసి, మీతో మాట్లాడటం వీలుకాదు. ఈ ఫోనులో మీరు ఒకరితో మాట్లాడుతున్నపుడు ఎవరైనా మీనెంబరుకి డయల్ చేస్తే 'బీప్...బీప్'మని శబ్దం వస్తుంది. అంతవరకూ మాట్లాడుతున్న వ్యక్తిని కాసేపు ఆగమని చెప్పి ఫోన్‌కి వుండే ఓ బటన్ నొక్కి రెండో వ్యక్తితో సంభాషించవచ్చు. అది ముగిశాక తిరిగి మొదటి వ్యక్తితో మాటలు కొనసాగించవచ్చు. రెండవవ్యక్తితో మాట్లాతున్నపుడు మొదటి వ్యక్తికి, అతనితో మాట్లాడటం రెండోవ్యక్తికి వినబడటం అనేది జరగదు. అందువల్ల నిర్భయంగా సంభాషణ సాగించవచ్చు.

ఈ టెలిఫోన్‌ని అలారం వాచీలా కూడా వుపయోగించవచ్చు. టెలిఫోన్ కున్న డిజిటల్ వాచీలో, మీరు మేల్కోవలసిన సమయాన్ని ముందుగా అమర్చి పెట్టుకుంటే, ఆ సమయానికి రింగు రింగుమనే ధ్వని వినబడి మిమ్మల్ని

నిద్రలేపుతుంది.

ఇంతకీ ఈ టెలిఫోన్ తయారుచేసింది అమెరికా, ఇంగ్లాండ్, జపాన్‌లాంటి విదేశాల్లోకాదు. మన భారతీయ టెలిఫోన్ పరిశ్రమవారే తయారుచేసిన ఈ కొత్తరకపు ఫోన్ వాడుకను పరీక్షించేందుకు బొంబాయిలోని అతి ప్రముఖులైన 200 మంది గృహాలలో అమర్చారు.

## నీటిపై తేలే దేశం



స్వీడన్ 14 చిన్నచిన్న ద్వీపాలతో కూడిన దేశం. అందువల్ల దానికి 'నీటిపై తేలే దేశం'అని పేరు. ఆ దేశపు జనాభా 84 లక్షల మందిలో 90 శాతం ప్రజలు లూథరన్ మతానికి చెందినవారు. మిగిలినవారు కేథలిక్ క్రిస్టియన్లు.

స్వీడిష్ ప్రజలు వున్నదాంతోనే సరిపెట్టుకుని బతికే నిరాడంబరులు. వారికి ఆడంబరాలంటే గిట్టవు. వారిలో స్త్రీ పురుషులిద్దరూ కూడా కృత్రిమ అలంకరణ సాధనాలు చాలా తక్కువగా వుపయోగిస్తారు.

వేసవికాలంలో స్త్రీలు పైన వదులైన బనీన్లు ధరిస్తారు. ఆ బనీనుపై దైవ సంబంధమైన లేదా నవ్వు పుట్టించే రాతలుంటాయి. బనీను కింద బిగుతైన దుస్తులు వేసుకుంటారు.

స్వీడన్‌లో బహిరంగ ప్రదేశంలో ఎక్కడైనా సరే గుడారాలాంటితాత్కాలిక గృహాలు నిర్మించుకోవడాన్ని చట్టం అనుమతిస్తుంది. అందువల్ల అచ్చటి పర్యాటకులు హోటల్ బసకు ఎక్కువగా ఖర్చుపెట్టనవసరం లేదు.

స్వీడన్‌లో హోటళ్లు చాలా సౌకర్యవంతంగా వున్నా రేట్లు కూడా అంతే అధికంగా వుంటాయి. హోటల్‌లోని వుద్యోగులకి అధికమొత్తంలో వేతనాలు చెల్లించవలసి వుండటంతో, అక్కడ చాలా హోటళ్ళలో సెల్ఫ్ సర్వీస్ పద్ధతే వుంటుంది.

స్వీడన్ దేశపు రాజధాని స్టాక్‌హోమ్. క్రీ. శ. 1252లో నిర్మించిన ఆ నగరం బాల్టిక్ సముద్రం, గుడ్ సీలేక్‌ల మధ్యలోవుంది. కళాత్మకమైన రీతిలో నిర్మించిన భవనాలతో నిండిన నగరంగా స్టాక్‌హోమ్ ప్రపంచ ప్రసిద్ధి చెందింది.

స్వీడన్‌లో 16వ శతాబ్దంలో అప్పటి రాజు ఒక చర్చిలో భారీయెత్తున విందు ఏర్పాటుచేశాడు. విందు పూర్తయ్యాక రాజు ఆహ్వానితుల్లో ఆరుగురు రాజద్రోహుల్ని కనుగొన్నాడు.రాజ సైనికులు వారిని చర్చి వెనుకకు తీసుకెళ్లి శిరచ్ఛేదం చేశారు. ఆ ప్రాంతాన్ని ఇప్పటికీ స్మారక ప్రదేశంగా కాపాడుతున్నారు.

స్టాక్‌హోమ్‌లో 508 అడుగుల ఎత్తయిన టెలివిజన్ టవర్ వుంది. యాత్రికుల్ని టవర్‌పైకి తీసుకెళ్ళేందుకు ఓ లిఫ్ట్ వుంటుంది. టవర్‌పైకి చేరుకున్న వారికి దేశమంతా కనబడుతుంది.

స్వీడన్‌లో జనన మరణాల రేట్లు రెండూ అతి తక్కువే. అక్కడి ప్రజలు చాలా కాలం జీవిస్తారు. అందువల్లరోడ్ల మీద తిరిగేవారిలో పిల్లలు చాలా తక్కువగా, వృద్ధులు బాగా ఎక్కువగా




కనబడతారు.

పూర్వం రాజులు వేటకోసం ఉపయో గించిన అరణ్యాలను ఇప్పుడు వన్యప్రాణి రక్షణా ప్రాంతాలుగా మార్చేశారు. అక్కడ అనేక అడవిజంతువులు తమ సహజసిద్ధమైన పరిసరాలలో స్వేచ్ఛగా జీవిస్తుంటాయి.

శాకాహారం మాత్రమే భుజించేవారికి ఇబ్బంది లేకుండా స్వీడన్‌లో రుచికర మైన తాజా ఫలాలు, వెన్న, జున్ను, జామ్, పచ్చళ్ళు, పాలు, పెరుగు దొరుకుతాయి. అక్కడ 'శాకాహారి'నని చెబితే ఎవరూ అర్థం చేసుకోరు. శాకాహారులు "మాంసం, చేపలు, గుడ్లు లేని ఆహారం కావాలి" అని చెప్పాలి.

స్వీడిష్ ప్రజలు ఆంగ్లం బాగా మాట్లాడలేకపోయినా, ఇతరులు మాట్లాడితే అర్థం చేసుకోగలరు. వాళ్ళు తమ దేశాన్ని చూసేందుకు వచ్చిన విదేశీయుల పట్ల ఎంతో మర్యాదగా ప్రవర్తిస్తారు. విదేశీయులు డబ్బులిచ్చినా ఇవ్వకపోయినా వారంతటవారే తమ దేశంలోని చూడదగ్గ అనేక ప్రదేశాలను చూపుతారు.

వారిలో ఎక్కువగా వివాహబంధం లేకుండానే స్త్రీ పురుషులు కలిసి జీవించ డానికి ప్రాధాన్యత ఇస్తారు. అందువల్ల స్వీడన్‌లో పిల్లలు ఎక్కువమంది అవివాహిత స్త్రీలకి పుట్టినవారే అయి వుంటారు. ఇది విదేశాలలో వారికి తల వంపులు తెచ్చే విషయమే అయినా, ప్రభుత్వం దీన్ని అదుపు చేయలేక పోతోంది.

స్వీడన్ చుట్టూ సముద్రమే వుండ టంతో అక్కడ చాలామందికి తెడతో పడవ నడపడం, బోటు షికారే హాబీలు. స్వీడన్ సరస్సుల్లో ఏ సమయంలో చూసినా 2 లక్షల బోట్లు తిరుగుతుం టాయి.

స్వీడన్‌లో మరో ఆసక్తికరమైన అంశం రోడ్డుపక్కన వుండే సంగీత కారులు. రోడ్డు పక్కన కూర్చుని రకర కాల వాయిద్యాలపై వాళ్ళు వాయించే సంగీతానికి ఉత్తేజితులై కొత్తవాళ్ళు సైతం నృత్యం చేస్తారు. ఇది విదేశాలనుంచి వచ్చే యాత్రికులకో ప్రత్యేక ఆకర్షణ!

స్వీడన్‌లో హరేకృష్ణ వుద్యమ ప్రభావం బాగా వుంది. అనేకమంది స్వీడిష్ ప్రజలు హరేకృష్ణ వుద్యమ సాంప్రదాయపు దుస్తుల్లో కనబడతారు.

అక్కడ స్త్రీ పురుషుల మధ్య భేద భావం వుండదు. స్వీడన్‌లో చాలా హోటళ్ళలో డబుల్ రూమ్‌లు మాత్రమే వుంటాయి. ఒకరికొకరు తెలియని స్త్రీ పురుషులు కూడా ఎలాంటి సంశయం లేకుండా డబుల్‌రూమ్‌లో కలిసి వుంటారు!

# పొగతాగేవాళ్లు

నాగరిక ప్రపంచానికి పొగాకును పరి చయం చేసినవాడిగా కొలంబస్ పేరు చెప్పుకుంటారు. కొలంబస్ 15వ శతాబ్దపు చివరలోనే పొగాకును గురించి అమెరికాలో తెలియజెప్పినా, దాన్ని తాగడానికై విని యోగించడం చాలాకాలానికిగాని ప్రచార మవలేదు. యూరప్‌లో మొదట్లో పొగాకును వైద్యానికి పనికొచ్చే మొక్క గానే పరిగణించేవారు.

16వ శతాబ్దం మధ్యలో 'జీన్‌నికోట్' అనే ఫ్రెంచి దేశీయుడు పోర్చుగల్ రాయల్‌కోర్టులో ఫ్రెంచిదేశ రాయబారిగా

వుండేవాడు. అతను పొగాకులోని ఆరోగ్య విలువల గురించి విని, ఓ డచ్ దేశీయుడి వద్ద పొగాకు విత్తనాలు సంపాదించి తన తోటలో నాటించాడు. అతను పొగాకు పొడిని వుపయోగించి స్నేహితులు, ఇరుగుపొరుగువాళ్ళకి వచ్చిన కొన్నిరకాల రుగ్మతలను నయంచేసేవాడు. ఆవిధంగా పొగాకుకు ప్రచారంలభించింది. పొగాకులో వుండే 'నికోటిన్' అనే పదార్థానికి 'జీన్ నికోట్' వల్లనే ఆ పేరు వచ్చింది. ఆతర్వాత పొగాకుతో పొగతాగడం మొదలై విస్తృత వ్యాప్తి పొందింది. ఆ విధంగా యూరప్‌లో పొగతాగే అలవాటు విస్తరించుకున్నాక, మిగిలిన ప్రపంచ మంతటికీ వ్యాపించింది.

అమెరికాలో ప్రారంభమైన పొగతాగే అలవాటు నేడు వివిధ ప్రాంతాలలోని వివిధ జాతులవారిలో రకరకాలుగా



వాడుకలో వుంది. పొగాకును కొన్నిచోట్ల పంటినొప్పి, వాతం, ఇతర రోగాలకు నివారిణిగా వుపయోగిస్తుండగా, మరికొన్ని చోట్ల దాన్ని ముక్కుపొడుంగా వాడుతున్నారు.

దక్షిణ అమెరికాలో పుట్టిపెరిగిన కొందరికిపొగాకునునమిలేఅలవాటుండగా, కొందరు దక్షిణ అమెరికన్లకి పొగాకును చుట్టగా చుట్టి కాల్చడం ఇష్టం! పసిఫిక్ సముద్రతీర ప్రాంతంలో వుండే ఓ జాతివాళ్ళు పొగాకు పొడిని ఓ రకమైన చేపలతో కలిపి ఎంతో ప్రీతిగా తింటారు. కొన్ని ప్రదేశాలలో పొగాకును నీటిలో నానబెట్టి ఆ నీటిని తాగుతారు.

ఆఫ్రికా జాతుల్లో కూడా పొగతాగే అలవాటు బాగా వుంది. అక్కడి 'లాంబారీన్' అనే ప్రాంతంలో పురుషులకంటే స్త్రీలే ఎక్కువగా పొగ తాగుతారు. 'కావరేండోర్' జాతివాళ్ళు నోట్లో అటూ ఇటూ రెండు సిగరెట్లు, నాసికాపుటాల్లో రెండు సిగరెట్లు పెట్టుకుని, ఒకేసారి నాలుగు సిగరెట్లు తాగుతారు.

'నూయేర్' జాతివాళ్ళు పొగాకును బూడిద, ఎండిన ఆవు పేడలతో కలిపి, ఆ మిశ్రమాన్ని గుమ్మడిపండు డొప్పతో చేసిన పాత్రలో వుంచి ముట్టించి, పొడవాటి మట్టిపైపుల సహాయంతో పొగపీలుస్తారు.

1605లో అక్బర్ పరిపాలనా కాలంలో పొగాకు భారతదేశానికి తీసుకురాబడింది. పొగతాగే అలవాటు మొదట బిజాపూర్‌లో ప్రారంభమైనట్టు అసాద్‌బేగ్ అనేచరిత్రకారుడు పేర్కొన్నాడు. అతను గాళ్ళుపొదిగిన పైపుతోపాటు, కొంత మేలు రకమైన పొగాకును అక్బరుకి బహూకరించాడు. అప్పుడు పక్కనే వున్న రాజవైద్యుడు వారిస్తున్నా వినకుండా అక్బరు పొగతాగాడు. కాని, అక్బరు ఏనాడూ పొగతాగే అలవాటుకు లోనుకాలేదు. అసాద్‌బేగ్ మరికొందరు ధనికులకి కూడా ఆ పొగాకును ఇవ్వడంతో ఆ విధంగా దానికి ప్రచారం లభించి, మన దేశంలో దాని వర్తకం ప్రారంభమైంది!

# ఉప్పులేని భోజనం




మద్రాసులోని ఇంటెగ్రల్ కోచ్ ఫాక్టరీ ఉద్యోగి కె. రామచంద్రన్ గత పదిహేడేళ్ళ నుంచీ తను తినే ఆహార పదార్థాలలో ఉప్పువాడకాన్ని మానేశాడు. అతనా నిర్ణయం తీసుకోవడానికి ప్రేరేపించింది భగవద్గీతట!

గీతలో, 17వ అధ్యాయంలోని ౮వ శ్లోకంలో కృష్ణుడు అర్జునునితో, "ఆరోగ్యకరమైన, సాత్వికమైన జీవితాన్ని గడపదలచుకుంటే తినే ఆహారంలో ఉప్పు వాడటం మానేయాలి" అని బోధిస్తాడు.

"ఉప్పువల్ల శరీరానికి ఎట్టిప్రయోజనమూ చేకూరనపుడు, దాని వాడకం అనవసర' మనే ఆలోచనతో 1967 ఫిబ్రవరి 5న రామచంద్రన్ ఉప్పు తినడం మానేశాడు. దానివల్ల అతను మొదటి సంవత్సరంలో కొన్ని ఇబ్బందులుపడ్డాడు. అప్పుడప్పుడూ కాళ్ళలోనూ, కీళ్ళవద్ద నొప్పులొస్తుండేవి. కొంతకాలం తర్వాత ఇలాంటి లక్షణాలన్నీ వాటంతటవే తగ్గిపోయాయి. ఇప్పుడతనికి 54 ఏళ్ళయినా, ఆ వయసువాళ్ళు ఎవరూ లేనంత దృఢంగా వుంటాడు.

"దేహారోగ్యానికి ఉప్పు అవసరం లేదు. మన పూర్వీకులనిబట్టి ఉప్పు వాడకంలో వుందే తప్ప దానివల్ల మానవ శరీరానికి పెద్దగా వుపయోగం లేదు. నిజానికి 'సోడియం క్లోరైడ్' విషతుల్యమైనది. ఉప్పునీటి వాడకపు పాత్రలు కొంతకాలానికి పాడైపోవడాన్నిబట్టి మనం ఈ నిజాన్ని గ్రహించవచ్చు" అంటున్నాడు రామచంద్రన్.

అతను పొద్దున్నే కప్పుడు పాలు, మధ్యాహ్నం భోజనం, రాత్రి తాజా కాయగూరలు, పాలు తీసుకుంటాడు. ఉప్పులేని తిండివల్ల అతనిలో ఆకలి తగ్గిపోయింది.

రామచంద్రన్ ఇంట్లో మిగిలిన అందరూ ఆహారంలో ఉప్పు వాడతారు. వారిలో ఎవరినీ ఉప్పు మానేయమని వత్తిడిచేయడతను!

# చెంచాల చర్చి

మెక్సికోకి చెందిన 'రాల్ జూనిక్'కి చిన్నప్పటినుంచీ తను తినే తిండిమీద ఏమాత్రం శ్రద్ధవుండేది కాదట! దానికి



బదులుగా అతను తినేందుకు సాయపడే చెంచాలు, ఫోర్కులు, కంచాలు మొదలైన వస్తువులపై అధికాసక్తిని కనబర్చేవాడట!

అది చూసి జూనిక్ తల్లిదండ్రులు ఎంతో ఆందోళన పడేవారట. కాని,వాళ్లే నేడు కొడుకుని చూసి చాలా సంతోషిస్తున్నారు. ఎందుకంటే చెంచాలు, ఫోర్కులు, కత్తులతో చక్కటి కళాఖండాలను సృష్టించే కళాకారుడు ప్రపంచంలో జూనిక్ ఒక్కడే!

జూనిక్ చెంచాలు, ఫోర్కులనుపయోగించి అనేక అలంకరణ వస్తువులను తయారుచేశాడు. కేవలం చెంచాలు, కత్తులను మాత్రమే ఉపయోగించి అతనో చర్చిని రూపొందించాడు. కాని, జూనిక్‌కి చెంచాలు, కత్తులతో పక్షులను తయారు చేయడమే ఎక్కువిష్టం!ఆ విధంగా అతను గుడ్లగూబ, పిచ్చుక, రామచిలుక, నెమలి బొమ్మలు ఎన్నో తయారుచేశాడు.

జూనిక్ అలా చేస్తుండటం చూసి మొదట్లో చాలామంది అది 'పిచ్చి హాబీ' అని ఎగతాళి చేసేవారట. కాని, ఇప్పుడు వాళ్లే జూనిక్ చెంచాలతో సృష్టించిన కళాఖండాల్ని అధిక ధరలకి కొనుక్కుని, తమ డ్రాయింగ్‌రూముల్లో అలంకరించుకుంటున్నారు!

ప్రపంచంలోని అనేక ప్రదేశాలలో జూనిక్ తను సృష్టించిన వస్తువుల ప్రదర్శనను నిర్వహించాడు. వాటి ద్వారా ఇప్పుడతను ఎంతో ధనవంతుడయాడు కూడా!

## మరణ శిక్షలు

పూర్వకాలంలో నేరస్తుల్ని చంపించేందుకు వివిధ దేశాల రాజులు అతి క్రూరమైన పద్ధతులనుపయోగించేవారు. అంత క్రూరంగా చంపటంవల్ల నేరాలు తగ్గుతాయని వాళ్ళు నమ్మేవారు.

ప్రతి దేశానికీ నేరస్తుణ్ని చంపడంలో తనదైన ఓ పద్ధతి వుండేది. కొన్ని దేశాలలో అది బహిరంగంగా జరిగేది. నేరస్తుణ్ని జనం మధ్య నిలిపి, అతని నేరాలన్నీ వారికి చదివి వినిపించి, ఆ గుంపు వికృతానందంతో చప్పట్లు కొడుతుండగా అతన్ని క్రూరంగా చంపేవారు.



బాబిలోన్‌లో నేరస్తుడిని చివరి శ్వాస కోల్పోయేవరకూ నీటిలో ముంచి చంపడం జరిగేది.అసిరియాలో నేరస్తుడు మరణించే వరకూ వాడిగా వుండే మేకుల్లాంటి వాటిని అతని శరీరంలోకి దింపేవారు.

ఇజ్రాయెల్‌లో రాళ్లతో కొట్టిగాని, మంటల్లోకి తోసిగాని చంపేవారు. జర్మనీలో నేరస్తుడిని గొడ్డలితో నరికే వారు.

చైనాలో సాధారణంగా మరణశిక్ష అంటే తల తీసేయడమే! అక్కడ తలారి తాను కేవలం దైవాజ్ఞను నిర్వర్తించడమే చేస్తున్నట్టుగా ఉరి తీసేటప్పుడు ఎప్పుడూ తెల్లటి ఉడుపులే ధరిస్తాడు. ఉరి తీయబడేవారి తల లేదా శరీరం నుంచి ఒక్క బొట్టు కూడా రక్తం తన మీదకు చిందకుండా తలారి జాగ్రత్త పడతాడు. ఒకవేళ తలారి తెల్లటి బట్టలపై రక్తం గనుక పడితే అందుకుగాను అతను ఉరి తీయబడతాడు.

రోమ్‌లో మరణశిక్ష విధించబడిన నేరస్తుణ్ని పర్వత శిఖరంపై నుంచి లోయలోకి దొర్లించేవారు. గ్రీకులో తండ్రిని చంపినవారికి ఓ వింతశిక్ష విధింపబడేది. అతన్ని పాము, కోతి, కోడిపుంజు, కుక్కలతో కలిపి ఓ బరువైన సంచికి కట్టేసి నదిలో లోతుకి వదిలేస్తారు. ఈవిధమైన శిక్షకు వెనుక వున్న కారణమేమిటో ఎవరికీ తెలియదు.

భారతదేశంలో నేరస్తుణ్ని ఉరి తీయడం గాని, చెట్టుకు కట్టి బల్లెంతో పొడిచి చంపడంగాని జరిగేది.

ఫ్రెంచి విప్లవకాలంలో 'గిల్లోటైన్' అనే సాధనాన్ని ప్రవేశపెట్టడం ద్వారా యంత్రాలతో మరణశిక్ష అమలుపర్చడం వాడుకలోకి వచ్చింది. ఆ పద్ధతిలో నేరస్తుడి తలను రెండు పదునైన లోహపు ప్లేట్ల మధ్య అమరుస్తారు. లీవర్‌ని నొక్కగానే అతని తల ఛేదింపబడి శరీరంనుంచి విడిపోతుంది.

శాస్త్రవిజ్ఞానం, నాగరికత పెంపొందాక మరణశిక్షా విధానాల్లో అనేక మార్పులు ఏర్పడినై. ఎలక్ట్రిక్ కుర్చీలో కూర్చోపెట్టి, గేస్ ఛాంబర్‌లో వుంచీ, ఇంజెక్షన్‌ద్వారానూ చంపే పద్ధతులు వచ్చాయి.

ప్రస్తుతం చాలామంది మరణశిక్షను రద్దుచేయాలని కోరుతున్నారు. సమాజాన్ని సంస్కరించడం ద్వారా నేరాల్ని అరికట్టవచ్చు గాని మరణశిక్షల్లాంటి విపరీత పద్ధతులవల్ల కాదని సామాజిక వేత్తలు వాదిస్తున్నారు. 'ఈ మరణశిక్షలు నేరాల్ని తగ్గించాయా?' అని వారు ప్రశ్నిస్తున్నారు.

# వృద్ధురాలి ఘనత

ఈరోజుల్లో యువతులు కార్లు, స్కూటర్లు నడపడం సాధారణ దృశ్యమే! కాని, సూరత్‌కి చెందిన డాక్టర్ ప్రభావతీ దీక్షిత్ అనే 65 ఏళ్లావిడ ఈ ఆధునిక యువతుల్ని తలదన్నేలా ఎన్నో గంటల పాటు విజయవంతంగా విమానం నడిపి, పైలట్ లైసెన్సు సంపాదించుకుంది.

చూడగానే గౌరవభావం కలిగేట్లు, చీరలో నిరాడంబరంగా కనబడే డాక్టర్ ప్రభావతి కార్లు, విమానాలను వేగంగా నడుపుతుందంటే నమ్మడం కష్టం. ఆవిడ ఓ ఫ్లయింగ్ క్లబ్‌లో 60 ఏళ్ల వయసులో ఫ్లయింగ్ నేర్చుకోవడం ప్రారంభించింది.

భారతదేశంలోని పెద్దపెద్ద నగరాలన్నింటిలోనూ ఫ్లయింగ్‌లో శిక్షణ ఇచ్చే ఫ్లయింగ్ క్లబ్బులుంటాయి. 18 వయసు కలిగి, మెట్రిక్యులేషన్‌లో ఉత్తీర్ణులై వుండటం అందులో ప్రవేశానికి కనీసార్హతలు. ఒక గంట ఫ్లయింగ్‌కి ఆ క్లబ్బులో

85 నుంచి 150 రూపాయలవరకూ తీసుకుంటారు. శిక్షణాకాలంలో కొంతగడువు దాటాక ట్రెయినీ 20 నుంచి 25 గంటల పాటు విమానాన్ని స్వంతంగా నడపలేక పోతే అది అనర్హతగా పరిగణించి, అతనికి శిక్షణ విరమిస్తారు.

40నుంచి 60గంటలపాటువిమానాన్ని స్వంతంగా నడపగలిగిన వారికి ప్రైవేటు ఫ్లయింగ్ లైసెన్సు ఇస్తారు. ఈ 60 గంటలలో అతను విమానంలో మరో దేశం వెళ్లి సురక్షితంగా తిరిగిరావాలనే నిబంధన ఒకటివుంది. మరో ప్రధానమైన నిబంధన ఏమంటే, ట్రెయినీ 5 గంటల పాటు గ్రౌండ్ కంట్రోల్‌నుంచి ఎలాంటి సలహాలు, సహాయం పొందకుండా విమానం నడపగలిగివుండాలి.

డాక్టర్ ప్రభావతి ఫ్లయింగ్‌లో చేరేందుకు డాక్టర్ సునీలాజనేకర్ బాగా ప్రోత్సహించింది. ఆవిడ ప్రైవేట్ పైలట్స్ క్లబ్ సభ్యురాలు. డాక్టర్ ప్రభావతికి ఉదయపూర్‌లో జరిగిన ఓ మెడికల్ కాన్ఫరెన్స్‌లో డాక్టర్ సునీల కలిసింది. ఆవిడ ప్రోత్సాహంతో ప్రభావతీ, ఆమె భర్త సూరత్‌లోని ఫ్లయింగ్ క్లబ్‌లోవాకబు చేశారు.

కాని, అక్కడి ఫ్లయింగ్ క్లబ్‌లో అన్ని సౌకర్యాలూలేవు. ప్రభావతి క్లబ్బు సెక్రటరీని కల్సుకుని తన అభిలాషను వెల్లడించింది. సెక్రటరీ ఆ వృద్ధురాలి ఆసక్తి చూసి ఆశ్చర్యపోయాడు. యథా విధిగాపెట్టే పరీక్షలు ముగిశాక ఆవిడకు ఫ్లయింగ్ క్లబ్బులో ప్రవేశం లభించింది కాని, మనదేశంలో ఆవియేషన్ ఇంధనం కొరత ఏర్పడటంవల్ల ఫ్లయింగ్ శిక్షణ కొన్ని నెలలపాటు ఆగిపోయింది. తిరిగి 1982లో ఆవిడ తర్ఫీదుపొందడం మొదలైంది. ఆవిడ అతిత్వరగా ఫ్లయింగ్ నేర్చుకుని చాలాత్వరగా ఫ్లయింగ్ లైసెన్స్ సంపాదించింది.

డాక్టర్ ప్రభావతి భర్త దీక్షిత్ కూడా డాక్టరే. వారిది ప్రేమవివాహం. బొంబాయిలో జన్మించిన ప్రభావతి డాక్టరే కాక సంఘసేవకురాలు కూడా. ఆవిడ బొంబాయిలో స్త్రీలు ఎదుర్కొనే అనేక సాంఘికసమస్యల పరిష్కారానికై కృషి సల్పింది.

అమెరికా సంయుక్తరాష్ట్రాలలోని సిటిల్‌లోగల 'అమెరికన్ ఆర్మీ మెడికల్ కార్ప్స్'లోని వారి కుమార్తె రేఖ, ఆమె భర్త కూడా డాక్టర్లే. అతను ఇ.ఎన్.టి. స్పెషలిస్టు. ప్రభావతి వీలుచిక్కినప్పుడల్లా విమానం నడుపుకుంటూ అమెరికా వెళ్లి కుమార్తెను చూసివస్తుంది. తన భార్య మంచి కారు డ్రైవరేకాక, పైలట్ కూడా అయినందుకు దీక్షిత్ గర్విస్తాడు.

"కారుకంటే విమానం నడపటమే సులువు. ఆకాశంలో ట్రాఫిక్ సమస్యలనేవి వుండవుకదా!" అంటుంది డాక్టర్ ప్రభావతి చిరునవ్వుతో.

—0—

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

# ఉచిత కానుక!

# గ్లూకోన్-డి ® యొక్క తక్షణ శక్తితోపాటుగా



# ఆకర్షణీయమైన స్టెయిన్‌లెస్ స్టీల్ చెమ్చా ఒకటి.

తక్షణ శక్తినిచ్చే మీ దినసరి పానీయం. దాన్ని కలుపుకోడానికొక చక్కని సాధనం.

ఈ తళతళ మెరిసే స్టెయిన్‌లెస్ స్టీల్ చెమ్చా గ్లూకోన్-డి 400 గ్రా. ప్యాక్‌తో పూర్తిగా ఉచితం.

తాజాదనాన్ని, వెల్లగా శక్తిని ఇచ్చే గ్లూకోన్-డి విటమిన్ డి, కాల్షియం, ఫాస్ఫరస్‌లతో బలపరచబడినది. దాన్ని అలాగే తీసుకోండి, లేదా పళ్లరసం, పాలు, టీనీరు, కాఫీ, లేదా మంచినీళ్లలో కలిపి తీసుకోండి.

అయితే ఒక్కటి! దాన్ని గ్లూకోన్-డి ప్రత్యేక కానుక చెమ్చాతో మట్టుకు కలిపి తీసుకోండి!

GLL 9686







స్టాకు పరిమితం
నిర్ణీత స్థలాలలో మాత్రమే లభ్యం.

తక్షణ శక్తి కోసం - గ్లూకోన్-డి ®

మంచి ఆరోగ్యానికి మూలస్థానం.
గ్లాక్సో

